# సాహిత్య సమాలోచనము

సాహిత్యాచార్య

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు, ఎం. ఏ.,

ఆంధ్రోపన్యాసకులు : హిందూ కళాశాల : గుంటూరు



శారదాపీఠము : గుంటూరు - 2

మూడు రూపాయలు



ప్రథమ ముద్రణము, మార్చి 1946
ద్వితీయ ముద్రణము, మే 1954



వెల్‌కం ప్రెస్ : గుంటూరు - 2

## ప్రేమోపహారము





పండితోత్తములు, విమర్శకాగ్రేసరులు
చరిత్రరచనాచతురులు, గురూత్తములు

### బ్రహ్మశ్రీ వేదమూర్తి
### కురుగంటి సీతారామ భట్టాచార్యుల వారికి

# విషయ సూచిక




| | వ్యాసము | పుట |
|---|---|---|
| 1 | సాహిత్యోద్దేశము | 1 |
| 2 | మాటలలో భావార్థములు | 7 |
| 3 | కవి - సమాజము | 17 |
| 4 | విమర్శకుడు - కళోపాసకుడు | 24 |
| 5 | కవి - చిత్రకారుడు | 35 |
| 6 | పద కవిత్వము | 41 |
| 7 | ప్రబంధ వాఙ్మయము | 54 |
| 8 | ఆంధ్ర వచన స్వరూపము | |
| | ౧ సూత్రగ్రథనము | 66 |
| | ౨ అన్వయము | 83 |
| 9 | అభినవ కవిత | 105 |
| 10 | రూపక వికాసము ౧ | 129 |
| | ,, ,, ౨ | 140 |
| 11 | సాహిత్య పరిణామము | 147 |
| 12 | సాహిత్యార్చనము | 164 |

# సాహిత్యోద్దేశము

లోకవ్యవహారములో సాహిత్యము - సారస్వతము - వాఙ్మయము - అను పదములు సమానార్థక పదములుగా ప్రయుక్తములగుచున్నవి. కాని యీ మూఁడు పదము లర్థములో నంతరము కలవిగాఁ బరీక్షమైఁ దెలిసికొనఁ గల్గుదుము. సాహిత్య మనునది దేశకాలపరిమితము గాక, సర్వకాల సర్వజనీనముగా నుండి విశ్వశ్రేయస్సును గోరి నిర్మింపఁబడిన కావ్యసంచయము నర్థఁ జెందును. సారస్వత మనునది యక్షర రూపమైన సకల విద్యా శాస్త్ర కళాదులకు వర్తించును. వాఙ్మయ మనఁగా వాక్కు-యొక్క- వికారము; అనఁగా లిఖితసంభాషణాది సమస్త వాగ్వ్యవహారమునకును వాఙ్మయ మను పదము చెల్లును; ఇది సర్వసాధారణమైన పదము. సాహిత్యము-సారస్వతము-వాఙ్మయము: ఇవి యుత్తరోత్తర విశాలములైనవి. ఈ మూఁడు నొకే కేంద్రముగల మూఁడు వలయముల వంటివి. సాహిత్యము పరిమిత వలయము; దీనిని సారస్వత వలయము జుట్టినది; ఈ రెంటినిఁ జుట్టినది వాఙ్మయ వలయము. సాహిత్యమును, సారస్వతమును వాఙ్మయమని పిలువవచ్చును. కాని సారస్వత వాఙ్మయము లనునవి సాహిత్యమునకు వర్తింపవు.

ఇఁక నుద్దేశమను బదము: ప్రతివస్తువునకుఁ గార్యకారణ భావమున్నది. ఘటమునకు మృత్తిక కారణము; అట్లే మానసిక సంబద్ధ విషయములకును గార్యకారణభావమున్నది. మానవుఁ డేకార్యము నిర్వహించినను దాని వెనుక నొక యాలోచన యుండితీరును, ఈ యాలోచనమునే యుద్దేశమని, కారణము

నియు ననఁజెల్లును; ఇది పునాదివంటిది. ఒక యుద్దేశమున బురస్కరించుకొని మానవుఁ డొక కార్యము నిర్వహించును. అతఁ డాశించిన యా యుద్దేశము పరిణామఫలముగాఁ దిరిగి ప్రతిఫలించును. ఉద్దేశము - కార్యము - పరిణామము: ఇది క్రమము. వీనిలో నుద్దేశము లోపించినను బరిణామపరిశీలనముచే దానిని గుర్తింపవచ్చును. కాని, కార్యముంబట్టి దానినెఱుఁగవచ్చును. ఇవ్విధముగా నుద్దేశ కార్య పరిణామము లన్యోన్యాశ్రయము లగుచున్నవి.

కాఁగా, సాహిత్యోద్దేశ మిపుడు ప్రసక్తవిషయము. సాహిత్యము 'సత్యం, శివం, సుందరం' అను పరమాశయముల నిమిడ్చికొనినది. సాహిత్యమునకుఁ గవి - విమర్శకులు ప్రవక్తలు. సౌందర్య ద్రష్టయు స్రష్టయుఁ గవి. దీననే లాక్షణికు లాతని 'కవిబ్రహ్మ' యనినారు. విమర్శకుఁడే తద్వ్యాఖ్యాత. సాహిత్య మొక మధుర దర్శనము. తదితర దర్శనముల నవలోకించుట కెంతటి యధికారము మానవునకు వలయునో సాహిత్య దర్శనమున సాక్షాత్కారమున కంతటి యధికారము వలసి యున్నది. సహృదయత్వము, రసజ్ఞత, వ్యుత్పన్నత సాహిత్యారాధనమున కుపకరణములు.

సహృదయత్వ మనఁగా హృదయము గలిగియుండుట యని సామాన్యార్థము. ప్రతివానికి హృదయ మున్నది; కాని యది యున్నటుల తెలియువాఁడే సహృదయుఁడు: అనఁగా 'నాత్మవేదనోన్ముఖమైన యంతరంగము' కలవాఁడు. నిష్పాక్షికముగా, నిష్కలంకముగా సానుభూతితో నాయా వాతావరణములయందు సంచరింపఁగలిగి యాయా పాత్రలనుగాని,

విషయములనుగాని యవలోకించి తత్తదనుగుణముగా స్పందించు హృదయము కల్గియుండుట.

రసజ్ఞత యనఁగా రసము నెఱుఁగుట యని వాచ్యార్థము ; అనఁగా విభావానుభావ సాత్త్విక వ్యభిచారీభావ సంయోగ ఫలితముగా పర్యవసించు రసస్వరూపమును దెలియుట. విభావాదికముల నెఱుఁగకయే యాయా భావములకుఁ దత్తదనుగుణముగా సంచలనముఁ బొందువారును రసజ్ఞులే. లక్షణాదికము నెఱిగియు రసజ్ఞులు కానివా రున్నారు.

ఇఁక వ్యుత్పన్నత యనఁగా లోకశాస్త్రానుభవముతోఁ గూడిన పాండితి. పరిజ్ఞానము సమకూర్చుకొనుటలో దేశాటనము, బహుకావ్యపఠనము, సంప్రదాయజ్ఞులైన మహాత్ముల సాంగత్యము మున్నగునవి తోడ్పడవలెను. ఇన్నింటితో నుదయించిన సంస్కారమే వ్యుత్పన్నత యగును. ఇవ్వి కల్గియు సంస్కారముఁ బొందని వా రున్నారు.

ఈ యుపకరణములతోడనే సాహిత్యారాధనకుఁ బూనుకొనవలెను. అప్పుడే సాహిత్యోద్దేశమును గ్రహింపవచ్చును. ఎంతవఱ కీ యుపకరణములు లేక పరిశీలించుచుందుమో యంతవఱకు సాహిత్యోద్దేశము ప్రశ్నారూపముననే యుండి యనేక యపోహాలకుఁ దావిచ్చును. నేడు లోకమున వ్యవహరింపఁబడుచున్న సాహిత్య మనునట్టిదిగాని, సాహిత్యోద్దేశ మనునట్టిదిగాని నిత్యమైన సాహిత్యపరములు గావు, సార్వజనీన, సార్వకాలీనత లందు మృగ్యములు.

సాహిత్యోద్దేశ మన్ని కాలములందు, నన్ని దేశములందు నొకటియే యయియుండును. జీవితోద్దేశ మెట్లు బ్రహ్మానందానుభవమో, అట్లే సాహిత్యోద్దేశము సైతము బ్రహ్మానంద సహోదరమగు రసానందానుభవ మగును. 'రసోవైసః' అను శ్రుతివాక్యము జీవితమునకు, సాహిత్యమునకుం జెందినది. ఋషిప్రోక్తమైన వాక్యము బ్రహ్మానంద సాధకులకు ప్రమాణము. రసానంద పిపాసులకుం గవివాక్య మట్టి ప్రమాణము. కవి ఋషితుల్యుఁడు. కావుననే 'నానృషిః కురుతే కావ్యం' అనినారు.

మోక్షగాముల కెట్లనేక పథము లనుగమ్యమానములై ప్రతీయమానము లగుచున్నవో యట్లే సాహితీ దర్శనాలత్యము నుగడించుట కనేక మార్గము లాయా యుగములలో ననుగమ్యమానములైనవి. ఆ యా మార్గములే యా యా కాలానుగుణముగ నుద్భవించిన యుద్యమముల పరిణామములు.

వైదిక వాఙ్మయముయొక్క గహనతయే పురాణగ్రంథ రచనోద్యమమునకు హేతువు. శైవ వైష్ణవ సంఘర్షణమే వీరశైవ వీరవైష్ణవోద్యమములకుం గారణము. అనుకరణ బాహుళ్యమే స్వతంత్రరచనోద్యమమగు ప్రబంధ ప్రక్రియకు దారితీసినది. కర్మసిద్ధాంతాచారణాశక్తతయే భక్తిమార్గావలంబనమునకుం గారణము. ప్రాచ్యసాహిత్య సూత్రములపైం బ్రత్యయము లేకపోవుట వలన నేమి, కాలాభావము వలన నేమి, సామాన్యజనుల కందుబాటులో సాహిత్యము నుంచవలె నను నుద్దేశమే నవ్యసాహిత్యోద్యమమునకు మూలము. ఈ విధ

ముగా నుద్యమములు బయలుదేరి సాహిత్యము ననేక గతుల నడిపినవి.

ప్రాచీన లాక్షణికుల సాహిత్యోద్దేశము నించుక గమనింతము : సప్తసంతానములలోఁ గావ్యము శాశ్వతమైనది. లాక్షణికుఁడు 'విశ్వశ్రేయః కావ్యం' అనినాఁడు; అనఁగా నందు సార్వజనీనత యుండవలెనని సూచ్యార్థము. 'వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' అనుటలో నాతఁడు విశ్వశ్రేయ స్సెట్లు కలుగఁజేయవచ్చునో లక్షీకరించినాఁడు! కావ్యాత్మను మీమాంస యొనరించి లాక్షణికులు రసానందానుభవమునకుఁ గావ్యమందలి వివిధాంశములను బృథక్కరించినారు. అవియే రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి, అనుమాన, ఔచితులు. లక్ష్యమొక్కటియే నాటికి నేటికి; కాని దానిని సమీపించు మార్గములు మాత్రము భిన్నములు!

జీవితలక్ష్యమును సాధించుటకుఁ గర్మ, జ్ఞాన, భక్తి మార్గము లుద్దేశింపఁబడినవి. ఆత్మానందమే పరమోత్కృష్టమైన జీవితధర్మము. తదానంద సంధానమునకే యీ మార్గములు. సాహిత్య మీ త్రిమార్గాశ్రయము : ప్రభు, సుహృ, త్కాంతా సమ్మితములని లాక్షణికుఁడు వ్యపదేశించినాఁడు. వేదములు కర్మను విధించునవి. పురాణములు ధర్మపథముల నడచినవారిని గూర్చి నివేదించి, కర్తవ్య ధర్మముల నిరూపించి, ఫలాపేక్షలో మనుజునికి నుత్సాహమునుఁ గల్పించునవి. కావ్యము లోకము నొకవిధముగ మరిపించి మురిపించునది.

అయ్యది కాంతవాక్కువలె సున్నితముగ, సుకుమారముగ, లలితముగ, వ్యంగ్యమాత్రవిలసనముతో సంస్కరించునది!

సాహిత్యము సౌందర్యమూర్తి. సౌందర్యావిష్కరణాస్వాదనములు సహృదయ వేద్యములు. సాహిత్యోపాసనమే యాశ్వరోపాసనము. ఇది సౌందర్యోపాసనము. రససిద్ధి లేక సౌందర్యసాక్షాత్కారమే యేతత్ఫలము. ఇయ్యది యలౌకికానంద స్వరూపము; అతీంద్రియమైనది. ఇట్టి యానందము నశరీరముగ ననుభవింపఁదగినది.

సాహిత్యము రాజస తామస వృత్తులను లీనమొనరించి శుద్ధసత్త్వమును ప్రకాశింపఁజేసి తద్ద్వారా సౌందర్యాలోకనమున కర్హత నిచ్చునది. సాహిత్యము నిరంతర భావనా విశేషముచేఁ బరబ్రహ్మానంద సహోదరమగు నానందము నాస్వాదింపఁ జేయునది. నిత్యచైతన్యము గలిగినట్టి, శుభప్రదమైనట్టి రసానుభవమును గల్గించి మనోనేత్రమునకు దివ్య సాక్షాత్కారము గల్గించునది సాహిత్యము!

ఇట్టి పరమోత్కృష్టోద్దేశము గలది సాహిత్యము. అంచేతనే యిది మధురదర్శన మైనది!

# మాటలలో భావార్థములు

ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రా సంసారం న దీప్యతే

అని శబ్దమునుగూర్చి లాక్షణికుఁడైన దండి వచనము. శబ్ద మను జ్యోతి లేకున్న నంధతమస్సులతో ముల్లోకములు నిండి యుండెడివని తాత్పర్యము. శబ్దమున కంతటి విలువయున్నది. నాద ప్రతి మార్థములని శబ్దము త్రిగుణాత్మకమైనది.

"భావః కవే రభిప్రాయః కావ్యేవాసిద్ధి సంస్థితః" అని భావమునుగూర్చి యాతని వచనమే. కావ్యగతమైన కవి యభిప్రాయము భావ మని నుడివినాఁడు. భావ మను పద మనేక పదార్థములకుఁ జెందుచున్నది. స్థితి, మత, తాత్పర్య, ఇంగితాది వివిధావస్థల కీ పదము వర్తిలుచున్నది. ఇట్లే యర్థ మను పదము హేతు, ఇచ్ఛ, ప్రయోజన, ఆకూతాది వివిధా వస్థలకు సరిపోవుచున్నది.

కాఁగా, భావార్థములు శబ్దము నాశ్రయించినవి. శబ్దము లేనిదే యర్థము లేదు; భావ మంతకన్నను లేదు. అట్లే భావములేక శబ్దమునకు స్థితిలేదు; అర్థము గాకపోయిన భావము స్ఫురింపదు. ఇవ్విధముగా శబ్దార్థభావము లన్యోన్యాశ్రయములు. శబ్దార్థములు ప్రకృతి పురుష సంబం ధము కలవిగా కవి కాళిదాసుని సూక్తి.

కాని భావార్థముల కంతర మున్నట్లు సూక్ష్మపరిశీలనమువలనఁ దెలియును. అర్థము శబ్దగతము; అది శబ్దము నర్థించిన వచ్చునది. శబ్దము భాషాశాస్త్రసంబంధి. కనుక నర్థము భాషాతత్త్వము మీఁద నాధారపడినది. అర్థజ్ఞానము నందధికారము గలవానిని పండితుఁడందుము.

భావ మనఁగా నర్థమేకాక యర్థాంతరముగూడ. ఇది సందర్భపురస్కృతము. మానవుఁడు దాను భావించిన యంశమును బదజాలము ద్వారా యందించును. ఒక్కొక్కప్పు డాతని భావమును సంపూర్ణముగా నా పదములు వ్యక్తీకరింపకుండుట యనుభవసిద్ధము. భావము, పదములను నిమిత్తముగాఁ గైకొని సందర్భమును స్మరింపఁజేయుచు విహరించునది. సందర్భశుద్ధి, సన్నివేశ ప్రాధాన్యము, పాత్రముల పౌర్వాపర్యములు, శబ్దార్థములతో సమన్వయించుకొని సమూహముగా విచారించినపుడు వచ్చు విశేషము భావము. భావమునకుఁ బదము కేంద్రము వంటిది. సందర్భాదిగుణములు వర్తులముల వంటివి. ఉదాహరణమునకు భారత సభాపర్వములో భీష్ముఁడు ధర్మజునితో శిశుపాలునిగూర్చి యనిన వచనము నారయుఁడు :

"పాలిత దుర్నయుండు, శిశుపాలుఁడు, బాలుఁడు; వీనినేల భూ
పాలక నీకుఁ బట్టువడుపన్? మఱి ధర్మువెఱుంగ వీనికిం
బోలునె? రాగకోప పరిభూత మనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్త మహాత్మకివాదశీలికిన్!

అచ్యుతు నర్చితుఁజేయఁగా శిశుపాలుఁడు ధర్మరాజు నాక్షేపించుట, అందులకుఁ బ్రియవచనములతో శిశుపాలుని ధర్మజుఁ డనునయించుట లిందుఁ దెలియవలయును. ఆ పిమ్మటగాని భీష్ముని వచన మన్వయముగాదు. పద్యములో 'శిశుపాలుఁడు బాలుఁడు' అనినపుడు శిశుపాలుఁ డమాయకుఁడనియు, అల్పుఁడనియు, సదసద్వివేచనాజ్ఞానశూన్యుఁడనియు నర్థాంతరమగు భావము. 'నీకు' అనినపుడు, సర్వధర్మకోవిదుఁడు, నీతి విచక్షణుఁడు, న్యాయపరిపాలకుఁడు నగు నంతటి గొప్పవాఁడైన ధర్మరాజునకు అని భావము. అంత ఉదాత్తగుణపూర్ణున కింత యవినీతిపరునితో మాటలతో నిమిత్తమేమి? అని అన్వయము. తుది రెండు పాదములకు ఎంత విశదీకరించినను ధర్మపరిపాలనాశక్తి యట్టి నీచున కలవడునా యనియు, నేల యీ కాలయాపన మనియు భావము. ఈవిధముగా భావ మర్థాంతరము.

భావము కవి హృదయగతమైనది. కవి హృదయము సహృదయుఁడైన రసజ్ఞునకే వేద్యము. కవి హృదయసదృశమైన హృదయము కలవాఁడు సహృదయుఁడు. కావున భావము సాహిత్య తత్త్వముపై నాధారపడినది. ఉత్తమ భావాధికారము కలిగినవానిని సాహితీపరుఁడందుము.

కవి భావించినది భావమని తెలిసికొంటిమి. భావించుట యనఁగా నిరంతరాలోచనముచే సాధితమైన ఒకానొక క్రియావిశేషము. 'ఆత్మతో సంభాషించుటయే భావించుట' యని యొక పాశ్చాత్యుని నిర్వచనము. కవి యాలోచనముచే

మథించి, గ్రథించి దర్శించిన యొక రసమయగోళము భావము. మహోన్నతభావము లన్నియు హృదయాంతరాళములనుండి ప్రవహించును. హృదయమార్ద్రమై, రసగ్రహణ గుణసమన్వితమై, నిగ్గును దేల్చు సున్నితయంత్రమై వర్తిల్లును. సమస్త కలుషములు హృదయములో స్వచ్ఛఫలకమందువలెఁ బ్రతిఫలింపగలవు. సుసంస్కృతమై, శ్రేయోదాయకమై, సమగ్రమై, సుందరమై, సత్యమై, భావము పరిష్కృతమగుట హృదయమందే!

ఇఁక నర్థములు ముచ్విధములని లాక్షణికుని సూత్రము. శబ్దమునకున్న అభిధ, లక్షణ, వ్యంజన వృత్తులను బురస్కరించుకొని వచ్చునవే వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థములు. వాచ్యార్థ మనఁగా శబ్దము నర్థించినపుడు సూటిగా వచ్చు నర్థము. శబ్ద మర్థమున కుపలక్షకము. శబ్దోచ్చారణము వలనఁ దద్గతమైన వాచ్యార్థము మన కొక వస్తువిశేషము నెదుట సాక్షాత్కరింపఁజేయును. ఉదాహరణమునకు 'గోవు' అనినంతనే శబ్దమునకున్న ప్రతిమాగుణము ద్యోతకమగును గదా! ఇట్టిదే వాచ్యార్థము.

వాచ్యార్థము నశ్లేయుంచి, యీషద్భేదమైన యర్థమును బ్రసాదించునది లక్ష్యార్థము. ఉదాహరణమునకు 'మీరు వెళ్ళు మార్గములో చెఱు వున్నది' అనినపుడు మార్గ మధ్యప్రదేశములో గమన నిరోధము గల్గించుచుఁ జెఱు వున్నట్లు వాచ్యార్థము. 'మార్గములో' ననఁగా 'మార్గము ప్రక్కన' యనిగదా వక్త్ర నభిప్రాయము! ఇట్టిదే లక్ష్యార్థము.

వాచ్యార్థమువలె సూటియైనది కాక, లక్ష్యార్థమువలె సామీప్యమునుగాక, వాచ్యార్థమునకు వ్యతిరేకార్థ స్ఫురణము కలిగించునది వ్యంగ్యార్థము. ఉదాహరణమునకుఁ గళాపూర్ణోదయములో సుగాత్రికి సఖు లుపాయములఁ జెప్పు సందర్భమున—

'దంపతు లిరువురును వివేకు లేమి చెప్ప'

అను పాదములో 'వివేకు' లనఁగా 'అవివేకు' లనిగదా సఖుల యుద్దేశము! ఇదియే వ్యంగ్యార్థము. ఈ వ్యంగ్యమందే భావ సౌకుమార్యమును గమనించుటకుగాని, నిశితబోధనా విధానమనుగమించుటకుగాని శక్తియున్నట్లు కనిపెట్టి కావ్యాలు లాక్షణికులు దీనికిఁ గావ్యమునందుఁ బ్రాధాన్య మిచ్చినారు.

ఇట్లే భావ మను పదమునుగూడ ననేకరీతుల లాక్షణికులు ప్రయోగించినారు. వ్యాకరణములో భావ మనఁగా ధాత్వర్థము. రసప్రకరణములో విభావ, అనుభావ, సాత్త్వికవ్యభిచారీభావము లని కన్పించుచున్నవి. ఇవి యన్నియుఁ బరస్పర భిన్నము లనియు, నన్నియుఁ గ్రమావస్థల కుపకరించునవనియుఁ దుదకు రసములోఁ బర్యవసించునవనియుఁ దెలియును. ఈ రసభావమునకే లాక్షణికులు గౌరవమిచ్చినారు.

ఈ విధముగా భావార్థముల కన్యోన్య సంబంధము, సూక్ష్మాతిసూక్ష్మమైన యంతరములు గలవు. మాటల నాశ్రయించినవి యర్థభావములు. మాటలలోని యింద్రజాలమనినపుడు కారణము గన్పింపకయే ఫల మభివ్యక్తమైనట్లు— తత్ఫలముగా చక్కలిగింత కలుగుచున్న ట్లభిప్రాయము.

ఇంద్రజాలములో ఫల మభివ్యక్తమగును గాని కారణజాతము బుద్ధి కందదు.

మాటల యింద్రజాలము మాటలలోనే లేదు. వాని ప్రయోగములోనున్న వైవిధ్యములో, సౌకుమార్యములో, వైచిత్రిలో నున్నట్లు గమనింతుము. ఆయా మాటలకు వాని ప్రత్యేకత యుండనే యున్నది. వేని యర్థము వానిదే. మాటల ఇంద్రజాలము కవిత్వమునకుఁ జెందినదే కాని శుష్కమగు వచనమునకు దాని నాపాదించిన దాని గతి కడ్డుతగిలి నట్లగును. నిత్య వ్యవహారములో మాటల యింద్రజాలమును గల్పించినచో నది కవిత్వసంబంధమే యగును.

శ్రవణపేయముగాఁ గొన్ని మాటల కూర్పులుండును. 'కీర్తన పాత్ర చిత్ర మృదుగీత కలాకలన ప్రవీణతన్' అని నపుడు రేఫ పౌనఃపున్యమును, 'చెందొవ విందు మందువలెఁ జిందు రుచిందగ' అనినపుడు బిందుపూర్వక దకారపౌనః పున్యమును శ్రవణానందమును గలుగఁజేసినవి. ఇట్టివానినే లాక్షణికులు గుణాలంకారముల క్రిందఁ బరిగణించినారు.

కాలగతిలోఁబడి శబ్దము స్వరూపములో, నాదములో, నర్థములోను మార్పును జెందుచుండును. ఆచారవ్యవహారముల కనుగుణముగా శబ్దములు పూర్వ మెన్నెన్నియో యర్థములలోఁ బ్రయోగింపఁబడినవి. కాలపరిణామములో నవి గొన్ని యర్థములలోనే రూఢిజెందినవి. చీర యను శబ్దము సామాన్య వస్త్ర విశేష మను అర్థమునుండి స్త్రీ ధరించు వస్త్రవిశేషములో, 'కైంకర్య' మను పదము 'స్వామి సేవ'

యను నర్థమునుండి 'సంగ్రహించుట' యనుదానిలో, 'కంపు' అను మాట 'గంధ'మను నర్థమునుండి 'దుర్గంధ' మనుదానిలో రూఢ మగుచున్నవి.

శబ్దస్వరూప మెఱుఁగని వారిచే గాని, విద్యాగంధము లేనివారిచేగాని యుచ్చరింపఁబడి కొన్ని శబ్దములు నాదమును గోల్పోవుచుండును. 'వెళ్ళు' అనుటకు 'ఎల్లు' అనియు, 'గొప్పవారు' అనుటకు 'గొప్పోరు' అనియు, 'ఐన' అనుటకు 'గిన' అనియు, 'ఏమది' అనుటకు 'ఏంది' అనియుఁ బూర్వ నాదములు గోల్పోయి విన్పించుచుండును.

భిన్నప్రాంతములలో నొకే వస్తువును సూచించు పదములు భిన్నములుగా నున్నవి. 'తాళము' నకు 'కప్ప' - 'పచ్చడి' కి 'తొక్కు' - 'ఆగుట' కు 'సైసు' 'గురువుగారు' నకు 'అయ్యవారు' లేక 'స్వామివారు' మున్నగు ప్రయోగము లిట్టివే!

వక్తృ భావోద్వేగమును సూచించుట కుపయుక్తములగు పదములు విచిత్రములుగా నుండును. 'మహాచెడ్డ యిష్టము' అనినపుడు 'మహాచెడ్డ' అను పదములు వ్యస్తార్థములలో నిష్ప్రయోజనములు. కేవల ముద్వేగము, ఇచ్ఛలో పరాకోటిఁ దెలుపుటకుఁ బ్రయోగింపఁబడినవే కాని వేరు ప్రయోజనము వానికి లేదు. లోకములో 'పడిచస్తాడు' అనినపుడు, కావ్యములో 'ఈ వెడమాటల నను సేటికిఁ జంపెదరు' అనినపుడు 'చావు' అను శబ్దమునకుఁ ద్వైవిధముగ నే పృథక్త్వము సున్న.

శబ్దములు గొన్ని యితర శబ్దములతో గూడినపుడు వింతయైన నూతనార్థములం బ్రసాదించును. 'పిడత మొహాము' అనినపుడు విఫలమనోరథుండై దైన్యదశను బొందినవాని ముఖ వైఖరి సూచింపంబడినది. ఇట్టివే 'చట్టిముక్కు', 'ఏనుగుకాలు', 'మట్టిబుఱ్ఱ' మొదలైనవి. వీనిని క్రమముగా నలంకారముల క్రిందం జేర్చినారు మన లాక్షణికులు.

ఇట నలంకారములగూర్చి స్వల్పముగాం జెప్పవలెను. అలంకారములు, శబ్దార్థాలంకారము లని రెండు విధములు. శబ్దాలంకారములో నాదమునకు గౌరవము. అర్థాలంకారములో భావమునకు గౌరవము. కవి తన కుపలభ్యమానము లైన పదముల నన్నింటిని వివిధావస్థలలో సంపుటీకరించి తన మనోగత మైన యభిప్రాయము వ్యక్తీకరించును. ముందు మనవిచేసి నట్లుగా నాతని భావమును సంపూర్ణముగా నందించుట కా పదములు సరిపోవు. అపు డాత డలంకారముల చెంతకుం బోవును. సాదృశ్యకల్పనము, ఇతర సన్నివేశ స్ఫురణము మున్నగునవి యాలంకారిక సామగ్రి. స్వీయానుభూతాంశమును తనతో సమానముగా, సమగ్రముగా, సహృదయసాక్షాత్కారము కల్గించుటయే కవియొక్క నిరంతర సాధనము. కనుక భావవ్యక్తి కుపకరించునవే యర్థాలంకారములు. నాదవ్యక్తి కుపయోగ పడునవి శబ్దాలంకారములు. రెంటికి పరమాశయ మానంద సంధానమే. ఒకటి హృదయగోచరము. రెండవది శ్రవణ గోచరము.

కావ్యమునకు ముఖ్యాంగము లనఁదగు భావ వస్తు రచనములలో - రచనము శబ్దార్థ సమన్వితమైనది; వస్తువు లోకకావ్యములలో సిద్ధమైనది; భావము కవి మనోగతమైనది. మానవుని కొక్కనికే జంతుకోటిలో భావనాశక్తి యున్నది. ఇది యాతఁడు పెరిగిన కొలఁది, లోక కావ్యాది పరిశీలనము జేసినకొలఁది యభివృద్ధి పొందుచు నైశిత్యముఁ బడయుచుండును. ప్రతి మానవున కభిప్రాయము లుండును. కాని బంగారము పుటములోవలె వాని నాలోచనమను అగ్నిగుండమున వ్రేల్చిన గాని నవి భావములుగాఁ బరిణమింపవు. ఆలోచనాశక్తి కలిగి యర్థజ్ఞానము లేకపోయినచో గాలిలోఁ గత్తిసాము సేయుట వంటి దగును. బుద్ధిభావములు రథ్యసారథి సంబంధము గలవిగా వర్తిలవలెనని పెద్దల యభిభాషణము.

ఆ యుత్కృష్టభావమే, ఆ విశ్వసత్యమును ప్రకటించు కవితాభావమే ప్రపంచమును బాలించునది. మనోహరమైన మాటల నేరికొని, స్ఫుటమైన యర్థములను బోసి సజీవముగాఁ జేసి, సుసంపన్నమైన భావమును బొదిగి కవి విశ్వమును బరిపాలించువాఁడు. నాదబ్రహ్మ సాక్షాత్కార మొందని పదసంపుటులు వ్యర్థములు. అట్లే యర్థము లేని శబ్దములు పడికట్టు ఱాళ్ళవంటివి. భావము లేని శబ్దార్థములు 'భావజుఁడు లేని పాడుమేడ' వంటివి. కావున శబ్దము-అర్థము-భావము, యివి ఉత్తరోత్తర ప్రధానములు. భావము ప్రథమము ప్రభవించును; పిమ్మట సార్థకమైన శబ్దావతరణము జరుగును : కవి భావము నుండి యర్థము మీఁదగా శబ్దమునకు బ్రయాణము చేయు

చూడును. సహృదయుఁడైన విమర్శకుఁడు శబ్దముల నుండి భావము కడకుఁ బ్రయాణ మొనర్చును.

భావప్రకాశమే కవి ప్రయత్నము. తన్నిజ స్వరూప ప్రకటనమే విమర్శకుని బాధ్యత. శబ్దములోని నాద ప్రతిమార్థముల కంతరమైన భావముచేతనే యుల్లోకము లంధ తమస్సుల నుండి విడివడునది. అట్టి భావోదయమే జ్ఞానోదయము. ఇంద్ర జాలికుని మాయలోఁ బడక నిజతత్వ మెఱుఁగుటకై సంస్కారము బడసినవాఁడే మహాత్ముఁడు. శబ్దములో భావార్థముల నాతఁ డెఱిఁగి బ్రహ్మతత్త్వము నెఱుఁగఁగలఁడు. అట్టి జ్ఞానోదయమే జ్యోతిరావిర్భావము. అదియే విశ్వము నేలు పరంజ్యోతి !

"తమసో మా జ్యోతి ర్గమయ"

# కవి - సమాజము

ఏ యుగములోనైన, నే దేశములోనైనఁ గవి మాననీయుఁడే. కవి ప్రజాపతితో సమానుఁడే కాక యొక్కొక్క-సమయమున నాతని మించునుగూడ. కవి తాను ప్రతిభావంతుఁడై, త్రికాలవేదియై, సమస్త చరాచరప్రకృతిని నిశితముగాఁ బరిశీలించి, తా నందుండి విడిపోయి, దాని నాత్మతత్త్వముతో సమన్వయించుకొని యాధికారిక వచస్సును మధురముగా వెలువరించును. ఆతఁడు క్రాంతదర్శి. కావుననే కర్మసాక్షినిగూడఁ ద్రోసివైచు 'రవి గాననిచో కవి గాంచునేకదా' అనెడి లోకోక్తి పొసగినది. వర్తమానముతో భూతభవిష్యత్తుల సమన్వయించుట ప్రతిభావిశేషమే కాని వేరు కాదు. దూరదర్శనములో—లౌకికములైన, నిత్యనైమిత్తికములైన విషయములను శోధనముచేసి యుత్తమోపదేశముచే సంస్కరించుటలో—గవి ఋషితుల్యుఁడు.

కవికూడ లోకసంబంధియే. సామాన్య మానవుఁడే విధముగా నాహార విహారాదులలోఁ బాల్గొనునో యట్లే కవియును. కాని కవి లోకానుభవమును బొంది, యా లోకములోఁ దాను జూచిన సన్నివేశమును దన ప్రతిభచే నుదాత్తము చేసి, యందలి తాత్కాలికచైతన్యమును శోధనముచేసి శాశ్వత స్పందము నాపాదించును. కవి కార్యము విచిత్ర

మైనది. అసత్తు నుండి సత్తునకు, తమస్సు నుండి జ్యోతిర్లోకము నకు నడిపించు శక్తిమంతుఁడు కవి. సమాజములో సామాన్యులు చూచు దృశ్యమునే తానును దర్శించును. కాని సామాన్యుల వలె గాక యతఁడందలి పాత్రములతో లీనమొందును. ఆ దృశ్య మాతని యంతరంగ భిత్తికయందు సంపూర్ణముగా ముద్రిత మగునట్లు సాధనముఁ జేయుచుండును. పునర్దర్శనముఁజేసి దాని నంతరంగమందు భావనిగ్రహముచే నిలుపుకొనును. తనకుఁ గలిగిన సంతోషము నానందముగను, దుఃఖమును గరుణముగను సంస్కార విశేషముచేఁ బరివర్తనము జేయును. అనఁగా కవి ప్రథమదశలో సాక్షియై, పిమ్మట ద్రష్ట యగునన్నమాట. సామాన్య మానవులు సాక్షులు మాత్రమే.

కవి తాను దర్శించి నిగ్రహించి భావనచే దాని నొక రసగోళముగాఁ బునర్దర్శించిన తరువాత యితరుల కా రసానందానుభవమును భాసింపఁజేయుటఁ బ్రయత్నించును; ద్రష్టయైన పిమ్మట స్రష్టయగును. అనఁగా కవిత సృష్టియన్నమాట. ఉక్తివిశేషమే కవిత్వ మన్నాఁడు ప్రాచీనుఁడు. ఉక్తివైచిత్రి పొసగుటకుఁ గవి వ్యుత్పన్నుఁడు గావలెను; చూచిన సన్నివేశమును దిరిగి శబ్దార్థకల్పనముచే సృజింపవలెననిన నెంతటి శబ్దాధికారము వలయునో యూహింపుఁడు. శుద్ధమైన వచస్సుతో సమగ్రవస్తుచిత్రణముఁ జేసి తా నెంతటి సానుభూతి పొందెనో యంతటి యనుభవము సామాజకునకు కూడ నందించి నపుడే కవి కృతార్థుఁడగును. కావున కవి క్రాంతదర్శియై నిశితగ్రథనాకౌశలముచే స్ఫుటవ్యక్తి కలిగియుండవలెను. వ్యక్తి లేని ద్రష్ట ప్రయోజకుఁడు కాఁడు.

కార్లైలు పండితుఁడు కవిని ప్రవక్తగా వ్యవహరించినాఁడు. కవి మానవసమాజము నుత్తమమార్గమున తన పవిత్ర వచస్సులతోఁ నడిపించువాఁడు. జాతి సంస్కృతికి నుపాధ్యాయుఁ డెంతటి బాధ్యత వహింపవలెనో యంత బాధ్యత మానవ కల్యాణమునకుఁ గవి వహించును. కవి సమాజమును దనతోఁ దీసికొనిపోయి యాదర్శమూర్తులను జూపి, యలరించి, యనుసరింపఁజేయును. అట్టిచో సమాజముగూడ కవి నాదరింపవలెను. సామాజికులు కేవలము పామరులై కవి విశిష్టత నెఱుఁగక యాతని దూషింపరాదు. విద్యావంతులై, వివేచనాజ్ఞానము కలిగి, సహృదయత్వ మలవఱచుకొని సామాజికులు కవిని సమీపించుట కర్హత సంపాదించుకొనవలెను. కవి సామాజికు లీవిధముగా పరస్పరానుభూతి కలిగియుండిన గాని శోభ లేదు.

పూర్వకవులు చిత్రించిన సన్నివేశములు సమాజమునకు సహజములు గావనియు, వాస్తవిక జగత్తు నతిక్రమించి, భావాంబరవీథులలో విహరించుట దోషమనియు, యథాదర్శనముగాఁ జిత్రింపవలెగాని సమాజమునకు దూరముగా నుండరాదనియు నిటీవల కొందఱు వాదించుచున్నారు. కవి దృష్టికిని సామాన్యుని దృష్టికిని భేదమున్నట్లు తెలియవలెను. వాస్తవిక కథనముకన్న నుదాత్త కథనమే బోధనమున కనుకూలించును. లౌకికమునుండి యలౌకికమునకుఁ బాత్రముల నడిపించుఁ గవి సమాజమును స్వర్గమును గలిపి ముడివేయును. ప్రహ్లాదుని వంటి యింద్రియ నిగ్రహము కలవాఁడును, సీతవంటి పతివ్రతయు,

లోకవిరుద్ధములని శంకించువారున్నారు. లోకమునకుఁ గవిత్వము దర్పణమైనందువలనఁ బ్రయోజన మేమి ? ఉన్నది యున్నట్లు వర్ణించుచో కవి యేల మనకు ? అట్లే కవిత్వము దర్పణమైన నుపదేశమునకు బదు లుద్రేకమును, సంస్కరణమునకు మారుగాఁ జుగుప్సను కవి కలిగించునేమో ! కవి కేవల సామాజికుఁడై పోయిన ప్రయోజనము లేదుగదా. దేశకాల పరిస్థితులను గమనించియే ప్రతి యుగమునఁ గవి ప్రవక్తయై ప్రవర్తిలు చుండును.

ఈ సిద్ధాంతమును మరచి సమాజమునకుఁ గవి దూరముగా వర్తిలుచున్నాఁడను ప్రవాదము కొందఱు లేవదీసినారు. ప్రజావాఙ్మయ మనగా ప్రజల కొఱకు వాఙ్మయమని యర్థము. పూర్వమున్న వాఙ్మయము ప్రజలకొఱకే కాని పశువులకుఁ గాదుగదా యుద్దేశింపఁబడినది ? ప్రజలన్న పామరులని యర్థము చెప్పుకొనినచో పామరునికి వాఙ్మయ మాతని సంస్కరించి సన్మార్గవర్తనుం జేయుటకే గదా ? 'విశ్వశ్రేయః కావ్య' మని నపుడు పూర్వులు దీనినే యుద్దేశించినారు. కాని పూర్వ కావ్యములు ప్రజల కందుబాటులో లేవని యందలి భాషాభావ జటిలత్వమును దూషించుచున్నారు. నేడు వ్యావహారిక భాషలోఁ గవులు తమ భావముల నందించినను ప్రజాసామాన్యమున కర్థమగుటలేదను వాక్యములు వినఁబడుచునే యున్నవి. సామా జికు లధికారానుగుణముగ విషయగ్రహణము చేయవలెనే కాని కవిని దూషించి ప్రయోజనము లేదు. అన్ని కాలములలోను గవికిని పామరునికిని మధ్య సహృదయుఁడైన వ్యాఖ్యాత యుండ

వలెను ; ఉండితీరునుగూడ. సామాజికుఁడు శిక్ష పొందవలెను. అట్లుగాక కవిని పామరు నొద్దకు దిగిరమ్మనుట పొరపాటు. దీనినే రస్కిన్ పండితుఁడు —

"We neither feign nor interpret; you must rise to the level of our thoughts", *

అని, సామాజికులే కవి వసించు నున్నతపథమునకు వెళ్ళవలెను గాని కవి దిగి రాలేఁడని చెప్పినాఁడు. ఈ సిద్ధాంతమునకు విపర్యాసము కలిగినచో సమాజము తమోలోకమం దుండుట తటస్థించును. జాతి వ్యవస్థ క్షీణించిపోవును.

కవి భావోదాత్తతతో నేవిధమైన వివాదము పనికిరాదు. కవితాభావమున కక్షరరమ్యత నాపాదించి దానిం గళామయము చేయుటలో సజ్జాద్ జహీర్ కూడ తన సమ్మతిని —

"The people demand of their artists to present these in artforms to clothe these sacred emotions..."

అను వాక్యము ద్వారా తెలిపినాఁడు ; కాని వివరింపలేదు. భావ చిత్రణములోఁ గావ్యరూపము నంగీకరించి తీరవలసినదే.

కవికిని సమాజమునకు నవినాభావ సంబంధము గలదు. కవి పూర్వము తానున్న దేశకాలపరిస్థితుల నాకళించుకొనియే కావ్యము రచించినాఁడు. నన్నయ కవితలో వైదిక ధర్మనిష్ఠయు, పాల్కురికివారి కావ్యములలో శైవ మత ప్రాబల్యమును, తిక్కనార్యుని గంటములో దేశీయ ప్రభావమును, శ్రీనాథుని

* Ruskin's Lectures — Sesame.

క్రీడాభిరామములో సంఘవ్యవస్థ, రాయలనాటి కావ్యములలో సమాజసౌఖ్యమును, వీరేశలింగము రచనములలో ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ సంఘర్షణము ముద్రితములైనవి. కావుననే సాంఘికచరిత్ర వ్రాయుట కా సంఘ వాఙ్మయము దోడ్పడునను సూత్రము వచ్చినది. సంఘ జీవితము ప్రతిబింబింపని రచనమే యుండజాలదు.

నేడు ప్రబోధ వాఙ్మయము వచ్చుచున్నదనిన, నది యీనాటి జాతియొక్క నిద్రావస్థను దెలుపును. ప్రబోధ వాఙ్మయమే సాహిత్యమని తలంచుట యవివేకము. ప్రబోధ వాఙ్మయము తాత్కాలిక ప్రయోజనము గలది. ప్రజలను ప్రబోధించి యెన్ని దినములు కార్యశూరులుగా నిలువఁబెట్ట గలము ? విజ్ఞానవ్యాప్తి విరివిగా జరుగవలెను. ప్రజలందఱు తమ విజ్ఞానపాదములపైఁ దాము నిలువగల శక్తి యలవఱచు కొనిననాఁడు, కవి సందేశ మర్థమగుటయేకాక యుత్తమ సాధన ములో శాశ్వతఫలము లందగలుగుదురు. విద్యావ్యాప్తికై పాటుపడక కేవల ప్రబోధము సాగించిన ముక్తి లేదు. విద్యా వంతునికి సాహిత్యము సమధికమైన జ్ఞానము నిచ్చి పరమానంద సంధాన మొనగూర్చును. ప్రబోధము మనుజునిలో సహజమైన యాకాంక్షను బోడమనీయదు. కావున దాని ప్రభావ మల్ప కాల పరిమితము. అయినను సాహిత్యసృష్టి ప్రబోధవాఙ్మయ రచనయు నేకకాలావచ్ఛేదకములుగా జరుగవలసియే యున్నది.

ఈనాడు మన సంఘము దుస్థితిలో నున్నది. తుచ్ఛ కామమునకు గురియై యది జంతుప్రాయ మగుచున్నది. వర్గమైవ

నస్యములు మిక్కుటములై యైకమత్యము లేకయున్నది. అసూయాహంకారములు హద్దుపద్దు లేక పెరుగుచున్నవి. ధైర్య పౌరుషము లడుగంటినవి. సమాజములో శాంతి లేదు. స్వేచ్ఛాకాంక్ష ప్రబలినది. కాని ఫలవంత మగుటకు పరిస్థితులు ప్రతికూలములుగా నున్నవి. ఇట్టి సామాజిక దుస్థితిని సమగ్రముగాఁ బరిశీలించి, విశ్వమానవకల్యాణముఁ జేకూర్చునట్టి, శాంతిని నెలకొల్పునట్టి, సంఘైకమత్యమును ప్రబోధించునట్టి యుత్తమ కవి యీనా డవతరింప వలసియున్నాఁడు. అతఁడు ప్రపంచ కవి కాఁగలఁడు. అతని అధికారికమగు ప్రవచనములతోడనే యీనాటి సామాజిక దుస్థితి తొలఁగిపోవును. ఆ మహాకవి కొఱకై నిరీక్షింతముగాత!

•

# విమర్శకుఁడు - కళోపాసకుఁడు

విమర్శక కళోపాసకుల కర్తవ్యతాబాధ్యతలను వారి వారి ముఖ్యోద్దేశములకుఁ దోడగు వివిధోపాయములను, వారి యుత్కృష్టాదర్శములకు మార్గదర్శకములగు విషయములను దదితరవిషయముల నవగాహన చేసికొనుటకుఁ బూర్వము విమర్శనమనఁగ నేమియో, కళయనఁగ నెట్టిదో, యెట్టివాఁడు విమర్శకుఁడని, కళోపాసకుఁడనియు బిలువంబడెడినో యెఱుంగుట మన కవశ్య కర్తవ్యమై యున్నయది.

సూక్ష్మరీతిఁ బరిశీలించిన విమర్శకునకును, కళోపాసకునకును సన్నిహిత సంబాధ మున్నటులఁ దెలియనగును. నిజముగఁ గళోపాసన, కళాదృష్టి, కావ్యాదులయందుఁ బ్రవేశమును గలిగియుండి, గొప్ప రసికుఁడైనవాఁడే విమర్శనాకార్యమునకుఁగాని, కళారాధనకుఁగాని గడంగుట కర్హుఁడగును. దీనిఁబట్టి విమర్శకునకును, కళోపాసకునకును నొకేవిధమగు పరికరము లుండవలయునని మనము దెలిసికొందుము. ఒక్కొక్కతఱిఁ గళోపాసకుఁడే విమర్శనమునకుఁ గడంగుట సంభవించును. కళోపాసకుఁడు కావ్యాదులం దగురీతిం బరిశీలించి, యందలి లోపాలోపములను గుర్తెఱుంగుట కెక్కుడవకాశమున్నది. తాను గుర్తెఱింగి, యితరజనంబుల కెఱుకచేయుటయే విమర్శనాదర్శము. ఈ విధంబున విమర్శనము కళోపాసకుని కలముపై నాధారపడిన గుణాగుణపరిశీలనముగా నెంచవచ్చును.

ప్రత్యేకముగా నీ రెంటినిఁ బరికింతముగాత! ఈ కార్యాచరణమునకుం గడంగుటలో రెంటికిని సాధర్మ్య వైధర్మ్యముల సులభమార్గముగఁ గన్గొన వీలగునను నాశయమును బ్రబలియున్నది.

మున్ముందుగ 'విమర్శన' మన్న నెట్టిదో విపులముగఁ బరిశీలింతము. ఈ పదము ననేకు లనేక విధముల నిర్వచించి యున్నారు. ఎవరికిఁ దోఁచినటులు వారు వ్రాక్రుచ్చుచుండ నేఁటికి విమర్శన మను పదమునకు భిన్నాభిప్రాయము లేర్పడి, విమర్శకుఁడన్న కేవలముఁ గావ్యములపట్ల రక్కసుఁడని భావించునంతటి భీతిని నెలకొల్పినది. నేఁడు ప్రతి విమర్శకుఁడును 'విమర్శన' మను పదమునకు భిన్నమైన నిర్వచన మొసంగుచున్నాఁడు. లక్ష్య మేదియు లేక, నోటికి వచ్చినటులు, కలము నడచిన రీతిని వ్రేలుచుండు విమర్శకు లనేకులఁ గాంచుచున్నారము. సంప్రదాయార్థములో విమర్శకుఁడు దోషాన్వేషిగా నెంచఁబడుచున్నాఁడు. కొందఱు కావ్యాది కళలయందలి గుణదోష విశేషములను బరికించి, యున్నదియున్నట్లు దెలుపువాఁడు విమర్శకుఁడని యూహించుచున్నారు. మఱికొందఱు కృతియందలి విశేషములనే హెచ్చరించుచు, కవిని, కృతిని యథోచితముగ నభినందించుట విమర్శన మనుచున్నారు. ఒక వస్తువును గైకొని యందలి కవితామాధుర్యమునుగాని లేక రసోత్కృష్టతనుగాని, చమత్కృతులను, తదితరాన్వయములను సహాయముగఁ గొని యితర వస్తువులను వీనితోఁ బోల్చి యేది మిన్నయో నిర్ణయించు తత్త్వమే విమర్శకతత్త్వ మని కొందఱు నుడువు

చున్నారు. దీనికి సంబంధించిన వాక్యమే 'విమర్శన మొక యానుషంగిక పరీక్ష' యనునది.

విమర్శకుఁడు నిజముగా నిష్పక్షపాతబుద్ధితో నెద్దేనిఁ బరిశీలింపవలెను. లేదేని యయ్యది విమర్శన మనిపించు కొనక, కేవలము కవిపైనున్న యభిమానమువలనఁగాని లేక యాతనిపై నిరసనభావమువలనఁగాని పురస్కరింపఁబడిన కలముయొక్క నడకగా నెంచఁబడును. బాగుగఁ బరికించిన నేఁడు వెలువడు విమర్శనములలోఁ జాలవఱకు నీ నిర్వచనము నకుఁ దోడగునవే యని గ్రహింపఁగల్గుదుము! ఒకానొకఁడు తన విమర్శనముం దొక కవిని, ఆతని కృతిని ఖండించినచో, నా కవిపైనున్న యభిమానముచే వేరొకఁడు దానిని తిరిగి ఖండించుచు, మఱియొక విమర్శన మా విమర్శపై వ్రాయఁబూను కొనుట సామాన్యముగ మనము గాంచుచున్న విషయమే. తుద కీ విమర్శనములు వ్యక్తిగతవాకక్షల వెలిబుచ్చు మార్గములుగా నుపయోగింపఁబడుచున్నవి. క్రమముగ వ్యక్తిద్వేషమునకుఁ గారణభూతమై విషమపరిణామము నొందుచు ముఖ్యోద్దేశమునకు దూర మగుచున్నవి. ఈ సందర్భమున నొక విషయముఁ జెప్పవలసియున్నది. విమర్శనము కృతుల కనువర్తించునదికాని కృతికర్తల కనువర్తించునది కాదని ప్రతి విమర్శకుఁడును గ్రహింపవలెను. కృతిలో నున్న గుణదోషములఁ గాంచుటేకాని కృతికర్తల గుణదోషముల నెంచుట విమర్శనా పద్ధతికి విరుద్ధము. నేఁటి విమర్శకులలోఁ గొందఱు దీనినే గ్రహింపలేకున్నారు. విమర్శకుఁ డెన్నటికిని కృతికర్తపైఁ దనకున్న యభిప్రాయము ననుసరించి యాతని కృతిపైఁ దదభి

ప్రాయమే ప్రతిబింబించునటులు వ్రాయఁ బూనుకొనఁడు. 'Judge not others that thou be judged' అను వచనము ప్రతి విమర్శకుఁడును గమనింపఁ దగినది.

నిజమైన విమర్శనములోఁ గలహాములకుఁ గారణంబులగు విషయంబులుండక 'విషయవిభజనము, వ్యాకరణార్థ పరిశీలనము, నిరుక్తము, భావవ్యాఖ్యానము, పరిష్కరణము మున్నగు నితర విషయములు చేరుచున్నవి. వీని నన్నింటియెడను గౌశలము వడసియుండువాఁడే సరియైన విమర్శకుఁడు. అనఁగా విమర్శకుఁడు సర్వతోముఖుఁడైన విజ్ఞానసర్వస్వసాధకుఁడై యుండవలె నన్నమాట !

విమర్శనమందు చారిత్రక, శాస్త్ర, కావ్య విమర్శనము లని ప్రత్యేక విభాగము లున్నవి. విమర్శకులలో నిరు తెగలున్నారు. ౧. ఉన్నదాని నున్నటులు విపులీకరించి యర్థమును (కవి తలంచిన రీతి) చెప్పువారు. ౨. ప్రత్యేక వాక్యములను, సందర్భములఁ గైకొని ఖండించువారు. విమర్శకులకు గర్వము హెచ్చఁగ నహంభావముతోఁ గూడి, యున్నదాని విపులీకరించుటే యేమి ప్రయోజకత్వ మని తమ యభిప్రాయములఁ జొనిపి, స్వీయ పాండితీప్రకర్షకుఁ బ్రయత్నములు సల్పుచు ఘర్షణములలోనికి దిగుదురు; అట్టిచో వీరు రెండవ తెగలోని వారుగాఁ బరిగణింపఁబడెదరు. విమర్శనోద్దేశము గుర్తెఱింగి, తత్పద్ధతుల నరసి, దాని కనువగు పరికరముల సమకూర్చుకొని తదుద్యమమునకుఁ బూనుకొనిన విమర్శనము సార్థకనామముతోఁ బరఁగుననుట నిస్సందేహము. ఇట్లు

సర్వలక్షణలక్షితుఁడై సకల పరికర సమన్వితుఁడై పఱఁగు నాతని విమర్శన ముదాహరణముగఁ గైకొన సాహసింప వచ్చును.

విమర్శనమే ప్రత్యేక వాఙ్మయ స్వరూపము దాల్చి చున్నది. గూఢార్థమును ప్రకాశింపఁజేయుట, ప్రజలకుఁ గళా సౌందర్యమును వెల్లడించి, కావ్యాదులయందు, కళోపాసనలందు నభిరుచి యాదరాభిమానము లేర్పఱచుట, విమర్శనముయొక్క ముఖ్యాశయములు. కనుక విమర్శకుఁడు పై నుదహరించిన పరికరములతోడను, మహదాశయములతోడను, నిష్పక్షపాత బుద్ధితోడను, విషయ వ్యక్తీకరణమే ప్రధాన కర్తవ్యముగా నెంచుచుఁ దాఁగైకొనిన దానిలోని లోపాలోపముల నవలోకించి చదువరులకుఁ జూపుచుండవలెను. విమర్శనమని నామం బిడుట కట్టితఱిగాని సమంజసముగాదు. లేనియెడల 'ప్రశంస' యనియో, లేక 'రంధ్రాన్వేషణ' మనియో, వారి వ్రాఁతలకు నామం బిడిన ఘర్షణమునకుఁ దావుండదు !

ఇఁక కళనుగూర్చి కళోపాసకుల గుఱించి తెలిసికొనవలసి యున్నది. ప్రథమమున 'కళ' యను పదమును నిర్వచించి పిదప దాని వివిధశాఖలు, వాని నారాధించు పద్ధతులను గ్రహింతము:

జీవన సాదృశ్యము యొక్క మానసిక రూపమును ప్రదర్శించుటయే కళ-అని యొక మహామహుఁడు సెలవిచ్చి యున్నాఁడు.* చతుష్షష్టి కళలున్నటుల మనకుఁ దెలియుచున్నవి. కాని వాని నన్నింటిని గ్రహింపగల్గునంతటి యవకాశము మన

* 'Art is the presentation of real in its mental aspect".

కిచ్చుటలేదు. ఈ యఱువదినాల్గు కళలలోను లలితకళలుగా నెన్నఁబడుచున్నవానిఁ గైకొని తగురీతిని బరిశీలింతము :—

కవిత్వము, చిత్రలేఖనము, తక్షణము, సంగీతము, శిల్ప కళ, లలితకళలుగా నెన్నఁబడుచున్నవి. మన భారతదేశమున లలితకళలపై నున్న యాదరము, తత్కళౌన్నత్యము, మఱి యే యితర దేశ మందును గానిపింపదు. హిందూదేశము శిల్ప శాస్త్రములో నద్వితీయము; సంగీతములో సాక్షి; కవనమందు కన్నెఱ్ఱ; చిత్రలేఖన మందు చాతురీధురీణ; తక్షణములో తార. ఇట్టి యైశ్వర్యము లభింపఁజేసిన విశేష నైపుణీ ధురంధరు లెందఱో మన భారతదేశము నాదర్శప్రాయముగాఁ జేసినందులకు వారు వందనీయులు. అధునాతన యుగమునఁ బాశ్చాత్య దేశములందు లలితకళల కెట్టి యాదరము కలదో యించుక గమనించినవారు, విదేశమునందే వీని జననమనియు, నచ్చటనే కళ యౌన్నత్యము గడించినదనియు సరియైన పరామర్శ లేక, యభిప్రాయపడుచున్నారు. యథాతథముగ, నే విజ్ఞానమును గైకొనినను బూర్వము భరతదేశమందు వరలినదే కాని యన్యము గాదు. సంస్కృతము, గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము, సాముద్రికశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, వేదాంతము, తర్కశాస్త్రము, వైద్యశాస్త్రము, తదితర శాస్త్రములును — పై నుదహరించిన లలితకళలు మొదలుగాఁగల వన్నియు, భారత భూమిలో జననమందినవే! నేఁటికి వాని నితర దేశంబుల నుండి నేర్చుకొనుచుంటిమని, సర్వవిజ్ఞానము వారి ధనమే యని తలంచునంతటి దౌర్భాగ్యము కలుగుట యెంతయు శోచనీయము. ప్రాచీన విజ్ఞానమును విస్మరించు విన్యాసము వెల్లివిరియుట

విచిత్రము గా కేమున్నది ? మన ప్రాచీన శాస్త్రముల నభినందించుచు, 'పొరుగింటి పుల్లకూర రుచి' యన్న సామెతను నేటి భారతీయులలో నవనాగరికులమని గర్వపడువారు సార్థక పఱచుచున్నారు. నిజము గ్రహించిన మనము మనశాస్త్రము లను నిల్పుకొనలేక, పఠింపలేక, యితరుల కందఁజేసి, నేఁడు తిరిగి వానినే యితరులచేతను బోధింపఁబడవలసిన స్థితిలో నుంటిమి కదా ! ఏమి యీ వైపరీత్యము!

ఇఁక నొక్కొక్క లలితకళను గ్రహించి ఒకనాఁటి తదున్నతిం బరికింతము !

౧. కవిత్వము : మన భారతదేశము కవనములోఁ గన్నెత్తి యంటిమి: నిజమున కంతియే. భావగాంభీర్యములందుఁగాని, భావార్థ ప్రకర్షమందుఁ గాని, రసికత్వమునఁ గాని, నడక పొందికలోఁ గాని, యలంకారపు టందమునఁ గాని యితర దేశముల కవులు మన కవులతో సాటిరారు. శృంగార రసవర్ణన లలో మన కవుల కవనములు తుది సోపానమెక్కినవి. కవి చమ త్కృతు లపూర్వములు. నవరసము లొక్కపరి చిప్పిలఁజేయు సామర్థ్యములో మనవా రగ్రగణ్యులు. ప్రబంధ రచనలు, ద్వ్యర్థి కావ్యరచనలు మన కవివరుల మనంబులనే మొలకలెత్తినవి. షేక్స్పియర్ వ్రాసిన 'మిడ్‌సమ్మర్ నైట్సు డ్రీము', 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' లను చూచి మన కవులను నిరసింపనక్క రలేదు. వానికి దీటుగ పింగళి సూరన మన కొసంగిన 'కళాపూర్ణోదయ' మున్నది. వర్డ్సువర్తునే ప్రకృత్యుపాసకుఁడని మన దేశపు నవ నాగరకులు తలంప నవసరము లేనట్లు మన కవు లందఱు నట్టి

వారని కనుగొందుము. ఇందులకు మనవారి ప్రబంధములలోని ప్రకృతి వర్ణనములే ప్రమాణములు. అంతవఱ కేల? వేదముల యందే ప్రకృత్యుపాసనలు కుప్పతిప్పలుగ నున్నవి. కాళిదాస కవి ప్రకృత్యుపాసన మందేమి వ్యంగ్య ప్రధానమగు శృంగార పోషణమందేమి యసమానుఁడు. కనుక ప్రాచీనకవుల కవనము లెట్లు నీతిబోధకములై, వర్ణనాపూర్ణములై, భగవద్భక్తినిఁ బురికొల్పు విషయములతో వఱలినవో, నేఁటి కవులుగూడ ప్రాచీన సంప్రదాయముల వదలక క్రొత్త నడవడితో సులభ మార్గమున, నుత్తమాశయములతో వ్రాయుచున్నారు. ఇహ పరముల సాధించు సాహిత్యము భారతీయులదే కాని తదితరులది కాదు.

౨. చిత్రలేఖనము : హిందూదేశము చిత్రలేఖన మందు చాతురీధురీణ యంటిమి. ఈ వచన మూరక వ్రాసి నదికాదు. నిజముగ నీ కళౌన్నత్యమును గమనింపవలె ననిన హైదరాబాదు రాష్ట్రమునందలి ఔరంగాబాదు జిల్లాలోఁ జేరిన 'అజంతా' చిత్రములే తార్కాణంబులు. ప్రాచీన కళౌన్నత్య మును, వైదగ్ధ్యమును ప్రజలు విస్మరించునట్టి దినంబు లేతెంచి నను, ఆ చిత్రములు నేఁటికిని సజీవములుగ నుండి చెక్కుచెద రక నూతనము లేమో యని చూపరుల భ్రమింపఁజేయు చున్నవి. నిజముగఁ జిత్రరచన మనిన నానాఁటి చిత్రకారులదే! చిత్రకళాపోషణ మనిన నాఁటి మహీశులదే! కళోపాసనమన్న నాఁటివారిదే! నిజముగ మనుష్యుని వర్ణించినంత, నావర్ణనమును విని చిత్రించునట్టి కళాకౌశలముగల చిత్రకారు లుండువారలు. చిత్రకళకుఁ గావలసిన వస్తుసామగ్రిని సైతము వారే నిర్మించు

కొనెడివారు. ఆనాఁ డుపయుక్తములైన వర్ణరచనానైపుణికి నేఁటి శాస్త్రవేత్తలు విభ్రాంతి చెందుచున్నారు. ఆ వర్ణములు నేఁటివఱకు ప్రత్యగ్రముగ నుండుట వారిని చకితుల గావించు చున్నది. భారతీయ చిత్రరచనము ప్రపంచ విఖ్యాతి నందినది. అంగాంగీభావ నిర్వహణమందు, వివిధభావ చిత్రణమందు, వెలుఁగునీడలయందు, అవయవసౌష్ఠవ సౌకుమార్య వైవిధ్య వేదనమందు, సంవిధాన కల్పనమందు భారతీయ చిత్రకారు లప్రతిమాన వైలక్షణ్యమును బ్రకటించి చరిత్రలో శాశ్వతస్థాన మలంకరించినారు. ఆనాఁటి చిత్రకారుల కళౌన్నత్యమును వెల్లడిజేయు 'అజంతా' చిత్రములు నేత్రోత్సవదాయకంబులు. ప్రాచీన కళౌన్నత్యమును ప్రజల కందఱకును జూపుటకొఱకై తగు సౌకర్యము లేర్పఱచిన హైదరాబాదు ప్రభుత్వము నిప్పట్ల నభినందింపవలసియున్నది.

3. తక్షణము: ఇందలి నైపుణ్యమును గ్రహింపవలె ననినఁ బ్రాచీన కట్టడములనే గమనింపవలెను. ద్వారము లందును, ఱాతి స్తంభముల మీఁదను గానవగు చెక్కడము లిప్పు డేరు ననుకరింపఁ జాలరు. ఆనాఁటి యుద్ధములలో నుప యోగింపఁబడిన ఖడ్గముల పిడులపైనను, డాలుల మీఁదను, కవచముల పైనను గొప్ప తక్షకులచేఁ జెక్కఁబడిన పనితనము నేఁటికిని మనము వస్తుప్రదర్శనశాలలలోఁ గాంచగల్గుదుము. ఫిరంగి గొట్టముల మీఁదను నాఁటి తక్షకుల నైపుణ్యము మెఱయుచున్నది. ఆ గొట్టముల ముఖము లే సింహతలాటములు గనో, ఎద్దు తలలుగనో చెక్కినట్లు గానఁబడుచున్నవి. ఎల్లోరా

గుహాలు మొదలైనవి మన దేశముల కళావైభవమును ప్రకటించునవి.

౪. సంగీతము : 'గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీత ముచ్యతే' యను శాస్త్రజ్ఞుల వాక్యానుసరణముగ సంగీతము గీత వాద్యనృత్యసమ్మేళనము. సంగీతమునే 'భరత' మని నుడువుట కూడ వినుచున్నారము. అనఁగా భావ, రాగ, తాళ యుక్తమైనది సంగీత మని భావము. సంగీతము మన దేశమునకుఁ గ్రొత్తదికాదు. ఇది వేదకాలమునాఁటినుండి యున్నట్లు సామవేదమువలనఁ దెలియనగును. సంగీతమును తరణోపాయంబున కనువగునదిగా నెంచి, త్యాగరాజు, దీక్షితులు మున్నగువారు దానిం జేపట్టి స్థిరకీర్తిం బడసిరి. కర్ణాటక సంగీత మని పేరుగన్నది భారతీయుల సంప్రదాయ సిద్ధమగు సంగీతము. కర్ణపేయముగ నుండునదిగాన దాని కీ పేరు సిద్ధించినదని పెద్ద లనుచున్నారు. సంగీతమునకు దక్షిణ భారతదేశము ప్రఖ్యాతి నందినది. నాదబ్రహ్మ నుపాసించి యీ కళద్వారా మోక్షసాధనము జరిపిన యోగులున్నారు. ఇవ్విధముగ భగవత్సన్నిధిఁ జేర్చు నుపాయ మీ సంగీతకళ యందున్నట్లు మహానుభావులు దర్శించి ప్రతిపాదించియున్నారు. త్యాగయ్య కీర్తనలు, కృతులు క్షేత్రయపదములు నేఁటికిని రసజ్ఞుల నలరించుచునే యున్నవి.

౫. శిల్పము : ఏతదౌన్నత్యము ప్రాచీన దేవాలయాదులయందుఁ గానఁగును. ఇందులకు మన దక్షిణదేశమే పేర్కొనఁదగినది. అమరావతి, నాగార్జునకొండ యిత్యాది

చారిత్రకస్థలములలో నద్భుతమగు శిల్పసంపద కనుగొననగును. ఆంధ్రశిల్పకళావైదగ్ధ్యము వేనోళ్ళఁ జాటునట్టి శిల్పము లవి. శిల్పహృదయము నెఱిఁగి సానుభూతితోఁ దిలకించువారికి వీని ప్రత్యేకత పొడగట్టును. ఒక్క స్తంభములో శిల్పి చూపు పనితనమునకుగాని, ఒక కొండను శిల్పభవనముగా చిత్రించుట లోని కౌశలమునకుగాని యెవరైనను జోహారు నర్పింపవలసినదే. ఇంతటి ఘనమైనది భారతీయ శిల్పము !

కళోపాసనముయొక్క ముఖ్యతత్త్వ మీశ్వరోపాసనమే. కళయొక్క పరమావధి భగవంతుని నిరూపించుటయే. మనకుఁ గళాపోషకు లత్యావశ్యకము. ప్రాచీన సంప్రదాయముల విస్మరింపక, యుదాత్తాభిప్రాయములతోడఁ బ్రాచీనులు జూపిన పథములనే పోవుచు నొకప్పటి భారతీయ ప్రతిభను, విజ్ఞానమును, గళౌన్నత్యమును సంస్మరించి వానిం బునరుద్ధరించుట యవశ్య కర్తవ్యము.

# కవి - చిత్రకారుఁడు

వస్తు స్వరూప నిరూపణ మందుఁ గుంచెను బహు జాగరూకతతో నుపయోగించి, రేఖలు సరిగా వ్రాసి యెంతయో తబ్బిబ్బు పడుచుండుట చిత్రకారులకు సహజము. వర్ణముచేఁ జిత్రము నద్దవలె నన్న బహుసూక్ష్మముగా దాని యెడ లోపము గాన రాకుండునటుల కుంచెచే నట్టిట్టు వ్రాసి సమముగఁ జేయును. వస్తు నిర్దేశమందుఁ బ్రవీణుఁడే నిజమైన చిత్రకారుఁడు. ఈ వస్తు స్వరూప నిరూపణ మనయుటను బుద్ధి కౌశలమే ప్రథమ సోపానము. గార్దభాకారమువైచి, దానిని శునకముగా గ్రహింపుఁ డనుట కేవలము చిత్రకారుని యసామర్థతను సూచించును. ఒక చిత్రకారుని చిత్రము మెప్పు వడసిన దనిన నాతఁడు గొప్పవాఁడనియే తలంపవచ్చును. కరుణరసమును వ్యక్తీకరించుటలో చిత్రమందు రౌద్రముం జూపిన సమంజసము గాదు. కొందఱు చిత్రకారులు వారి చిత్రపటముల ప్రక్కనే నామంబిడుచుందురు. కాని నాని నామములు వ్యక్తీకరించు భావము లప్పుడపుడు కానరావు, నామం బిడుచుండుట యాచారమైనది; కాని 'నామము నా కొంపదీసె' నను లోకోక్తియు వినుచుందుము!

చిత్రకారుఁ డెంతటి జాగరూకతతో మెలంగునో యదే విధముగ, లేక యంతకన్న నెక్కుడుగ గవి శ్రద్ధ వహింపు చుండును. ఈతని ముఖ్యాశయము గూడ వస్తునిర్దేశమే! కవి - చిత్రకారు లిరువు రొకే యాశయముతోఁ బనిచేయు

చుందురు. ఒకండు గ్రహణశక్తిని నేత్రరూపమున గలుగ జేయును. వేఱొకండు శ్రవణరూపమునఁ గలుగఁజేయును. ఇరువురును హృదయానందముఁ జేకూర్పవలెనను నభిమతముతోడనే కృషి సల్పెదరు. చిత్రకారుఁడు వ్రాసిన గీతలో జీవరేఖ యంతర్వాహినిగాఁ బ్రవహించును. ముఖ్యముగ భావనలతో నవస్థావస్థలను గనిపెట్టి, రసానుభూతి పొంగి పొరలియుండుటకుఁ జిత్రకారుఁడు పాటుపడును. కవి సముచిత వాచిత్రి యను వెలుంగు కనమున నిడికొని, యవస్థను తదుద్యుతిచే గమనించి, భావనాయంత్రముచే వస్తుసందేశము గావించును. సాధారణముగాఁ దాము లిఖించిన గీతములను గాని, చిత్రములను గాని జనావళి గాంచి, తా మేవిధములగు భావములందు వ్యక్తీకరించిరో యవే భావములను గ్రహించి, తా మే విధములగు నూహలను చదువరుల - లేక - చూపరుల మనంబులందు జనింపఁజేయ సమకట్టిరో యా యూహలే ప్రజల మనంబుల బ్రతిబింబితములైనయెడల గవియొక్కయుఁ జిత్రకారుని యొక్కయు నభిమతములు సఫలీకృతము లయ్యె నన్నమాట !

కవి యొక పాత్రను ధీరోదాత్తునిగఁ బోషించుచు, తుదకా భావమునుండి తొలగింపఁజేసి రసాభాసము గలుగఁ జేసిన నాతని పాత్రపోషణ మనౌచితి యను మృత్యువాతఁ బడినదౌను. చిత్రకారుఁడు సైతము సింహమును దాని తోకపై నక్క యున్నటులఁ జిత్రించిన నసంభావ్యమగును ! రెండవ విషయ మవస్థానుగుణముగ లిఖించుట : ఉదాహరణమునకుఁ

గవి యవస్థానుగుణముగా లిఖింపనిచో నెట్లుండునో చూతము : రాముఁడు సీతను విపినంబుల డించి రమ్మని లక్ష్మణుని కాజ్ఞాపించుచు, మరల జానకితోఁ గలియుటయో, 'అయ్యో! ఏడ వలసివచ్చెనే' అని విలపించుటయో చేసినట్లు చిత్రించినచో నది కేవల మవస్థాననుగుణము.

తదితర లలితకళలకువలెనే కవిత్వ చిత్రలేఖనములకుఁ గూడ ప్రజల నైతికాధ్యాత్మికాభ్యున్నతియే లక్ష్యము. అందుచే నివి యెల్లకాలము నొకే విధముగ నుల్లసిలు ననుట యసంగతము; అవి దేశ కాల పరిస్థితులఁ బట్టి వివిధములై, యాయా దేశీయుల నైతికాధ్యాత్మికాది వ్యవస్థలనుబట్టి మాఱుచునే తదభ్యున్నతిఁ గలుగఁజేయును. అట్లే ప్రాచీనయుగములందు ప్రజల విజ్ఞానావస్థ వ్యక్తమగా నటుల సంస్కృతకావ్యములకుఁ బ్రాముఖ్య ముండెడిది. ఆంధ్రులలో రానురాను సంస్కృతకావ్యములపై నభిరుచి సన్నగిల సంస్కృతపద భూయిష్ఠములగు తెలుఁగు కావ్యములు బయలువెడలెను. మఱికొంత కాలమునకు జానుతెనుఁగు కావ్యముల కాదరము మెండయ్యెను. కడపట నధునాతన యుగమున వ్యవస్థాంతరమును దెలుపఁ దేటలగు చిట్టిపొట్టి కైతలకును, ఛందోనియమ మంతగా లేని భావగీతములకును బ్రాముఖ్యము ప్రబలినది. అది యీనాటి వారి విజ్ఞానావస్థం దెల్పును. వారు మహత్తర కావ్యములలోని (ఛందోబద్ధ) మహదాశయముల నర్థము చేసికొనలేకపోయినను 'ఎంకి పాటలలో' సువ్యక్తములగు మధురాశయముల నవగతము చేసికొనఁ గల్గుదురు. భాషాయోష శాస్త్రచోదితాచారముల నతిక్రమించి, 'ఏటురాలి విధమున

వెడలె' ననుట కవితలోని యుత్కృష్టభావముల, నున్నతాశయముల గ్రహింపనేరమికిఁ దార్కాణము. పతితులగువారిఁబైకెత్తఁ గవితావధూటి చేయూతనొసంగుటకై నడుము వంచిన మాత్రమున నామె గౌరవహీన గానేరదు. ఆమెను పతిత యనువారు భాషాబహిష్కారమున కర్హులు.

అవ్విధముగనే ప్రాచీనయుగముల వర్ణచిత్రముల యున్నతాసన మీనాడు లేఖాచిత్రముల కొసఁగఁబడినది. ఇవి భావవిహీనము లనిగాని, నియమరహితము లనిగాని యనుట సమంజసముగాదు. వర్ణచిత్రములకు వర్ణములు, కుంచె మొదలగు పరికరములు గావలె. కాని, రేఖాచిత్రములకు లేఖిని, ఫలకము లుండినఁజాలును. ఒక వర్ణ మొక్కొక తావునందు దిద్దిన నెంత గంభీరముగా నుండునో యటులనే నవయౌవనుఁడౌ పురుషుని చిత్రమునం దొక రేఖచే ముదుసలిగాఁ జేయగల శక్తి రేఖలో నున్నది. కనుక ప్రాచీన కవిత్వమందును, చిత్రలేఖన మందును మార్పు కలిగినది. ఇది కేవలము కాలానుగుణమగు మార్పని మనము తెలిసికొనియే యున్నాము.

దేశీయులకు రాను రాను కాలముయొక్క విలువ తెలియుచున్నది. పెద్ద పెద్ద ప్రబంధములుగాని, గ్రంథములు గాని, చూచి చదువునంతటి వ్యవధి యున్నటులఁ గానరాదు. కనుకనే భావగీతముల కాదరము గలుగుచున్నది. ప్రజలకు సౌకుమార్యము ప్రబలినది. గంభీరములగువానిం జూచునంతటి - లేక - ఎదుర్కొనునంతటి ధైర్యము లేదు. పెద్దన వ్రాసిన మనుచరిత్రము నామూలాగ్రముగఁ జదివి యానందించిన

మానవు లెందఱో మూచిన నొకవెక్కకు రారని చెప్పవచ్చును. ఎందుచేత? రసార్ద్రములైన ఘట్టముల వఱకే జనుల యానము! అప్పటికిని మధ్యలో 'అటజని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ పటలముహుర్ముహుర్లుఠ' అని వచ్చిన వదలి వేయుటయే! వదలివేయుటయేకాక, 'నారికేళపాక మేమిటోయి' అను మాటలతో నాకవిత్వమును కొందఱు తూలనాడెదరు. అట్టి పరిస్థితులలో భావగీతము లుత్పత్తిల్లి వీరి లోటును దీర్చి మెప్పుఁ బడసినవి. అటులనే ప్రాచీనచిత్రముల నుండు వర్ణములఁ జూచి యసహ్యపడు సంతతి సౌకుమార్య మేర్పడినది. దీనింబట్టి కవి, చిత్రకారులు కాలానుగుణముగ, ప్రజాభిరుచిని బట్టి ప్రజల నైతికాధ్యాత్మికాభ్యుదయమునకై పాటుపడుచుందురని గ్రహింప వలయును.

కవియుఁ జిత్రకారుఁడు నొకే యాశయముతో ద్వివిధము లగు కార్యముల నెరవేర్చుచున్నారని యెఱింగితిమి గదా! కవియొక్క కథలనైనను, గీతములనైనను చిత్రరూపమున వెలిబుచ్చి, చిత్రకారుఁడు గ్రహణశక్తికిఁ దోడ్పడును. అట్టితఱి కవియే చిత్రకారుఁడైనచో వస్తునిర్దేశ మెక్కుడుగ రాణించును గదా! అనఁగా కవితా చిత్రలేఖనము లను రెండు కళ లొకే వ్యక్తి కలవడినచో దాను చెప్పఁదలఁచినదాని రెండు విధముల నాతఁడే వ్యక్తీకరించును. దీని కుదాహరణములఁ జూచినచో కవితకును చిత్రలేఖనమునకును సన్నిహిత సంబంధ మెంత యుండునో గ్రహింప వీలగును. కవికిని చిత్రకారునికిఁ దోడ్పడు ప్రకృతికిని కవితా చిత్రలేఖనములకు నెట్టి సంబంధ మున్నదో యూహింతురుగాత. అరుణోదయమును గవి వర్ణించును;

చిత్రకారుఁడు చిత్రించును. ఈ చిత్రము ప్రక్కనే గీతము నుంచిన నవి పరస్పర దోహదభూతములై కర్తృ భావములను సులభముగ వ్యక్తముగుటకు వీలొనగూర్చును. కవికుమారునికిఁ జిత్రకారునకుఁ బ్రకృతి నెంత సహాయకరమగువస్తువో తెలియును. సాధారణముగాఁ గవి చిత్రకారులకుఁ బరిసర దృశ్యములు తమ కృతుల ప్రేరకములుగా పరిణమించుచుండును. కావున లలిత కళోపాసకులు ప్రకృత్యుపాసనము ప్రథమ కర్తవ్యముగా నెఱుఁగవలెను. ప్రకృతి ప్రభావ రహితములైన చిత్రకావ్యములు నిర్జీవములే !

# పదకవిత్వము

కవిత్వము లలితకళ లన్నిటిలో నగ్రస్థానము వహించుచున్నదని పండితుల సిద్ధాంతము. సంగీతములో నున్న హృదయద్రవీకరణశక్తిని, చిత్రలేఖనమందలి రూపకల్పనము, నాట్యమందలి చేష్టావైచిత్రుల నిముడ్చుకొని భావనాత్మకమై కవిత యొప్పారును. కవితలోఁ జిత్రితములైన పాత్రములు చిత్తరువులలో వానివలె గాక సచేతనములు. అవ్యక్త మధుర గీతి యంతర్వాహినిగా కవితలోఁ బ్రవహించుచుండును. దీనిని గమనించియే కార్లైలు పండితుఁడు కవిత గీతాత్మకమైన భావమని నిర్వచించినాఁడు.* కవిత్వమునకు భావ, వస్తు, రచనలు ప్రధానాంశములు. వీనిలో దేని ప్రభావము మిక్కుటమైన దానిపేర కవిత్వము బరఁగుచుండును. అట్లు వచ్చినవే భావకవిత్వ, వస్తుకవిత్వములనునవి. రచనములో శబ్దార్థములే ప్రధానములు. మధురమంజులగానయోగ్యమైన యక్షరములకే మైత్రి గల్పించుట రచనమందలి విశిష్టగుణము. రమ్యాక్షరాపచయము, శ్రవణానందకల్పనము లొనర్చుట కవికార్యము. ముఖ్యముగా పదకవిత్వము దీవిధమైన రచనాసౌందర్య మొలుకుచుండును; అయ్యది శ్రవణసుఖమునిచ్చుచు, హృదయమును ద్రవీభూత మొనర్చి మానవుని సంస్కరించును.

పదకవిత్వము మాత్రాఛందము కలిగి, శబ్దకాఠిన్యము లేక సరసమగు పదములతోఁగూడి, గానయోగ్యమై, రాగరంజి

* Poetry, we will call, is musical thought.

తమై, జాతీయాచార వ్యవహారములకుఁ బ్రతిబింబమై, చక్కని నానుళ్ళకుఁ బలుకుబళ్ళ కాశ్రయమై, మానవుల కష్టనిష్ఠురముల మరపించునదై, పండిత పామరరంజకమై వర్తిలునది. జాతి ప్రబోధమునకు, నుద్దీపనమునకు నీ పదకవిత తోడ్పడుచుండును. ఇట్టికవిత ప్రతి భాషావాఙ్మయములో నుండును. కాని తెలుఁగు పదకవిత కొక విశిష్టత యున్నది. సహజసారళ్య సంశోభితమును, మృదుమధురగాన యోగ్యము నగు తెలుఁగు పదములలో నాదసౌందర్య మున్నట్లు తెలిసికొందుము. పాశ్చాత్యులు సైతము మన భాషను మెచ్చుకొనిన కారణ మిదియే ![1]

మన దేశములోఁ బద కవిత్వ మనాదిగా, ననుస్యూత ముగా వర్తిలుచునే వచ్చినది. ప్రాక్తన మానవుఁడు ప్రకృతి శోభకు పరవశుఁడై యనిర్వచనీయమగు నానందమును బొంది యుండును. తన మనోభావమును ప్రదర్శించుట కాతఁడు జిందులు ద్రొక్కి చప్పట్లను చరచి, శబ్దరహితమైన నాద మాలపించియుండునని భావింపగలము[2]. అజ్ఞాతావస్థలోని మానవుని మనసు పరిశీలించిన నది శిశుమానసమువలె, నవనీత సదృశమైనదని తత్త్వజ్ఞులు జెప్పుదురు. శిశువు కూడ తన యానందమును బైవిధముగనే ప్రదర్శించునట్లు ప్రత్యక్షముగాఁ జూడగలము. సృష్ట్యాది నుండియు నిశిత నిర్భరమగా మానవుని భావానుభవము లయాన్వితమైన భాషలోనే వ్యక్తమగు

1 Telugu is the Italian of the East.
2 Moulton's Theory.

చుండుట తథ్యము.* ఈ ధర్మానుగుణముగనే వాల్మీకి శోకము శ్లోకత్వ మొందినది. ఈ విధముగా నుద్భవించిన గీతి యుద్రేక పూరితమై యుండి రాగ రంజిత మగును. ఇట్టి గుణము పద కవిత్వములోనే యుండుట కెక్కు డవకాశ మున్నది. కాని పద్యములో నుండుటకు వీలు లేదు. పదకవిత్వ ముద్రేకోత్సాహ ప్రేరితములగు కర్తృభావములు కలదగుటచే గాతృ శ్రోతృ హృదయములలో నాభావములు సూటిగా వెడలి, నిశితముగా నాటుకొని, వేగముగా నుద్దిష్ట రసానుభూతిఁ బొందించును. ఇంత త్వరితముగా బోధించు గుణము మాత్రా ఛందముల కున్నంతగా గణఛందముల కేలనో లేదు. ఇది పదకవిత్వమున కున్న విశిష్టగుణము.

ఈ విధమైన పదకవిత్వము రాజాస్థాన గౌరవముఁ బొందదు. పొందలేదని విచార మక్కరలేదు. రాజసభలలో నంతయుఁ గృత్రిమ వాతావరణము. అం దాదరము బొందు కవులు, కవిత్వముఁ గూడ స్వేచ్ఛారహితమై రాజుల కనుసన్నల మెలఁగుచుందురు. కాని పదకవిత్వము ప్రజాసామాన్యము పాలిటి పెన్నిధి. రాజాదరముతో దీనికి నిమిత్తము లేదు. ప్రజల కానందముఁ జేకూర్చి, వారిచే మన్ననలు బొందుచు, వారిని నిరాడంబర జీవులుగా, తేజోమూర్తులుగా, నుత్తమ శీలురుగా సంస్కరించుటయే దాని యుద్దేశము. ఈ పదకవితా నిర్మాతలుగూడ ప్రజాదరమునే వాంఛించిరి గాని రాజాజ్ఞలకు లోబడినట్లు గాన్పింపరు. అట్లు కానిచో వారి కవితలో నంతటి

* Ever since man has been born, all deep and sustained feeling is seen to express itself in rythmical language
— S Mill.

యుద్రుతము స్వేచ్ఛతలు స్వతంత్రభావము లుండుట కవకాశ మెట్లు పొసఁగును? ఈ పదకర్తలు కీర్తికాములు కారనియు, స్వేచ్ఛాజీవులనియు, సున్నిత హృదయులనియు, ముముక్షువులనియు, వారి వారి రచనలఁబట్టి తెలిసికొందుము. అనేక ప్రాచీన పదములకుఁ గర్తలెవరో మనకుఁ దెలియుటలేదు. కాని యా పాటలు మంచి ప్రచారము నందినట్లు గ్రహింపగలము. ఇందు వారి స్వార్థరహిత బుద్ధిని, పరార్థ సేవను మనము జూడ గల్గుదుము. ఈ పదకవిత్వ మింతకాలము ప్రజల నాలుకలపైననే వర్తిలుచుఁ బ్రాచుర్యముఁ బొందుచున్నదనిన నా కవితాప్రభావ మెంతటిదో గదా!

తదితర దేశముల వలె గాక భారతదేశము ప్రధానముగా వ్యావసాయిక దేశము. పనిపాటలవారీదేశమం దెక్కువగా నున్నారు. యంత్రయుగము రాకపూర్వము పనివారల కలసట కలుగనీయక నీ పదకవిత వారికి నుత్సాహ మిచ్చుచుండెడిది. మన కీనాటికిని పల్లెలలో నీ విధముగా పదకవిత్వ ముపయోగపడుచుండుట గాంచెదము. పాశ్చాత్య దేశములలో వలె గాక మన దేశములో పారలౌకిక చింతయే ప్రముఖమై యొప్పారునది కావున మనదేశ కవిత్వములో నాధ్యాత్మికవిచార మెక్కుడుగా గన్పించును. సర్వకాలములలోఁ బ్రవహించు నదీనదములు పుష్పఫలలతాదులచే శోభితమగు వనములు, సముద్రతీరములు, ఉద్యానవనములు, పర్వతశ్రేణులు, కీరశారికాది విహగరుతములు భారతీయ ప్రకృతిలోనివి! పాశ్చాత్యుల కీవిధమైన సహజప్రకృతశోభ లేదు. ఈ ప్రకృతిశోభ భారతీయ కవిత్వములోఁ బ్రతిబింబించుచుండును. పదకవిత్వములో శృంగారగీతములు ప్రకృతి

ప్రభావవిలసితము లే. శౌర్యపౌరుషములలో భారతదేశము ప్రశస్తిఁజెందినది. అనేక వీరు లసమానముగా రణరంగముసఁ బోరాడి మృతజీవు లైనారు. కవితలో నీ విషయమును స్థానముం గొన్నది. ఈవిధముగా భారతదేశము పార్థక్యము గలది. తదనుసారిగాఁ గవితకూడ తదితర దేశముల కవితకన్న విలక్షణ మైనది. ప్రకృతి సౌందర్యము, తత్త్వజిజ్ఞాస, వీరగాథలు భారతదేశపు స్వత్వములు. ప్రాచీన పదములను బరిశీలించి నచో వీర, శృంగార, తత్త్వపరములుగా నవి యున్నట్లు కన్పించును.

మన పదకవిత్వములో నుపాదేయమగు మాత్రా ఛందస్సు దేశీయమైనది. తదితర గణ ఛందస్సులవలె సంస్కృత లక్షణానుసారి కాక యిది విలక్షణమైన తెలుఁగువారి సొమ్ము. ద్విపదలు, త్రిపదలు, చౌపదులు, షట్పదులు, రగడలు, అక్కరలు మొదలైనవి దేశీయ ఛందస్సులు. ప్రాచీన పదకవిత్వ మంతయుఁ బైవానియందే చెప్పఁబడినది. కీర్తనలు, దరువులు, పాటలు, పదములు, గేయములు, గీతములని యీ పదకవిత్వములో ననేక తరగతులకుఁ జెందిన రచనములున్నవి. వీనిం బాడుటకుఁ బ్రత్యేక ఫణుతులు, నియమిత సమయములు, గొన్ని వృత్తి సంఘము లుద్దేశింపఁబడినవి. అనాదినుండి యీ పదకవిత్వమును మన దేశీయులు తమ తమ వంశ పారంపర్యముగా నందించు కొనుచు వేదములవలె భద్రపరచినారు.

ఆంధ్రసాహిత్య చరిత్ర నవలోకించుచో నీ పదకవితా ప్రశంస యందందు కన్పించుచున్నట్లు తెలియుచున్నది. పండ్రెండవ శతాబ్దమునాటికి మన సాహితీ ప్రపంచములోనికి శైవ కవులు ప్రవేశించినారు. వీరు భాషావిప్లవము తెచ్చిపెట్టినారు. ప్రజలలో వీరశైవమత వ్యాప్తి కలిగించుటకుఁ గావ్యముం జేపట్టినారు. సంస్కృపదభూయిష్ఠ రచన ప్రజల కందుబాటులో నుండదని 'జాను తెనుఁగు' భాషలో వ్రాయ మొదలిడినారు. వృత్తము లకు బదులుగా దేశీయఛందమైన ద్విపదలో కావ్యముల వ్రాసి, మత ప్రచారమునకు దేశీయ ఛందస్సు, వ్యావహారికభాష లత్యంతోపస్కారములని కనిపెట్టినారు.* శైవ పరములైన గీతము లనేకము లల్లఁబడి శ్రీశైలముం బోవు యాత్రికులవలన, భక్తులవలనఁ బ్రాచుర్యమందినట్లు పండితారాధ్య చరిత్రలో వ్రాయఁబడినది. తుమ్మెదపదములు, నివాళిపదములు, ఫాలేశు పదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనందపదములు గొబ్బిపదములు, వెన్నెల పదములు, సెజ్జవర్ణన పదములు మున్నగున వెన్నియో భక్తులచేఁ బాడఁబడుచుండెడివట!

తరువాతకాలములో గోన బుద్ధ భూవిభుని రంగనాథ రామాయణము ద్విపదకావ్యముగా వెలసి 'తోలుబొమ్మలాట' ద్వారా ప్రజల కందుబాటులోనికి వచ్చినది. ఇట్లే గౌరన రాఘువార్యుల హరిశ్చంద్ర, నలోపాఖ్యానములు ద్విపదకావ్య ములుగా నవతరించినవి. శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును

* "ఒప్పదు ద్విపద కావ్యోక్తి నా జనదు, అరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబు గామి, జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు"

ద్విపదకావ్యముగా నిర్మించి పదకవితావాఙ్మయములో శాశ్వత స్థానము నలంకరించినాఁడు. సమాజములో భావావేశము ప్రేరించు సన్నివేశములు పదకవితావస్తువుగా పరిణమించి జాతి నుద్బోధించుచుండును. ఇట్టివే కాటమరాజుకథ, బాలనాగమ్మ కథ, బొబ్బిలికథ, కామమ్మకథ మొదలైనవి.

పదునారవ శతాబ్దము నాటికి ప్రబంధప్రక్రియకు గౌరవము హెచ్చినను పదకవిత వర్ధిలుచునే వచ్చినట్లా కాలమునకుఁ జెందిన తాళ్లపాక చిన్నన రచించిన వెంకటేశ్వర స్తుతి పదములు[1], ద్విపదరచనలు ఋజువుపఱచును. కందుకూరి రుద్రకవి[2] కూడ నష్టపదులు రచించి పదవాఙ్మయమునకు నివాళి పట్టినట్లు తెలియుచున్నది. ఇట్లే రాయలకాలమందును పదకవిత వరలినట్లును, ప్రబంధమం దాదరముచే నది మరుఁగునపడుచు వచ్చినట్లును కన్పించును.

పిమ్మట పదునేడవ శతాబ్దములో నాయకరాజుల పరిపాలనమందు గీతికినాదరము మెండాయెను. గేయవాఙ్మయము విరివిగాఁ బెరిగినది. యక్షగానము లుద్భవించి మాత్రాఛందస్సునకవకాశము మిక్కుటముగా నిచ్చినవి. సంగీతమునకు రాజాస్థానములలో నత్యంత గౌరవము లభించిన దినములవి. శహాజీకాలములో తిమ్మయద్విపదభారతమును రచించినాఁడు. తరువాత శరభోజీ కాలములో (1711–28) త్యాగ

1. దీని నంతటిని సంపుటములుగా శ్రీ తిరుపతి దేవస్థానమువారు ప్రచురించుచున్నారు.
2. కొందఱీతనిని నాయకరాజుల కాలములోనివాఁడని చెప్పుచున్నారు.

రాజు భక్తిసారవశ్యమున కీర్తనముల నేకము రచించియున్నాఁడు. విజయ రాఘవ నాయకుని కాలమునకు జయదేవుని గీతగోవింద ప్రసిద్ధిని క్షేత్రయ తన పదములను రసవంతముగా నల్లినాఁడు. ఇవి రాధాకృష్ణుల శృంగారమును వర్ణించునవై నేఁటికిని ప్రచారములో నున్నవి. తరువాత దీక్షితులు, శ్యామశాస్త్రులు మొదలైనవారు త్యాగరాజు ననుసరించి, తరంగములను, కీర్తనములను రచించినారు. ముద్దుపళని కూడ రసవంతముగా సప్తపదులను వ్రాసినది. మొత్తముమీఁద తెలుఁగుతీయదనము, నాదగౌరవములు నాటికవులు తిన్నగాఁదెలిసికొని తమపదములలో దిద్దినారనియే చెప్పవలెను.

తరువాతకాలములోఁబదకవిత్వ మపరిమితముగా వృద్ధిఁజెందినది. అధ్యాత్మరామాయణ కీర్తనములు, రామదాసు కీర్తనములు, స్త్రీలపాటలు, భజనకీర్తనములు, తత్త్వగీతములు మున్నగునవి యెన్నియో రచింపఁబడినవి. పదకవిత్వములో స్త్రీల పాటలు విలక్షణమైన స్థానమును వహించును. మన జాతిజీవనమంతయు నందు ముద్రితమైనట్లు గ్రహింపగలము. జోలపాటలు, తలుపుదగ్గరపాటలు, మంగళహారతులు, మేలుకొలుపులు, వరసపాటలు, లాలిపాటలు, నలుగుపాటలు, బూజంబంతి పాటలు, చెండాట పాటలు, ఒప్పగింత పాటలు, మొదలైనవి జాతీయ జీవనమునకు నందలి ఆచార వ్యవహారములకుఁ బ్రతిబింబములు. ఇవిగాక, అక్కలపాటలు, నాగారు బొమ్మపాటలు మొదలైనవి తెలుఁగువారి యాచార వ్యవహార విశ్వాసములను జాటుచుండును. వీనిని పురుషులేకాక స్త్రీలు

గూడ నెందరెందరో రచించినారు. ఊయుపుపాటలు, నూర్పిళ్ళ పాటలు, దంపుళ్ళపాటలు, పడవపాటలు మొదలైనవి నేటికిని ప్రచారములో నుండి వ్యావసాయిక జీవితమును జాటుచున్నవి. పోతులూరి వీరబ్రహ్మాంత తత్త్వములు, 'జీవా' అనియు, 'మనసా' అనియు, 'చిలుకా' అనియు మకుటము గల తత్త్వగీతము లనేకము లున్నవి. తులసిపాటలు, దండకములు, గోవింద నామాలు మొదలైనవి భక్తిపరములైనవి కలవు. బుడబుక్కల పాట, గంగిరెద్దుపాట, గొబ్బిపాట, బతకమ్మపాట మున్నగునవి కొన్ని కాలములందే పాడుట విన్పించుచుండును. దాగుడు మూతలు, వెన్నెలకుప్పలు, చెమ్మచెక్కలు, గుడుగుడుగుంజం, కాళ్ళాగజ్జ, కోలాటము మొదలైన యాటలాడుచు పాటలు పాడుకొనుట యాంధ్రబాలికల సంప్రదాయము. ఊర్మిళాదేవి నిద్ర, సీత సీమంతము, లక్ష్మణదేవర నవ్వు, లంకాయాగము, కుశలాయకము, సత్యభామ సరసము, ద్రౌపదీ వస్త్రాపహారణము మొదలైన పాటలు మన పురాణాది గ్రంథములలోని విషయము లను బురస్కరించుకొని వ్రాయఁబడినవి. ఇవి స్త్రీలను విజ్ఞాన వతులుగాఁ జేయు తలంపుగల యిటీవలవారి యత్నఫలము. దాసు శ్రీరామపండితుఁడు జావళీలు, కీర్తనలు రచించి ఖ్యాతి వడసినాఁడు. తురగా వెంకటరామయ్య, గాలి సుబ్బా రాయుఁడు, వెంకమాంబ, నరసమాంబ, రామలక్ష్మమ్మలు — ఇటీవలి పదకర్తలలోఁ గొందఱు.

ఈ శతాబ్దములోఁ బదకవిత్వమున కెన్నడు లేని యాదరము జేకూరినది. ఆంగ్ల సాహిత్యావలోకనము వలన మొదట మన సంప్రదాయమును నిరసించినను, తరువాత క్రమముగా స్వీయ

సంస్కృతిపైఁ బ్రత్యయము హెచ్చినది. దేశీయ వస్తువులపై నభిమానము జనించినది. అట్లే సజాతీయమైన మాత్రాఛందము నకు, జాతీయ నుడికారము కలిగిన వ్యావహారిక భాషకును గౌరవ మభివృద్ధిఁ జెందినది. తత్పరిణామ విశేషమే గేయ కవితావిర్భావము. మన ప్రాచీన కవితాచరిత్ర, జాతిజీవనము, సంప్రదాయములను దెలిసికొనవలెననెడి యాకాంక్ష పొడమినది. తన్నిమిత్తము పరిశోధనలు జరుగుచున్నవి. ఇది శుభసూచకమే! ఈ శతాబ్దములో ననేకులు గీతముల వ్రాయుచున్నారు. దేశభక్తి ప్రబోధ గీతములను వ్రాసిన వారిలో గరిమెళ్ళ సత్యనారాయణ, మంగిపూడి వెంకటశర్మ గారలం బేర్కొని తీర వలెను. ప్రణయపరముగా నండూరి వెంకట సుబ్బారావుగారు రచించిన 'ఎంకిపాటల' కున్న గౌరవ మింతింతని చెప్పలేము. భక్తిగీతములు హరనాధ సాయిబాబాల పరముగా వెలువడినవి. ఈ సందర్భమున పెండ్యాల సీతారామయ్యగారు పేర్కొన దగినవాఁడు. నవ్యులలో అడివి బాపిరాజు, బసవరాజు అప్పారావు, కవికొండల వెంకటరావు, ప్రయాగ నరసింహశాస్త్రి ప్రభృతు లెందఱో పదములను రచించి ఖ్యాతి గడించుచున్నారు.

పదకవిత్వ మీవిధముగా మన సాహిత్యములో ననాదిగా వర్తిలుచు ప్రజల సానుభూతిఁ బొందుచున్నది. దీనిని పిచ్చుగుంటలవారు, జంగములు, గొల్లలు, చెంచువారు, పగటివేషధారులు, దాసరులు మున్నగువారు వృత్తిసంఘములుగా చేరి పదకవిత్వమును శ్రావ్యముగాఁ బాడుచు నేళ్ళ తరబడిగా దానిని భద్రపరిచినారు. పూర్వుల కున్న జ్ఞాపకశక్తి యవధానగుణము నీనాటివారికి లేవు. అదియునుగాక ముద్ర

ణాది సౌకర్యములు వచ్చినందు వలన ముఖస్థ మొనర్పవలసిన యావశ్యకత తప్పిపోయినది. మానవుని నాగరకత వృద్ధియై వల్లెవేయుట న్యూనతగా భావించునంతటి సౌకుమార్యమబ్బినది. ఇవి యన్నియుఁ గారణములుగా పదకవిత్వమే బ్రతుకు తెరువుగా చూచుకొనుచున్న పై వృత్తి సంఘముల కాదరము క్రమముగా క్షీణించినది. తదితర వర్ణములవారే విధముగా నీ పాశ్చాత్య నాగరకతా సంసర్గమువలన తమ తమ ధర్మముల విడచి 'సర్వం జగన్నాథం' వలె సాంకర్యమునకు లోనైరో, యట్లే యీ నిరాదరముం జూచి భరింపలేక క్రమముగా నా వృత్తుల మాని యాంగ్లవిద్యాభ్యాసము మొదలిడి యందరిలోఁ గలసి పోయిరి. అంతటితోఁ బదకవిత్వ మడుగంటినది! విద్యార్జన మునకుఁ బల్లెలనుండి ప్రజలు పట్టణముల కెప్పుడు వచ్చిరో యప్పుడే పదకవిత్వమునకుఁ బ్రచారము నాశమైనది. నేడు ప్రాచీన పదకవితా వైభవము నరయుటకు సరియైన యవకాశ ములు లభించుటలేదు. ఆ ప్రాచీన సంప్రదాయము వదల లేక యెచటనైన నీ వృత్తిసంఘము లున్నను, పదకవిత్వపు సమగ్రస్వరూపము దాటిపోయినట్లే. ఒకజాతి పదకవిత్వము నశించిపోయినచో నాజాతి సంస్కృతి కూడ నాశమైనట్లే భావింపవలెను.

కావున సాహితీసేవకులు మన ప్రాచీన పదకవిత్వమును సేకరించుటలో వారి కాలము వ్యయింపవలసియున్నది. శ్రమ కోర్చి యూరూరు తిరిగి, ప్రాచీన పదములను, కీర్తనలను పాటల నాయాయి స్థలములందున్న వృద్ధులనుండి, పనిపాటల వారినుండి గ్రహించి వ్రాసికొని యొకచోఁ గూర్పుట మన

జాతి కర్తవ్యము. ప్రతి మానవుఁడు తన బాధ్యత యిది యని తలంపవలెను. ఇట్టి సంకలనము సంఘజీవితమును జిత్రించు చరిత్రకారుని కత్యంతోపయుక్తమగుటయే కాక, స్వచ్ఛమై జాతీయమైన తెలుఁగు భాషా స్వరూపము నందించిన దగును. ఈ పదములను సేకరించి ప్రచురించినను వానిం బాడవలసిన ఘణుతులలోఁ బాడుచుండకపోయిన ప్రాచుర్యము లేకపోవును. ఇందుల కాయా వృత్తి సంఘములం బోషింపవలెను. అపుడు గాని తత్పోషణము సంపూర్ణముగాదు. కావున నిట్టి పదకవితా సంపుట మొకటి కూర్చి ప్రకటించి ప్రాచుర్యము గల్గించుట మన ప్రజలమీఁద నున్నది. [1]పదసాహిత్యమునకు నివాళి పట్టెడి సాహిత్యార్చకులు రావలసియున్నారు. దేవేంద్రసత్యార్థి, నేదునూరి గంగాధరము, ఓరుమళ్ళ కామేశ్వరరావు గారలు చాలవర కీ మార్గములో గృషి చేయుచున్నారు. ఇటీవల విద్య లేని ప్రజలపై సానుభూతి హెచ్చుచున్నది; ప్రజావాఙ్మయము వ్రాయవలయు ననెడి యభిప్రాయము కల్గినది. దేశభాషాభి మానములు మిక్కుటమైనవి. ప్రజలలో విజ్ఞానవ్యాప్తికై దీక్ష పూనినవారు కాలయాపనము చేయక యీ పదకవిత్వమును సేకరించుచో ప్రాచీన పదకర్త లిచ్చిన సంపదయొక్క విలువను

1. నీ చక్కని సాంప్రదాయమును—కమ్మని పలుకుబడిని—విశిష్టమైన భాషామర్యాదను—చవులూర్చు జాతిచ్ఛందస్సులను — నీ జన్మహక్కుగా పోరాడి రక్షించుకోవలసిన అవసరముమాత్ర మున్నది. (శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి ఆంధ్ర ఉగాది–బహుధాన్య)

గుర్తించి సేవ చేసినట్లగుదురు.[1] ఇట్టి కార్యమునకుఁ బ్రస్తుత కాల మత్యంత మనుకూలించును. సాహితీసేవకు లుత్సాహముతో నీ కాలమును సద్వినియోగ మొనర్తురని యాశ పొడముచున్నది.

1. ఇటీవల రేడియో కేంద్రములు విరివిగా జానపదగేయములను ప్రసారము జేయుచుండుట యెన్నదగిన విషయము. చిలుకూరి–అడివి–గిడుగు–అనిశెట్టి–యర్రోజు మొదలైనవారు కొన్ని సేకరించియున్నారు. బి. వి. నరసింహారావుగారు ప్రత్యేకముగా బాలగేయములను రచించుచు చక్కని కృషి గావించుచున్నారు.

# ప్రబంధ వాఙ్మయము

వాఙ్మయము యొక్క స్వరూప నిర్ణయ సందర్భమున ననేక ప్రమాణములఁ బట్టి యనేక భేదములను మన యాలంకారికులు నిర్ణయించినారు. ఛందోలక్షణము ననుసరించి కావ్యములు గద్యాత్మకము లనియుఁ బద్యాత్మకము లనియు, గద్య పద్యాత్మకము లనియు మూఁడు విధములుగాఁ బరిగణింపఁబడివి. ఈ గద్యపద్యాత్మకమను కావ్యజాతిలోఁ జేరునదే ప్రబంధము. కాని గద్యపద్యాత్మకమైన ప్రతికావ్యము ప్రబంధము కానేరదు. చంపువులు, నాటకములు, పురాణములు, ఇతిహాసములు — గద్యపద్యాత్మకమైన కావ్య ప్రక్రియకుఁ జెందినవే. కాని భిన్న లక్షణములు కలిగిన వీని నధిగమించి, విశిష్టమైన స్థానము నందుకొనినది ప్రబంధము.

కావ్యమునకు భావ వస్తు రచనలు ప్రధానమైనవిగా పెద్దలు ప్రతిపాదించినారు.[1] ప్రబంధమం దితరకావ్యభేదముల కన్న వస్తువు నాలంబనముగాఁ జేసికొని, భావరచనల కెక్కుడు స్థాన మొసంగినట్లు గమనింతుము. ప్రబంధోచితమైన వస్తువును గ్రహించుటలో విశిష్టత లేకపోలేదు. అట్టి వస్తువుయొక్క యునికియే కాక తద్దేహమున కావశ్యకమగు సంధిసామగ్రి, సౌందర్యాపాదకములౌ యితరావయవ సౌష్ఠవము లుండవలెను ; అపుడే యది ప్రబంధ మగును. కావ్యమం దంగాంగిభావము లేనిదే సౌందర్యము సంపూర్ణము గాదు. కావ్యమందలి ప్రత్యవయవమునకును, వస్తువునకును, బ్రకృష్టమైన

---

1. శ్రీయుతులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, కురుగంటి సీతారామయ్యగారలు.

బాధ ముండును గనుకనే యీ శిల్పమూర్తికిఁ బ్రబంధ మను పేరు వచ్చినది. 'ఈ ప్రబంధ మాంధ్ర వాఙ్మయ వనములో నుద్యానము వంటిది'గ సాహిత్యవేత్తలు పరిగణించినారు.

కావ్యమీమాంసఁ జేసిన పూర్వ లాక్షణికుల మతము లన్నియు, నించుమించు 'ప్రబంధముల' కన్వయించుననియే చెప్పవచ్చును. 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అను జగన్నాథుని నిర్వచనము నిలచియున్నది కదా! పూర్వు లెవ రెవ రేయే యంశములకుఁ బ్రాధాన్య మిచ్చి నిర్వచించినను, వారెల్లరు కావ్యములోని బీజభూతమగు నభిప్రాయము నేకీభవించియే యున్నారు. కావ్య సామాన్యలక్షణము లేకాక ప్రబంధమను మహాకావ్యమునకు లక్షణము వేరుగ నిర్వచించిన విధ మారయుదము: పురాణేతిహాసములలోని యుపాఖ్యానమును జేపట్టి స్వకపోలకల్పనలచే దానిఁ బెంపుచేసి, యష్టాదశ వర్ణన లందందుఁ జొప్పించి, రసాభివ్యక్తికిని, పాత్రచిత్రణమునకు నెక్కుడు ప్రాధాన్య మొసంగి, శబ్దార్థాలంకార సహితముగా సాగించిన రచనమును బ్రబంధ మనినారు. ఈ వచనమునకుఁ దగినట్లుగాఁ బూర్వ లాక్షణికోదాహృత శ్లోకముల నిట నుదాహరింతును. అష్టాదశ వర్ణనల నుగ్గడించుచు—

'సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోష ధ్వాంత వాసరాః
ప్రాత ర్మధ్యాహ్న మృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభౌ చ, మునిస్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః

వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ'
అని పేర్కొనినాఁడు డాక లాక్షణికుఁడు. సర్వ ప్రబంధ సామాన్యలక్షణముగా—

'అదౌ నమస్క్రియాऽऽశీర్వా వస్తు నిర్దేశ ఏవవా
క్వచిన్నిందా ఖలాదీనాం సతాంచ గుణ కీర్తనమ్'

అనియు నిర్దేశించిరి. పాత్రనిర్మాణ సౌకర్యార్థమై యుదాత్త నాయకుని చరిత్ర గ్రహింపవలయునని—

'సర్గ బంధో మహాకావ్యం తత్రైకో నాయక స్సురః
సద్వంశః క్షత్రియోవాऽపి... ... ... ... ... ...
ఏకవంశ భవా భూపాః కులజా బహవోపివా'

అను శ్లోకమందు వచించెను.

అప్పకవియుఁ బైశ్లోకార్థములనే తన లక్షణ పద్యమందుఁ జొప్పించెను. కాని, యష్టాదశ వర్ణనములకు మాఱుగాఁ నిరువది రెండువర్ణనలఁ జెప్పవలయునని సంఖ్యను బెంచినాఁడు.

పురమును ఋతుషట్కమును బ్రభాణంబును
శైలంబు వేఁటయు సాగరంబు
మానీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వన విహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుత జననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలుగూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస'

'ప్రబంధ' పదము మనకుఁ జాల ప్రాచీనముగా నుండినట్లు తిక్కన ప్రయోగము సాక్ష్యమిచ్చుచున్నది. 'ప్రబంధ మండలి' అను ప్రయోగము యొక్క యర్థప్రమాణము గ్రహించుట యిట నవసరము. భారతమును ప్రబంధ మండలి యనుటలోఁ దిక్కన దృష్టి యితఃపూర్వము మనము నిర్వచించిన ప్రబంధ శబ్దమునకుఁ దులదూఁగునదిగా నున్నట్లు స్పష్టము. తిక్కన యొక్కొక పర్వమును ప్రత్యేక ప్రబంధముగా నొనరింపవలె నను దృష్టితో రచించెను.[1] ప్రబంధోచితమైన పాత్ర చిత్రణము తిక్కన రచనములో సువేద్యము. తిక్కన ద్రౌపది పాత్ర చిత్రణమే మనుచరిత్రములో వరూధిని పాత్రమును చిత్రించుటకు పెద్దనకు కౌశలము నిచ్చినదనవలెను. పాత్ర చిత్రణమునకుఁ దెలుఁగులోఁ దిక్కనయే ప్రథమ శిల్పి! కనుక, ప్రబంధబీజము భారతామ్నాయ క్షేత్రమునఁ దిక్కనచే నాటఁబడినట్లు కన్పడు చున్నది.

శంభుదాసుని గ్రంథములో సైతము ప్రబంధశబ్దము గాన్పించుచున్నది. అదియుఁగాక, యెఱ్ఱాప్రెగ్గడకుఁ "ప్రబంధ పరమేశ్వరుఁడ"ను బిరుదనామము గలదు. ఇతని నృసింహపురా

1. విరాటపర్వము నందలి 'కీచకవధా' ఘట్టము ప్రధానముగా నొక ప్రబంధ మగును.

ణము పేరునకు పురాణమే కాని సత్యమునకుఁ బ్రబంధ మగును. ప్రబంధోచితమైన పాత్రచిత్రణము నెట్లు తిక్కన సాధించి నాఁడో యెఱ్ఱాప్రెగ్గడ వర్ణనల నట్లు తనరచనములందు మిక్కుట ముగా వెలయించినాఁడని గ్రహింపగల్గుదుము.

ఇవ్విధముగా బ్రబంధ బీజము కవిత్రయ కాలమునాటికే నాటఁబడినట్లు తెనుఁగు సాహితీక్షేత్రజ్ఞులు తెలిసికొనగల్గుదురు. శ్రీనాథుని యుగమునందు పెరిగిపెద్దదై ప్రబంధ వృక్షము పెంపు వహించినది; తరువాత శ్రీకృష్ణదేవరాయల పోషణమునఁ జిగిర్చి శాఖోపశాఖలు వేసి పూతపూచి ఫలవంతమై విలసిల్లి నది!

పూర్వోక్తమగు ప్రబంధశబ్ద నిర్వచనమున కెల్లెడల సరియగు కావ్యము శ్రీనాథుని గ్రంథములలో లేకపోలేదు. అతని శృంగారనైషధము ప్రబంధ మగును. ఇందలి యితి వృత్తము లోకప్రసిద్ధమైనది. దీనికి మాతృక భారతములోని నలదమయంత్యుపాఖ్యానమును గావ్యముగా నిర్మించిన హర్ష కృత నైషధము. స్వకపోలకల్పనలతో శ్రీనాథుఁడు శృంగారనైష ధాంధ్రీకరణము నపూర్వముగా నిర్వహించెను. వస్తూన్మీలనమం దేమి, సంభాషణా చాతుర్యమందేమి, పాత్రనిర్మాణ పోషణాది కార్యములందేమి, వర్ణనాకౌశలమందేమి శ్రీనాథుఁ డప్రతి మాన నైపుణ్యమును బ్రదర్శించినాఁడు కాని, ప్రబంధతారో పణము పూర్తిగాఁ జేయుటకు శృంగారనైషధ మనువాదమగుట తావొసఁగినది గాదు. ప్రబంధములు సర్వదా స్వతంత్రములై యుండవలెను గదా !

శ్రీనాథ రచితేతర గ్రంథములను బరిశీలించినచో హరవిలాసమునందు వస్త్వైక్యము లేకయు, భీమ, కాశీఖండములందలి వస్తువు స్థలపురాణ మగుటయు, సమగ్ర ప్రబంధ లక్షణమునకు నిలువనివిగా నున్నవి. ఇవ్విధముగానే శ్రీనాథ యుగమందలి యితర కవికృత గ్రంథములను గైకొన్నను, కొన్ని యనువాదము లగుటవలనఁ గొన్ని చిత్రాఖ్యానము లగుట వలన, మఱికొన్ని నాటకోచితమైన సంభాషణాదికమే కలిగి యుండుటవలన, నేవియు సమగ్ర ప్రబంధమున కుదాహరణములు కాలేకపోయినవి. ప్రబంధాంగములలోఁ గొన్నికొన్ని యాయా గ్రంథములలోఁ గన్పించుచుండునే కాని సర్వాంగ పరిపూర్ణ స్వరూప సంధానము వీనియెడఁ గన్పింపదు.

ఆంధ్రులు గర్వింపఁదగినకాలము కృష్ణరాయల పరిపాలనా సమయము. దానిని స్వర్ణయుగ మన వచ్చును. రాజకీయములో, సాహిత్యములో నత్యున్నత స్థానము గడించిన యుగము. ప్రబంధ సుందరికి సకలాభరణములు రాయల పోషణమందే లభించినవి. కృష్ణరాయలే స్వయముగా నీ సుందరి నలంకరించినాఁడు. తన యాస్థాన మందలి రసజ్ఞులైన కవిసత్తములచే నలంకరింపించినాఁడు. ఆ సంపూర్ణ కళావిశేషమునుజూచి మురిసిపోయినాఁడు!

శ్రీకృష్ణరాయల పోషణమున సర్వలక్షణ సమన్వితమైన ప్రబంధమూర్తి విలసిల్లినది. అష్టాదశ వర్ణనముల శోభ జెంది, శృంగారరస ప్రధానమై యర్థాతిశాయి యైన శబ్దరచన కలిగి, యాలంకారిక సాంకేతికములకు విధేయమై, యనతి విస్తృతమగు నితివృత్తముతో, భాషాంతరీకరణమునకు భిన్నముగా నుండి,

పాత్ర సంపోషణమును బరిగణించు స్వతంత్ర గ్రంధము ప్రబంధ మని పెద్దల నిర్వచనము.[1] ఈ నిర్వచనమునకు సరితూగు గ్రంథము పెద్దన కృతి మనుచరిత్రము. మనుచరిత్రమే పెద్దన కగ్రతాంబూలము సాహితీలోకమున లభింపఁజేసినది. వస్త్వైక్య మందేమి, వర్ణనములందేమి, యంగాంగీ రస పోషణ మందేమి, సన్నివేశ కల్పనమందేమి, పెద్దనామాత్యుఁడు పెద్దగాక పోలేదు. వరూధిని సాహితీలోకములో స్థిర నివాస మేర్పఱుచుకొన్నది; ప్రశాంతమూర్తి యగు ప్రవరుఁడు పవిత్రస్థానము నలంకరించి నాఁడు. పాత్రచిత్రణములో నల్లసానివాని నల్లిబిల్లి గొను వాఁడితరుఁడు లేఁడనవలసివచ్చును. పాండితిలో నితనిని దలదన్ని నట్లు గన్పించు వసుచరిత్రకారుఁడు సైతము పెద్దన ననుసరించిన వాఁడే గదా! పెద్దన కైతకు మెఱుంగులు దిద్ది సెబాసనిపించు కొనినాఁడు రామరాజభూషణుఁడు! కవులను గిలిగింత పెట్టి కవితాభావములను బ్రదర్శించినాఁడు పెద్దన; పండితులను బట్టి చూచు శబ్దచమత్కృతి సర్వత్ర ప్రయోగించినాఁడు రామరాజ భూషణుఁడు. ప్రబంధము పరాకోటి వసుచరిత్రమందే[2] యందినదని నిశ్చయముగఁ జెప్పవచ్చును. కల్పనా జాతము హెచ్చుగ నుండుటచే కళాపూర్ణోదయము ప్రబంధ మనజాలము. పాండురంగ మహాత్మ్య, కాళహస్తి మాహాత్మ్యములు స్థల పురాణము లగుట సమగ్ర ప్రబంధములు కాజాలవు. అయినను వానిలో నిగమ శర్మోపాఖ్యానము, తిన్నని వృత్తాంతములు ప్రబంధోచిత వస్తుతత్వము గలవి; పాత్ర

1. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి వచనము.

2. వసుచరిత్ర సంస్కృతీకరింపఁబడుట గర్వకారణము.

పోషణమునకు నెక్కు డవకాశములు గలిగియున్నవి. రామాభ్యుదయము, పారిజాతాపహరణమును ప్రబంధములే యగును. పారిజాతాపహరణమునఁ బ్రథమాశ్వాసము ప్రాధాన్యము వహించినట్లు కన్పించును. రామాభ్యుదయము సంస్కృతములో కావ్యప్రక్రియను నడచినది; సుందర ప్రబంధతా యోగ్యత లనేకము లిందున్నవి. ఇవ్విధముగా శ్రీకృష్ణదేవరాయల పోషణమున ప్రబంధసుందరి సర్వాలంకారభూషిత యైనట్లు తెలిసికొంటిమి.

వసుచరిత్రవంటి శిఖరప్రాయమైన ప్రబంధము వెలసిన పిమ్మట, దాని డీకొను కావ్య మింకొకటి యుద్భవింపలేదు. తరువాత వెలసిన ప్రబంధము లన్నియు, మహావృక్షముక్రింద మొలచిన చిన్నచిన్న మొక్కలవలెఁ గాంతి విహీనము లాయెను. వసుచరిత్ర తర్వాత నట్టి ప్రబంధము జన్మింపలేదు. తరువాత వచ్చిన కవుల కిది యాదర్శప్రాయ మైనది. ఆ దినములలోఁ బ్రబంధమార్గమున రచించిననే కావ్యముల కాదరము కలిగెడిది. అందుచే ననుసరణము లనివార్యము లాయెను. ఇట్టి గ్రంథములు కుప్పతిప్పలుగ నున్నవి. గ్రంథ నామములందును దాస్యము తప్పలేదు. కవిజన రంజనము, రసికజన మనోభిరామము, కవిరాజ మనోరంజనము లోకేవిధమగు నామములు గదా!

ఈ యనుసరణములందు పెద్దననుండి వచ్చుచున్న కవిసమయములు, వర్ణనాక్రమము, పద్యముల యెత్తుగడలు, సన్నివేశకల్పనములు, యథాతథముగ దిగుమతి యైనవి.[1]

1. చూ: 'వసుచరిత్ర విమర్శనము: అనుశ్రుతులు'— శ్రీ వఝ్ఝుల పండితులు.

నంది తిమ్మయయ మూర్తికవు లట్లుగాక మూలములను మెఱుఁగు పెట్టిగాని యీ వర్ణనాధికమును దమ గ్రంథములందు జొన్పింపరు. సమర్థులైన కవులు చేయుపద్ధతి యిట్టిది. కాకవు లనుకరణముల తోడనే నామము గడించుటకై కడంగుదురు. ప్రబంధమే చర్వితచర్వణ మైనపుడు, తద్గతవర్ణనలు నట్లైన, విసూత్నానందమును బ్రసాదించుట దుస్సాధ్యమే కదా! కావున నీ యనుసరణలవలన బ్రబంధములందు క్షీణదశ యొకటి వచ్చిన దని చెప్పవలెను. ఆంధ్రసారస్వతములోఁ బదునెనిమిది, పందొమ్మిది శతాబ్దములలో యీ దశ వరలినది.

నాయకరాజుల ప్రాభవమున వెలసిన సారస్వతములో విశిష్టప్రబంధములు లేకపోలేదు. అనంతభూపాలుని కకుత్స్థ విజయము, సవరము చిన నారాయణప్పనాయని కువలయాశ్వ చరిత్రము లెన్నఁదగినవి. వీనిలో సైతము పెద్దన, సూరనల భావరచనల కనుసరణములు ద్యోతిలును. అయినను వీనికిఁ బ్రత్యేకస్థాన మీయవలసియే యున్నది. ముద్దుపళని రచించిన శృంగారప్రబంధమగు రాధికాసాంత్వనము నెన్నక నాయక రాజయుగమునుగూర్చి ముగించుటకు వీలులేదు. శృంగార ప్రబంధములలో నిది మేలుపూస. కాని యోహ్యమగు భావ చిత్రణ మీ గ్రంథమున నుంటయే దీనికి సరసు లిచ్చిన దోషము. ఏతత్కారణముచే నిది క్షీణదశకు నాందివంటి ప్రబంధమైనదిగా భావింతుము.

ఈ కాలమునకుఁ జెందిన ప్రబంధములో నసభ్య శృంగారమే మిక్కుటమై వరలినది. విజయనగర సామ్రాజ్య

మంతరించిన తరువాత దానిక్రింద నున్న సామంతు లందరు స్వతంత్ర ప్రభువులైరి. వీ రహంకారముతో విఱ్ఱవీగి విషయ లాలసతకు లోనై కాలము గడపిరి. వీరి ప్రాపు వడసిన కవులు రాజుల చిత్తవృత్తుల ననుసరించి కావ్యముల వ్రాయవలసి వచ్చినది. ఈ కారణము వలననే పచ్చిశృంగారము నాటి కావ్యములలో వర్ణితమైనది.[1] అట్టి ప్రబంధములు తారాశశాంక విజయము, బిల్హణీయము, హంసవింశతి మొదలైనవి.

క్షీణదశ యని పేరొందినను, ఎన్నదగిన ప్రబంధము లీ కాలమం దుద్భవింపక పోలేదు. కాని వానిని మహోన్నత మైన కృతులుగా నెన్నలేము. ఆంధ్ర సాహిత్యములో వానికిని స్థాన మున్నటులే చెప్పవలెను. అవి విజయవిలాసము, ఉత్తర రామాయణము, మొల్లరామాయణములు. విజయవిలాసమున నాయకుఁ డొకఁడే కాని నాయికలు పల్వురు. ఇందు వస్త్వైక్యము లేనట్లు ద్యోతిలినను ఏకనాయకాశ్రయ మగుటచే నొకింత ప్రబంధచిహ్న మున్నటులే పేర్కొనవచ్చును. ఉత్తర రామా యణములోని వస్తువు ప్రబంధమునకు సుదూరమైనను నందలి రచనములో కంకంటి పాపరాజు ప్రబంధతాబీజముల నాటినాఁడు. పాత్ర చిత్రణములో సన్నివేశ కల్పనములో సంభాషణాది నిర్వహణములో నంతట ప్రబంధమూర్తి ప్రతిబింబించునట్లు రచనము చేసినాఁడు. కథాకథనాత్మక మగు రామాయణము ప్రబంధముగా నవతరింపఁజేసిన వారిలో అయ్యలరాజు రామ భద్రుఁడు, కంకంటి పాపరాజు లగ్రస్థాన మలంకరింతురు.

1. A Hand Book of Telugu Literature (P-52)

కుమ్మరి మొల్ల కవయిత్రులలో నున్నతస్థాన మాక్రమించు నని చెప్పవలెను. చారిత్రిక ప్రబంధ మీ కాలములోనే తల యెత్తినది. కుమార ధూర్జటి వ్రాసిన కృష్ణరాయ విజయము, రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాసవిలాసము లుదాహరణములు.

ఇఁక నాధునిక కాలములోఁ బ్రవర్తిలుచున్న సారస్వత ముందు ప్రబంధ రచన మటనట గోచరించుచునే యున్నది. ప్రబంధమూర్తిపై నేవ జనించుచున్నను, ఒక ప్రక్క ప్రబంధ రచనము సాగుచునే యున్నట్లు గమనింతుము. పింగళి కాటూర్లు వ్రాసిన సౌందరనంద మొక విలక్షణమైన నవీన ప్రబంధము. ఈ నూతన యుగమునఁ బ్రబంధమూర్తి కాక నవ్యాభరణము సేకూర్చినారీ కవులు. చారిత్రిక ప్రబంధము లీ యుగముననే సర్వాంగసుందరముగ వెలయుచున్నవి. దుర్భాక రాజశేఖర శతావధానిగారు రచించిన 'రాణా ప్రతాపసింహ చరిత్ర'యు, గడియారము వెంకటశేషశాస్త్రి కృత 'శివభారతము' నుత్కృష్ట ప్రబంధముల కుదాహరణములు. పాణిని, పతంజలి, కాత్యాయనుల చరిత్రములను, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు 'మునిత్రయ చరిత్ర' మను పేర రసవత్ప్రబంధమును రచించి యాదరజేసినారు. చరిత్ర నింత రసవంతముగాఁ బ్రబంధ ప్రక్రియలో నిమిడ్చి చిత్రించుట ప్రశంసనీయము. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు 'ఆంధ్రుల చరిత్ర' ను గ్రహించి మహాకావ్యము నల్లుటగూడ ప్రశంసార్హము. వీని ప్రాచుర్యము జూచిన నీనాటికిని ప్రబంధ ప్రక్రియకు సహృదయ సానుభూతి యున్నట్లు స్థిరపడుచున్నది.

ప్రబంధ వాఙ్మయము నొక్కమా రవలోకించిన, సంస్కృత వాతావరణమును బాగుగ జీర్ణించుకొనఁబడిన ఆంధ్ర వాఙ్మయములోఁ దిక్కన ప్రబంధబీజమును నాటినట్లును, దానికిఁ బాదుచేసి నీరుపోసినవాఁడు శంభుదా సన్నట్లును, ఎరువుపోసి పెకచినవాడు శ్రీనాథుఁ డన్నట్లును, పూత పూయునట్లు చేసినవాఁడు పెద్దన యన్నట్లును, ప్రబంధ వృక్షము బహుశాఖాయుతమై శోభిలి ఫలవంతమైనది రామ రాజభూషణుని వలన నన్నట్లును గమనింపఁగల్గుదుము. పిమ్మట చిన్నచిన్న మొక్కలు జనించినను నవి తదున్నత వృక్షచ్ఛాయ వాడిపోయినట్లు, కొన్నిమాత్రము గిట్టినట్లును దెలిసికొంటిమి. ఆంధ్రులు కవితారచనములో నింతవఱకుఁ బ్రత్యేకించి సాధించిన కావ్యప్రక్రియలలో 'ప్రబంధము'న సిద్ధహస్తులైరనుటలో సందేహము లేదు.[1] ఇది గర్వసూచకముగదా!

1. శ్రీ కాకర్ల వేంకట రామ నరసింహము గారు 'ప్రబంధముఁను గూర్చి ప్రత్యేక కృషి సల్పియుండుట గమనింపఁదగినది.

# ఆంధ్రవచన స్వరూపము

## సూత్రగ్రథనము

## మొదటిభాగము

కావ్యముయొక్క స్వరూప, జాతీయయోజనలఁ జేసినపు డనేక ప్రమాణములఁబట్టి యనేక భేదములను (types) బాశ్చాత్యులును, మన యాలంకారికులును నిర్ణయించినారు. ఆ ప్రమాణములలోఁ ఛందస్థితిఁ గావ్యములోఁ గర్తృసంబంధము, వస్తుతత్త్వములు ముఖ్యములు. ఇందాది ప్రమాణమగు ఛందస్స్థితి ననుసరించి-కావ్యము త్రివిధములుగా విభజించినారు; గద్యాత్మకమనియు, పద్యాత్మకమనియు నుభయాత్మకమనియు నివి చెలఁగుచున్నవి.

ఇఁకఁ బద్యమునకును[1] గద్యమునకు నున్న భేదము నరయుదము. ఇవి రెండును గావ్యశబ్దవాచ్యములే. ప్రాచీనాలంకారికులు నిర్వచించిన కావ్యత్వ మీ రెంటఁ బ్రవర్తిల్లును. అయిన భేద మెచట? పద్య మావేశపూరితమై, యుదాత్తవిషయాన్వితమై, వ్యంగ్యమర్యాదాశ్రయియై, రసపరిధానమై వఱలుచుండును. గద్య మట్లుగాక, వస్తుస్వరూపయాథార్థ్యము గలిగి, స్వభావోక్తి ప్రధాన నియమముగా గలిగి, యన్వయ సౌలభ్య సహితముగా నపేక్షమాత్రముననే చెప్పు పరిశ్రుతాను

1. ఇట గద్య మనఁగా వచన (Prose) మని వాడుక.

సారిగాను భాసిల్లును. ఈ భేదమునే వివరించుచు 'ఆర్నాల్డ్'
"The rhythm and measure of poetry elevated to a regularity, certainity, and force very different from rhythm and measure, which can pervade prose, is a part of its perfection." అని వచించెను.

గద్యము పద్యము కంటె భిన్నమైనది; అది బాహ్యముగాను యంత్రివత్తుగా నుండునది. పద్య మట్లుగాక హృద్గతభావమును నియమబద్ధముగా, లయాన్వితముగా (Ryhthmical) నుంచునది. గద్యము దీనికి భిన్నమై, ఛందోనియమములు లేక, విరామాదులు లేక, యనేకగతుల నడుచును. ఈ రెండింటికి భూజలధుల కున్న భేదమున్నది. అనఁగా నొకటి ద్రవరూపము గలిగి చలనశక్తి కలిగినది; రెండవది ఘనీభూతమై స్థిరత్వమును బొందునది. గద్యపద్య భేదము కేవలము భౌతిక విభేదమే కాని వేఱుగాదు. అనఁగా, మనము పర్యాలోచించునవి మానసిక సంబంధ విషయములు గనుక, నీ భేదము మానసికతత్త్వ సంబంధమైన భేదముగా నున్నది. చిత్త ప్రవృత్తి ననుసరించు నొక ప్రక్రియ పద్యము. వేఱొక ప్రక్రియ గద్యము. పద్యము సృష్టిస్వరూప పరిణామము. గద్యము నిర్మాణస్వరూప పరిణామము. సృష్టి యనఁగాఁ బ్రతిభాసమన్వితమైనది. భావావేశములోఁ బదములు పుట్టుచుండును. పదములకు నిర్దేశింపఁబడిన యర్థములు గాక, ఛాయాభేదములతో నవి నూత్న పదములగుచుండును. భావమునకును, బదమునకును మధ్య నెట్టి విరామము నుండదు. భావమే పదమగును; పదమే భావమును సూచించును. ఇట్టి యవినాభావ సంబంధ మీ పద్యరచనలో భావపదములకు వర్తించును.

వచన రచనములో పదము లన్నియు యథాతథములుగా నిలిచియుండును. వాని కున్న యర్థములోనే యవి వర్తిలును. నిర్మాణకార్యమునకుఁ గడంగి నపు డుపకరణము లన్నియు సిద్ధముగా నున్నట్లు, పదము లన్నియు యంత్రవత్తుగా సకాలమున కవి తమ స్థలముల నాక్రమించుచుండును. వచన సృష్టి కార్య మొక ప్రణాళిక ననుగమించునది. దాని కొక క్రమ (logic) మున్నట్లు స్పష్టము.

పద్యమందు భావోద్రేకమున కనుగుణముగా బదములు భాసిల్లును గాని యొక నియమముగా నుండవు. కావున వచనములో నిట్టి భావావేశమున కనుగుణముగా వచ్చు పదములు దొరలినచోట నా వచనము వచనముగాక, కవిత్వమే యగును. కార్లైలు వచించిన—'Poetry is musical thought' అను వచనానుసారిగా రసభావమును పొందు శబ్దార్థస్వరూపమును ప్రదర్శించునట్టిదైన నది కావ్యమే యగును. విశ్వనాథకవిరాజు—'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనిన వచనముగూడఁ దత్తుల్యమైనది. వచనరచనములో శబ్దస్వరూపము నెఱిఁగి, దాని శక్తి (force) లేక వ్యాప్తిని దెలిసి, యథాస్థానములో, సముచితమైన సందర్భములోఁ బొదగవలెను. వచన రచనమునకు శబ్దార్థస్వరూపజ్ఞాన మావశ్యకము. రచయితకు శబ్దాధికారము లేనిదే వచనరచనము రాణింపదు.

పద్య మెట్లు భావప్రధానము గలదియో, గద్యమ ట్లర్థప్రధానము గలది.

పద్యము సయితము గద్యముయొక్క లక్షణము కలిగి యుండవచ్చును. అట్లే గద్యపద్యలక్షణములను (ఒక గణబద్ధత యందుగాక) గ్రహింపనగును. ఇట్టి ప్రక్రియా విశేష ద్వయములో నాద్యంబగు పద్యము లనేకములు గలవు. అట్టి పద్యములు నామమాత్రములే కాని వేఱుగావు. ఉదాహరణమునకు-

ధర్మనిధియైన మీతండ్రి దశరథావ
నీశుఁ డొకనాడు నిజపురోహితునిఁ జూడఁ
దలఁచి రథమెక్కి సూతకృత్యంబు నేను
బూనఁగ వశిష్ఠముని వనంబునకుఁబోయి. (ఉ. రా.)

ఇట్టివి యనేకములు గానగును.

కవితావస్తువు లేక రసభావము లేకయే రచింపఁబడిన ఛందోనువర్తియైన రచనము కవిత్వ మనిపించుకొనక, యాత్మలేని శరీరమువలె నుండును. కాఁబట్టి కవితయనునది భావమందున్నది గాని, రచనములో లేదని చెప్పవచ్చును. పద్యమందలి గణ నియమము శబ్దాలంకారము వంటిది. గద్య మం దట్టి లోపమును బోనాడుటకై దానిని శబ్దాలంకార సహితముగను సమాస గుంఫితముగను రచించినట్లు కన్పించుచున్నది. వృత్తఘటితములు, పద్యనిర్మితములే కావ్యములుగాఁ బరిగణించినచో స్మృతులు, వైద్యగ్రంథములుగూడ మహాకావ్యములు కావలెను. కావుననే "గద్యం నికషం కవీనాం వదంతి" అని ప్రాచీనులు నిశ్చయించిరి. గణనియమము లేని లోపమును బోనాడుటకై రచించినదే - 'ఓజస్సమాస భూయస్త్వ మేత ద్గద్యస్య జీవితమ్' అను వాక్యము. ఈ లక్షణము ననుసరించిన గద్య

కావ్యములు సంస్కృతమున నున్నవి. పద్యరచనములో నున్నది యీ కవితా భావమున కొకతోడవు సమర్చుటయే.

"Verse is apparelled only being
but on ornament"—*Sir Philip Sidney.*

కావ్యసృష్టికి ననుభూతి ప్రధానము. కవి తాను జూచిన వస్తువులోని సౌందర్యాదికములఁ ననుభవించి, తిరిగి వ్యక్తీకరించును. ఈ వాక్కే 'రసభావము' తనంత తాల్చెడి శబ్దార్థ స్వరూపము. ప్రాక్తన మానవుఁడు ప్రకృతి సౌందర్యమునకు ముగ్ధుఁడై గంతులువేసి, పదము పాడెనని గ్రహింపఁగల్గుదుము. వాల్మీకిశోకము శ్లోకరూపమునే ధరించినది; కాని పద్యరూపము గాదు, కావున నానందానుభూతిఁ బొందినపుడు లయాన్విత మైన గీతియే వెలువడును. ఇందలి సూక్ష్మధర్మమేమనఁ గీతి హృదయజన్యము. గద్యము బుద్ధి (Reason) జన్యము. హృదయద్రవీకరణము కళవలన గల్గును; బుద్ధినైశిత్యము శాస్త్రమువలనఁ బొడమును. పైఁ బ్రక్రమముఁబట్టి, బుద్ధి కంటె పూర్వము హృదయవికసనము సహజముగాన, గీతియే ముందు పొడసూపునది.

It is a sort of common place of literary history that verse is always older than prose, and in the case of most literatures—especially modern ones—it is almost demonstrably so—*Saintsbury.*

సారస్వతము వివిధశాఖా విరాజితము. ప్రతిశాఖయుఁ బరిపూర్ణతఁజెందినఁగాని సారస్వతముయొక్క సమగ్రస్వరూపము ద్యోతకముకాదు. అభివృద్ధి యనునది యేకదేశమైనను, క్రమాగతముగ లేకపోయినను రుచింపదు. అందుచేనే విభాగమైనను

స్వయంపూర్ణమై, క్రమాభివృద్ధిని పొంది, సమగ్ర సారస్వతము నకు సోపానభూతమై వెలువడెను. గద్యపద్యము లను ప్రక్రియాద్వయములో గద్యమునకు చాల దినములవఱకు ప్రచా రము కలుగలేదు. అందుచే వచనరచన మెక్కుడుగా సేవిష యమున కుపస్కారకము కాలేకపోయెను. వచనము విషయ బోధనానువర్తి. ఇం దలంకారములకుఁ బ్రాధాన్యముండఁజాలదు. ఉద్దిష్ట విషయము నిక్కముగను స్పష్టముగను సూటిగాఁ జెప్పు టకు వచనరచయిత ప్రయత్నించును. ఈ రచనములో వాచ్యార్థమే ప్రధానము. లక్ష్య వ్యంగ్యార్థము లప్రధాన ములు. లక్ష్య వ్యంగ్యార్థములు వచ్చినచో నది గద్యములో నున్న కవిత్వ మనిపించుకొనునేమోకాని, కేవల వచన మగు టకు వీలు లేదు. అట్లే విషయస్వరూపబోధకమై సదృశవస్తువుల నెన్నినపు డట్టివి యలంకారము లనిపించుకొన్నను, అలంకార బాహుళ్యముండదని మాత్రము చెప్పవలెను. శబ్దచిత్రములు-అర్థచిత్రములు శైలీభేదములలో వచనమందు కన్పించినను, కేవల వచనస్వరూప మది కాదని ప్రాజ్ఞులు తెలిసికొందురు. అనుస్యూతముగా వచ్చు భావములను యథాతథముగా గ్రహించి కాపాడునది వచనము.

వచనము సారస్వతమున ముఖ్యమైన శాఖ. భావమును నిగూఢము గావించి తికమకలఁ బెట్టుటకును, చెప్పదలఁచిన భావము నా పదజాలములో నా ఛందో విరామములోఁ జెప్పలేకుండుటకును పద్యమున్నది. వచనరచనములో స్వేచ్ఛగలదు; రచయిత తన భావమును విస్తరించి బోధింపనగును; కేవల విషయ ప్రధానమైన రచనము వచనమే.

వచన మెక్కుడుగా శాస్త్రరచనములం దుపయోగ పడును. మానవజీవితమును సరిగాఁ దెలియవలె ననినగాని, తెలుపవలె ననినగాని వచనమే చక్కని వాహిక. ఈ భావ ములకే పూఁతపూసి కావ్యకర్తల పద్యములద్వారా వానిని కళ యను రసాయనముగాఁ దయారు చేయుదు. శాస్త్రకళల కున్న విభేదమే గద్యపద్యముల కున్నట్లు గ్రహింపనగును.

"When life is the criterion and not art, the prose of a nation is far more important than its poetry" —*Evans.*

చరిత్రలందు గాని, తత్త్వవిషయిక మీమాంసలందు గాని గద్యమే యుపాదేయము గాని పద్యము రాణింపదు. కావున వచనరచన తత్త్వవేత్తలకుఁ జరిత్రకారులకు నుప యోగపడును గాని కవుల కంతగా నుపయోగకారి కాదు. పద్యస్వభావ లక్షణములఁ జొన్పి, గద్యమును కవులు తమ నవలలయందు, వ్యాసములందు, నాటకములందు వినియోగించు కొననగును. అచ్చటచ్చట ననేక కావ్యభేదములలో నుప యోగింపఁబడుచు వచ్చిన వచనమును బర్యాలోచించుట క్లిష్టమే.

In literature prose embraces all forms of oratary and of representative discourse and the prose drama. —New Standard Dictionary.

ఇంకు ప్రతిపాదితమైన సంప్రదాయ మాంధ్ర వాఙ్మయ ములో నతి ప్రాచీనమైనదిగా గ్రహింపఁగల్గుదుము.

ఆంధ్ర సారస్వతము నవలోకించుటకుఁ బూర్వము ముఖ్యముగా రెండు భాగములుగాఁ గాలమును విభజించుట యవసరము. ఆంధ్రమునకు సంస్కృత భాషవలన వచ్చిన ప్రాబల్యము, ఆంధ్రమున కాంగ్లభాషా ప్రాబల్యము. ఇట్టి విభాగమువలన నే విషయమునైనఁ జక్కగా సమన్వయించుట వీలగును.

పదునెనిమిదవ శతాబ్ది తుదివఱకు సంస్కృతభాషా ప్రాబల్య మాంధ్రమున నింతింతని చెప్పరాదు. సంస్కృతా నుసరణము, అనుకరణము, అనువాదములే తప్ప ప్రత్యేక ప్రతిభను జాటు సమగ్ర ప్రక్రియ యొకటియైనను ఆంధ్రమున నవతరింపలేదు. ఒకింత యత్నము జరిగినదనిన 'ప్రబంధము' పట్ల నేమేని జరిగియుండును. అంతియే. అచటను మాతృకలు సంస్కృతము లోనివే. ఇట్లు సంస్కృతములోని ఛందశ్శాస్త్రము కావ్యములు, వైదికవాఙ్మయము — ఇవి యననేల — ఆంధ్రము లోనికి యథాతథములుగా నవతరించినవి. కావ్య భేదము లన్నియు సంస్కృతమునుండి తెలుగులోనికి దిగుమతి యైనవి. కావున సంస్కృత సంప్రదాయములు (భాషా శాస్త్రములు) తెలియని మానవునికిఁ దెలుఁగు సారస్వతము దరిఁజేరుట కధికారము లేకుండినది. రానురాను, ఆ పరిభాష, సంప్రదాయ ములు కేవల మాంధ్రభాషకుఁ జెందినవను భ్రాంతికూడ గలుగు చున్నది. ఇవ్విధముగా నాంధ్రభాషపై సంస్కృతభాషయొక్క ప్రభావము వరలినది.

ఇప్పటికి రెండు శతాబ్దముల నుండి మన భాషపై నాంగ్ల భాషాచ్ఛాయలు, సంప్రదాయములు పడుట మొదలిడినవి.

సంస్కృతము మన భాషపై నెట్టి యధికారము మున్న పూనెనో యట్టి యాధికారమునే యాంగ్లభాష వహించినది. క్రమక్రమముగా నాంగ్ల సారస్వతములోని గ్రంథము లవతరించుటకన్న, ఆ భాషలోని విధానమును, ఆ సారస్వతములోని వెలుఁగు జిలుఁగులు నెక్కుడుగా నాంధ్రమున కవతరింపఁజేయఁబడినవి. ఇట్లవతరింపఁబడిన ప్రక్రియలలో నవల ప్రథమగణ్యము. తరువాత ఉపన్యాసము, కథానిక, విమర్శనము, జీవితచరిత్ర మున్నగునవి తెలుఁగుభాషలో నవతరించినవి. వచన స్వరూప మొకవిధముగాఁ జోటుచేసికొనిన దనిన నది పందొమ్మిదవ శతాబ్దమందే యని చెప్పవచ్చును.

ఇవ్విధముగా సంస్కృతాంగ్ల సారస్వతముల ప్రభావము నవగతముఁ జేసికొని, తెలుఁగు రచనలలోని వచన స్వరూపము నారయుట సమంజసము.

అంతకుఁ బూర్వము కావ్యములు గానరాకుండుటచే నజ్ఞాతయుగము నాఁటి గద్య సంప్రదాయము దెలియవలెనన్న మనకు శాసనములే యాధారభూతములు. నన్నయకుఁ బూర్వము వరలుచున్న తెలుఁగు శాసనములనుఁ బరిశీలించినచో నవి యన్నియు సంస్కృత శాసనములవలెనే రచింపఁబడినట్లు కానవచ్చును. ఈ శాసనములలోఁ గ్వాచిత్కముగాఁ దెలుఁగు వాడఁబడియున్నది.[1] దాన మొసఁగఁ బడిన భూమియొక్క యెల్లలఁ జేర్కొను సమయమునఁ దెలుఁగుపదము లుపయోగింపఁబడినవి. మిగిలిన భాగ మంతయు సంస్కృత పదభూయిష్ఠము,

1. వానిలో ఎక్కడ ఏ తెలుఁగుపద మయినను కనబడుట సంభవించిన యెడల మనకుఁ బెన్నిధి దొరకినట్లే. —మల్లంపల్లి, ఆంధ్ర ఉగాది

దీర్ఘ సమాస సంభరితము, శబ్దాలంకార పూరితమునై సంస్కృత శాసనముల కెవ్విధమునను దీసిపోనక వర్తిలుచున్నది; సంస్కృత వర్ణక్రమము పొడముచున్నది: [1]

ఉదా:...... (వి) జయాది (త్యపాదప) (ద్మ) (భమ రాయమాన శ్రీమత్కుజెయరాజు గుణగణాభరణుణ్డు (ద) న కాని ఈస్వ (శ్వ) రున (కుం) గార్తికేయుండుబోలె చొపష్టి కల (లా) విసా (శా) రదు (ణ్డు) వణ్ణారంగులు అయ్యుమ పెగ్గడ లుంగర (న) మ్మున వణ్ణారంగును ఈధమ్మని (వ్వ) (హ) నోద్యోగమ్మున (కు) బృహస్పతి సమానులయ్న పెగ్గడకా (?డెయు) గారి (కొడు) కు (బె) జెయరాజు సమ (ర్థు) ణ్డని ఆత్మాన్నతంబునం బన్చిన ప్రసా (దం) బని సమస్త రా(జ్యభా) ర నిరూపిత మహామంత్రాధిపతి (మ) (హే) శ్వర పక్షపాతి దేవబ్రాహ్మణగురు (భ) క్తిపరుణ్డు స(శ) క్తి (త్రయ) సంప న్నుండు మయు బెజయరాజు బెజయేశ్వరంబుగల స (శ) నివ్వ (హ) నంబు సేసి దిన (శ) గుడ్లుం బ్రాకారంబు మటం బును నెమియించి.

(రెండవప్రక్క)

........(బునా్వ)........వచ్చినవ (వారు) .......... దంబు (సల్పి) నవ (వా)రుది........(ం) బుగద్యంబుల నలన (శ్వా) స్వ (శ్వ) తంబు.........(యను) ఇ (ఈ) భూమిలోన.

ధర్మవరము శాసనము—(మూడవ విజయాదిత్యుని నాటి శాసనము)

తెలుఁగు కవితావతరణ మెట్లు సంస్కృతానువర్తియై వరలినదో, యట్లే తెలుఁగు శాసనములపట్లను సంస్కృత

1. ముండమాల ప్రగామే; పెఱపమడ్లుల్ళ్ళ.

చ్ఛాయపడుట తప్పలేదు. కావున శాసనములందు లభించు తెలుఁగు గద్యభాగములు నామమాత్రకములే కాని, స్వచ్ఛందమైన తెలుఁగు రచనము యొక్క స్వరూపమును బ్రదర్శించునని కావని సిద్ధాంతీకరింపవచ్చును.[1]

ఇఁక నాంధ్ర సారస్వతములో నాదికవి యగు నన్నయ రచనను జూచినచో నందు సంస్కృత పదబాహుళ్య సమాససంఘటనములు గాన్పించును. ఆతని భారతము చంపూకావ్యముగా బయలుదేరినది. ఇచట చంపూకావ్యమున గద్యపద్యములకు సమానస్థాన మీయఁబడినది. కనుక పద్యముతోఁ గూడి యెడమగా నడిచిన యీ గద్యమంతయుఁ గవితాపదార్థ భూయిష్ఠమే కాని నీరసము గానేరదు. కావున తెనుఁగు వచనము మొదటినుండియే పద్యములో సరిగా సాగివచ్చుననే యున్నదని తెలియుచున్నది;

నన్నయ నాఁటి నుండియే 'గద్య' యను పదమున కొక విలక్షణార్థము మన కున్నట్లు తెలియును. గద్యము వచనము నకుఁ బర్యాయపదముగాఁ బ్రయుక్త మగుచున్నది. కాని 'గద్య' యను ప్రత్యేక ప్రక్రియ మన కొకటి నిర్దిష్టాకారముతో నున్నట్లు గమనింపఁగలుగుదుము. కావ్యములలోఁ బ్రతి యాశ్వాసాంతమున 'గద్య' పొడగట్టును. దీని ప్రయోజనము లేవి

1. 'రెండో మూఁడో పద్యములుగల శాసనములుతప్ప నన్నయకుఁ బూర్వకాలపు తెలుఁగుభాష స్వరూపమును దెలియఁజేయు సాధారములు గానరాకున్నవి.' —డాక్టరు చిలుకూరి నారాయణ రావు.

యనఁగా, నా కావ్యకర్తృవంశ గురు నామాదికములను, కావ్యమం దా యాశ్వాసములలోఁ బ్రతిపాదితమైన విషయము లను వెలిబుచ్చుటయే. అనఁగా నేటి కావ్యములలో 'విషయ సూచిక' లను శీర్షిక క్రింద వచ్చు వస్తువు. గ్రంథోపరిభాగమున నచ్చిడఁబడునట్టి కావ్యకర్తృనామాదికము లీగద్యములు ప్రాచీన కాలములోఁ జివర నిర్వర్తించెడి వస్తుమాట. కావున వీని యందుఁ గవితాభావ ముండుటకు వీలులేదు. విషయబోధనమే ప్రధానోద్దేశము. అందువలన నీ గద్యమందుఁ గవిత్వ ముండక పోఁగా, కేవల వచనముయొక్క స్వరూపము కించి ద్వ్యక్త మగును కాని, యీ గద్యములు కేవల వచనములు కానేరవు. గద్యభాగము సమాసభూయిష్ఠమై, యనుప్రాసాలంకారయుక్తమై పద్యములో నుండు శ్రుతికి దీటైన లయ కలిగి విరాజిల్లు చుండును. ఈ శబ్దాలంకార, సమాస, శ్రుతి, లయలు గద్య పరిణామములోఁ బొందిన నూత్నావకాశములు. కావున నివి యన్నియుఁ బ్రతి గద్యలోను గానరావు; కొన్ని కొన్ని యన్నిట మిన్నయై చెన్నొందుచుండును.

గద్యము విషయసూచికగా వర్తించు నట్లీ క్రింది నన్నయ గద్య చూడుడు :—

"ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబయిన శ్రీ మహా భారతంబునందు సభాపర్వంబున ధర్మరాజునకు సభా ప్రాప్తియుఁ, గింకర దర్శనంబును, నారదు వలన లోకపాలుర సభా శ్రవణంబును, రాజసూయ మహాధ్వరారంభంబును,

జరాసంధ వధయు, గిరివ్రజ నిరుద్ధులయిన రాజులం గృష్ణుండు విడిపించుటయు, రాజసూయంబు నన్నది ప్రథమాశ్వాసము.

— సభా పర్వము

ఇట్టి గద్యలు ముఖ్యములుగాఁ బురాణములం దుండుట సహజము. మార్కండేయ పురాణము, కుమారకుమార విజయము, భాగవతము మున్నగు కథాకథనపద్ధతి (Narrative) గల గ్రంథము లిందుల కుదాహరణము లగును.

ఇఁక వంశ నామాదికముల వచించుటలో శబ్దాలంకార ములు గలవి కొన్ని గద్యలు చూడుడు :—

"శ్రీ మదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధా రాధన విధేయ తిక్కన నామధేయ ప్రణీతం బయిన........."

"శ్రీ కమలనాభ పౌత్ర మారయామాత్య పుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతం బైన ... ......"

'సకల గుణసనాథ సోమనాథ ప్రణీతం బైన....'

'శ్రీమదఖిల కవిమిత్ర పెదయన్నయామాత్య పుత్ర శారదా దయావిధేయ జక్కన నామధేయ...'

ఇట్లే చాలమంది కవులు తమ గద్యలను రచించిరి.

కవులాశ్వాసాంతగద్యములలో తమ యిష్టదేవతా సూచనమును జేయుచుందురు. ఇందులకుఁ గొన్ని—

'శ్రీమత్కాళహస్తీశ్వర చరణ కమల సేవాపరాయణ సింగమ రమానారాయణ జక్కయనారాయణ తనూభవ పరాఙ్ముఖ ధూర్జటి ...'

'శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ....'

ఇట్లే రామరాజభూషణుఁడు, కూచిమంచి తిమ్మకవి మున్నగు కవు లనేకులు తమ యుపాస్యదేవతలఁగూర్చి గద్యమం దుల్లేఖించిరి. ఈ గద్యభాగములవలనఁ గవి జీవితమునుగూర్చి యిసుమంత చరిత్ర తెలియుట యుపయోగము. ఈ గద్య రచయిత కొన్నియెడల కావ్యకర్తయే కావచ్చును. కొన్ని పట్ల నా కావ్యముయొక్క ప్రతులను వ్రాసికొనిన వారే వ్రాసి యుండవచ్చును. ఈ రెండవయంశమును స్థిరీకరించుట కాయా వ్రాఁతప్రతులం దాశ్వాసాంతగద్యలలో విలేఖకుల నామాదిక ములుగూడఁ గన్పట్టుచున్నవి. ఇట్లే 'గద్యము' అను ప్రక్రియ ప్రతి గ్రంథమందును బాడగట్టి మన సారస్వతములోఁ బ్రత్యేక స్థానమును గడించినది. ఈ గద్యస్వరూపము కేవల వచనమున కును, కేవల పద్యమునకును మధ్యస్థితి నాక్రమించుచున్నది. వీనిలోఁ గొన్ని గద్యలం బాడుదురు. ఆ చదువు పద్ధతియే భిన్నము. తెలుఁగు సారస్వతపు తొలిదినములకే 'రుద్రగద్య' మొదలైనవి యున్నవి. వీనిలో లయ (Rythm) ఉన్నదనియే తలంపవలెను.[1]

మన సారస్వతములో 'దండకము' లనునవి కన్పించు చున్నవి. ఏ విధముగా కవితాభావములేని పద్యము వచనముగా

1. "కావ్యము లనిపించుకొనిన వచనములు గద్యములు. కావ్యేతర వచన ములు వచనములే!" —శ్రీ పింగళి లక్ష్మీకాంతం.

ముందు కాంచితిమో, యట్లే 'దండకము' వచనముగా భాసించి నను లయ (Rythm) కలది గనుక పద్యతుల్య మగు చున్నది. ఈ దండకములు నమస్కార గద్యలకుఁ దుల్యములు. నన్నయ తరువాత పాల్కురికి సోమనాథుని కాలముననే గద్య ప్రబంధ ములు విరివిగా నుండి సంస్కృత పద బాహుళ్యమువలన జన సామాన్యమునకు రుచింపకపోయినట్లు పండితారాధ్య చరిత్రలో—

'ఆరూఢగద్య పద్యాది ప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠరచనమానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుంగు విశేషము ప్రసన్నతకు....'

మఱియు బసవపురాణములో—

'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె, సరసమై పరగిన జాను తెనుంగు చర్చింపగా సర్వసామాన్యమగుట.'

అనెడి యుదాహరణములనుండి తెలియవచ్చును. ఇటఁ జెప్పిన గద్య గ్రంథము లేమాయెనో మృగ్యముగా నున్నవి. లేక, 'గద్య పద్యోక్తి' అనియు, 'గద్యపద్య ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచన' అనియుఁ జెప్పోన్నపుడు గద్య పద్యములచేఁ జెన్నొందు చంపు వనియేమో యుద్దేశము!

స్థూలముగాఁ దెలుఁగు సారస్వతముం జూచినచో రెండుగా నది విభాగింపఁబడినట్లు తెలిపితిమి. సంస్కృత ప్రభావము భాసించిన నాఁటి నుండి వరలిన సాహిత్యమును రెండు శీర్షికల క్రింద విభాగింప వచ్చును; మొదటిది పురాణరచనము

(The Narrative) రెండవది—ప్రబంధ రచనము (The Descriptive) ఈ రెండు ప్రక్రియలలో నొకే కథ, రచనా శక్తిచే, నవకాశానుగుణముగ ద్వైవిధ్యమును బొందఁగల్గును. ఇందులకుఁ బురాణస్థ గాథలఁ బ్రబంధ వస్తువుగా స్వీకరించి, నిర్వహింపఁబడిన ప్రబంధములఁ గాంచినఁ దెలియును.

ఇఁక పురాణ ప్రబంధ వచనములను బరిశీలింపవలయును. అపుడు వచన మార్గమున నభివృద్ధి పొందెనో, లేదో తెలియవచ్చును.

పురాణములోను, ప్రబంధములోను గన్పించు వచనము భిన్నస్వరూపమును బొందినది. పురాణవచనము పద్యముల మధ్య నెడనెడ గన్పట్టును. ఈ వచనము కేవలము రెండు పద్యముల నడుమగాని, రెండు సన్నివేశములకు సంబంధ వాక్యముగా గాని వినియోగపడును. ఒక్కొక్కయెడ నిరువుర సంభాషణము పద్యములలోఁ జిత్రించిన, నాయా పాత్రలను సూచించుటకై వచన ముపయుక్తమైనది. ఇట్టి విధానముతో వచనము పురాణములోను, ప్రబంధమందును విరివిగాఁ గన్పించుచున్నది. పురాణవచనము పురాణపద్యమువలెనే సుబోధకము (ఆఖ్యానాత్మకము) అల్పపద్య వాక్యమయము. అయ్యది నిరాడంబరముగను, నాతి దీర్ఘముగను, విషయప్రధానముగను, కథాగమన వేగముతోడను నడచుచుండును. కాని ప్రబంధములలో వచనమున కొక ప్రత్యేకత యున్నది. ప్రబంధవచనము దీర్ఘముగను, ఆలంకారికముగను, వర్ణనాత్మకముగను, సమాస గుంఫిత పణితి తోడను, పద్యమునందువలె శబ్దాలంకారముల

తోడను విజృంభించియుండును. కాని, భాగవతము మాత్ర మిట్ల సరితూగదు ; పురాణవచనమువలె భాసిలక, ప్రబంధరీతి ననుసరించినది. ప్రబంధ వచనములో కథావేగమునకై త్వర పడుటలేదు. మీదు మిక్కిలి కథాస్రవంతి యీ వచనమను పర్వతమునొద్ద నొక్కమ్మడి యాగి, తదుపరి యీ వచన పర్వతము నధిగమించి చనుచుండును. కథలోని సన్నివేశముల నెక్కుడుగా వర్ణించుటయే ప్రబంధకవిత్వ లక్ష్యము. కనుక, కథావేగమున కాతని పద్యరచనముగాని పూనుకొనదు. సన్నివేశ (incident) ప్రస్తారమే కవి యుద్దేశ్యము. ఇట్టి ప్రబంధ వచనములలో నెక్కుడు స్వభావోక్తి యొప్పును.

ఈ విధముగాఁ బద్యమునకు భిన్నమైన వచనరచనము మనకుఁ దొలుదొలుత శాసనములం దంకురించి, తరువాత చంపుకావ్యమైన భారతములోఁ బద్యముతో నెడనెడ నడచుచు వచ్చుచు కావ్యాంతములందు విలక్షణముగా 'గద్య' లను పేరఁ బరగుచుఁ గావ్యము లనిపించుకొను గద్యలలోఁ బొడసూపుచు, ప్రబంధ యుగమునాఁటికి నలంకారముల గ్రహించి విశిష్టరూప మును బొందినట్లు తెలియుచున్నది. ఎట్లైనను ప్రబంధయుగము తర్వాతనే వచనప్రయోగము సంపూర్ణముగా గుర్తింపఁబడినట్లు నమ్మవలసియున్నది. ఆంగ్లవిద్యా ప్రభావము కారణముగా గత రెండు శతాబ్దములనుండి వచనరచనమునకు సర్వోపభోగ్య మగుచున్నట్లు గమనింతుము. ఈ క్రమపరిణామము నోపికతో ముందు గమనింతముగాత !

# ఆంధ్ర వచన స్వరూపము

## అన్వయము

### రెండవ భాగము

నన్నయభట్టుగాని, తిక్కన యెఱ్ఱనార్యులుగాని వచనమును కథాకథనపద్ధతికి నగుగుణమై గౌణమైన వాహిక (medium) గా స్వీకరించినట్లు ద్యోతితలును. ఇఁక వారి రచనములో మాత్రము భేదము వర్తించుచున్నది. ఇది వారి వారి యాత్మీయత (Personality)లం బురస్కరించుకొనివచ్చిన శైలీవైవిధ్య విన్యాసవిలసనమే. భారతరచనములో నన్నయ యే విధమైన యాఖ్యానాత్మక శైలిం బ్రదర్శించెనో, తిక్కన యెట్టి నాటకీయశైలిని నడిపించెనో, యెఱ్ఱన యేవిధమైన వర్ణనాత్మక శైలిని పుణికిపుచ్చుకొనెనో, యట్టి శైలీవైవిధ్య మా కవుల వచన రచనములందును దగుమాత్రముగఁ గన్పించుచునే యున్నది. అనఁగా నన్నయ వచనమునకుఁ గథాకథనశక్తి యున్నట్లు, తిక్కయజ్వ వచనమునకు సంభాషణాశక్తియున్నట్లు ఎఱ్ఱనామాత్యుని వచనమునకు వర్ణనాశక్తి యున్నట్లు మొట్ట మొదట చూచిన ద్రష్టలు ఈ విధముగా వచనము త్రిముఖ ముగాఁ దిరుగఁగలదని తీర్చిదిద్దిన వారా కవిత్రయమువారే. కాని ముఖ్యముగా వచనములకు వారి రచనలలోఁ బ్రాముఖ్యము లేదనుటకు వీలులేదు. వచనగ్రంథము లానాఁటికే యున్నట్లు శైవకవుల పొత్తములలో హత్తింపఁబడియున్నది. ఆ తర్వాత వచ్చిన తిక్క నామాత్యునకుఁ దన యుత్తరరామాయణమును

రచించు తలఁపు పుట్టినపుడు వచనరహితముగా రచనము సాగింప వలెనను దీక్షవహించుటనుబట్టి యీనాఁటి వచనస్వరూపము ద్యోతిలఁగలదు. నాఁటి దీర్ఘవచనములను సాగించుట యెఱ్ఱనా మాత్యుఁడు తీసిన దారియే. ప్రబంధోచిత వర్ణనలను నృసింహ పురాణ హరివంశములందు విలోకించినవాఁ డాతఁడే. వచన ములో భావవ్యక్తీకరణశక్తియున్నట్లు నన్నయ వచనములలోఁ దెలియును; సంభాషణాచాతురి వచనరచనములో నున్నట్లు తిక్కన పరిశీలించెను; భావప్రస్తారమునకుగాని, భావవ్యాఖ్యా నమునకుగాని వచన ముపయుక్తమగునని శంభుదాసుఁడు కని పెట్టెను. ఇవ్విధముగా కవిత్రయ వచనరచనము మూఁడు చిన్నెలు పొంది చెలువారుచున్నది.

కవిత్రయమువారి ననుగమించిన కవులలో ననేకులు వచనములందును వారి మార్గముల ననుసరించినవారే. కాక పోయిన, వచనమునకున్న మూఁడుశక్తులను (పైఁ జేర్కొనిన శక్తులు) బరిశీలించి, ముప్వరి ఛాయలను సంక్రమింపఁజేసికొన్న వా రనేకులున్నారు.

మరల కవిత్వములోఁ గాని వచనములోఁ గాని ప్రత్యేక విశిష్టతలు వచ్చిన వనిన శ్రీనాథుని హస్తములందే యని చెప్ప వలయు.

కవితలో శ్రీనాథుని కాలమున నొక మార్పు వచ్చినట్లు సూచించితిని. కవిత్రయముచే దిద్దిపెట్టఁబడిన పురాణ లేక ఇతి హాసవైఖరి కొంతకాలము వర్థిలి, శ్రీనాథునినాఁటికిఁ గావ్య ఫణితిలోనికిఁ బరివర్తనము పొందినది. ఈ వైఖరిభేదములోఁ

బాటుగ రచనాపద్ధతిలోను భేదము వచ్చినది. స్వతంత్రాలంకారములచే నా కావ్యభాష నలంకరించుట శ్రీనాథునితో మొదలుపెట్టఁబడెను. మూలమును యథాతథముగా ననుసరించుట లేతని రచనములో స్వల్పము. శ్రీనాథుఁ డెటనున్నను తన వ్యక్తిత్వమును జూపెట్టును. నైషధకావ్యమందలి యనువాద పద్ధతి యిందుల కుదాహరణము. కొన్ని శ్లోకముల ననువదించుటలో వచనముగా నవతరింపఁజేసినాఁడు. దానిలో నాతని యశక్తతగాక, యీ మూలశ్లోకములలోని వాచ్యత (Baldness)యే కారణ మనవలసియున్నది.

ఉదా: కిమస్యరోమ్ణాం కపటేన కోటిభిః విధిర్న రేఖాభిరజీగణ
ద్గుణాన్ నరోమకూపౌఘమిషా జగత్కృతా కృతాశ్చ
కిం దూషణ శూన్య బిందవః ॥

మొదలైన శ్లోకములను వచనమందుంచె జూడుడు:

"......రోమకోటి కపటంబున హాటకగర్భుండు పాటించిన సుగుణగణనా రేఖ లవయవంబులం బోలుపారె" —శృం.నై.

ఇవ్విధముగా శ్రీనాథుఁడు వచనముయొక్క ప్రయోజనమును గ్రహించెను; కథాకథనమున కెక్కుడుగా వచనమే యుపయుక్తమని తెలిసినాఁడు. అందుచేతనే శ్రీహర్షుని శ్లోకములను వచనమందు దింపినాడు. ఇదిగాక శ్రీనాథుఁడు కావ్యఫణితి ననుసరించినవాఁడు కనుక, యది వచనమందును దొరలినది. దీర్ఘసమాసములతో వచనము నలంకరించినాఁడు. వర్ణనలను మఱింత బరువుగావించినాఁడు. అనుప్రాసాలంకార

ములఁ జొన్పి, శ్రవఃపేయతకు పాటుబడినాఁడు. ఈ క్రింది వచన ముదాహరణ మగును :

"వెండియు నవఖండమండలంబగు మహీమండలంబునకు మకరకుండలాలంకారంబునుంబోలె భీమేశ్వరమండలంబు పొరుగునఁ ద్రిలింగోత్కలతలంబులనంది, వింధ్యాచలపాదంబునఁ గేదార కుంభకోణార్కస్థానంబుల కుపమానంబనఁజాలి, యేలేటి మేటి కాలువల వలన నదీమాతృకంబులగు పంటవలంతులు సలిలధౌత కలధౌత శలాకాశకలసంకోచ కరణంబులై యంకురించినవియు...''

శ్రీనాథుఁడు కాశీఖండంబున 'సదాచార నిరూపణము', 'స్త్రీలక్షణ నిరూపణము', 'యోగ నిరూపణము' లను జేయునపు డెక్కుడుగా వచన ముపయోగించి వచనప్రాశస్త్యమును నిరూపించెను. అట్టి నీతిబోధలకు, శాస్త్రవిషయములకును వచనమే యుపాదేయమని గ్రహించినట్లు స్పష్టముగదా ! ఈతని జటిల వచనరచనము జూడుఁడు :

'ఆ రాజరాజు రాజీవభవ హరి పురందరాది బృందారక మకుటసంధానిత వికచ మందార కుసుమ మాలా మకరంద బిందుధారా ధౌత చరణారవింద మందరాచల మంథాన మథ్యమాన దుగ్ధజలధి గర్భావిర్భూత కాలకూట కృపీట భవపిండ గండూష కళంకిత కంఠమాలోపకుంఠ నకాండోత్క భువన రక్షా దాక్షిణ్య దాక్షాయణీ కుచకలశ పాళీ కేళి'' —కాశీ.ఖం. చ.

ఇట్లు శ్రీనాథుని చేతిలో వచన మొక నూత్న మార్గాశ్రయి యైనదని సిద్ధాంతము. పోతన శ్రీనాథుని సమకాలీనుఁడైనను, 'భాగవతము' కావ్యము కాదు గనుక యితిహాస వైఖరినే తన రచనములోఁ బ్రతిపాదించి ప్రయోగించినాఁడు. కాని పోతన కవిత్వములో గడించుకొనిన ప్రత్యేకత, గద్యమందును పొందినాఁడని చెప్పవలయును. అంత్యనియమములతో రచించు పద్ధతి యీతని సొమ్ము. వర్ణనములందు దీర్ఘసమాసయుక్తముగను, కథాకథనమందు లలిత పదములతోడను రచనమును సల్పగల సవ్యసాచి పోతన.[1]

ఇఁక శ్రీనాథుని తరువాతవాఁడు గతానుగతికంబుగ నాతని రచనమునే యనుకరించి రనవలెను. పిల్లలమఱ్ఱి పినవీరన శాకుంతల కథను స్వీకరించినపుడు శ్రీనాథుని భాషాంతరీకరణ పద్ధతినే యనుసరించెను. జక్కన, అనంతామాత్యులు తమ రచనలలోఁ గథాకథనపద్ధతికి ననువైన రచనసల్పి, వచనములను దదనుగుణముగా నిర్వహించిరి. జక్కన తన 'విక్రమార్కచరిత్రము'లోఁ బ్రథమాశ్వాసమునఁ బురవర్ణనమును వచనంబులో నిలిపినాఁడు. దీనిఁబట్టి వర్ణనాత్మకమైన శైలి వచనములో నెంతవఱకు నెగ్గునో నిరూపితమగును. జక్కన వచనములు సమాససంభరితములు, శబ్దాలంకార విలసితములును. శ్రీనాథుని వచనరచనము ననుగమించినా రాతని తర్వాతకవులు.

1. "...... జలధర నినదశంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండు......." (భాగవతము 8 స్కం.)

కవిత్రయముచారి తరువాత మరల శ్రీనాథుఁడే తెలుఁగు సాహిత్యమున కొకతీర్పు దిద్దినాఁడు. అది పెద్దన కాలమువఱకు సాగినది. పిమ్మట పెద్దన పెద్దవాఁడైనాఁడు. కృష్ణరాయల దర్బారు సాహితీరంగస్థల మైనది. ఎఱ్ఱాప్రెగ్గడచే శంకుస్థాపనము చేయఁబడి, శ్రీనాథునిచేఁ బరికరములు సమకూర్పఁబడి పెద్దనచే ప్రబంధ సౌధనిర్మాణము గావింపఁబడినది. తరువాత వసుచరిత్రకారుఁడు సౌధాంతర్భాగములకన్న సౌధోపరిభాగముల నలంకరించినాఁడు. తరువాత కవులందఱా సౌధములలోనే వర్తించిరిగాని, మంచి యేమియుఁ జేయలేదనవలెను. ఇట్లు పదునెనిమిదవ శతాబ్దమువఱకు సాగినది. ప్రబంధములలోని వచనము, పైన నుడివినట్లుగాఁ బ్రబంధ పద్యసరణినే నడచినది. అట్లనుగుణముగ లేనిచో సమత (Balance) యుండ నేరదు. పెద్దన పెట్టిన యొఱవడిని కథాకథనమందును, కథాసన్నివేశకల్పనమందును, అంగాంగిరసనిర్వహణములందును, విషయ విభజనమందును, తరువాత కవులు చాలవఱకనుకరించిరి; ఇట్టి రచనము గతానుగతికమై కవిసమయము (Poetic Convention) వలెఁ బరిణమించినది. ఈ ప్రబంధములలో ద్వితీయాశ్వాసమునఁ (నించుమించు) దప్పక యొక దీర్ఘవచనము పొసగియున్నది. దీని వైశిష్ట్య మేమన: శబ్దాలంకారము తప్పక యుండుట; యమకము, అనుప్రాసములు వరలుచుండుట; ఇవి సమాసములోనుండి వర్ణనాసందర్భములో రచింపఁబడుట. ఉదాహరణములుగాఁ జూడుఁడు:

కోలాహల పర్వత వర్ణనమును జేయుచు వసుచరిత్రకారుఁడు— 'మఱియు నిక్కోలాచల సంతానంబు, సంతాన-

కుసుమ వాసనా సమాగత సారంగసంగీత ఝంకృతరంగంబు లుపాంగంబులుగాఁ బాడు వేల్పుగాఁడెల పాణిలితమాణిక్య వీణామధుర రావామృతంబులఁ గరఁగి, పెచ్చు పెరుఁగు నచ్చపుఁ బచ్చలచాయలు మెచ్చులు సేయఁ జవ్వికల మచ్చికల విచ్చలవిడిఁ గుచ్చుకొని మెసవ నుంకించు నంకపు రాజికం జంకించి......' మనుచరిత్రలో వేఁటను వర్ణించు సమయంబున పెద్దన పెద్ద వచన రచనమున కుద్యుక్తుఁడాయె. ఈ వచనము ననుప్రాసా లంకారములతో నున్నది. ముక్కుతిమ్మన యొద్దికగా తన ముద్దుపలుకులతో గద్యమును దిద్ది పెద్దనాదుల కుద్దియనిపించె :

'అంధకారబలీంద్ర నిర్బంధన దురంధర సమయమధు మథన చరణాంగుష్ఠనిష్ఠ్యూత గగనసరిదంబుపూరంబుల కను బింబంబులై......' అను రచన ముదాహారణము చాలును.

పింగళి సూరన యాఖ్యానశైలిలో రచనము సల్పి నాఁడు. ఆతని కళాపూర్ణోదయ మిందుల కుదాహారణ మగును. ఇందలి వచనములలో ముఖ్యముగా నెన్నఁదగినది కథలోని కల్పనల యావిష్కరణ సమయమందు విరచించిన వచనము. సరస్వతీ చతుర్ముఖుల విలాసమును విప్పి చెప్పినపుడు వచనమే యుపాదేయమని తలంచినాఁడు సూరన. ఇట్టి క్లిష్ట విషయము పద్యమందుకన్న వచనమందు విపులముగా వివరింపనగును గదా !

ఇట ధూర్జటిని గూర్చియుఁ జెప్పవలసి యున్నది :

ధూర్జటి చాల స్వతంత్రుఁడు. కృష్ణరాయల కాలములో నున్నను, ఆతని కంకితము చేయక కాళహస్తీశ్వరునికే కైత సమర్పించిన ప్రత్యేకత గలవాఁడు. ఈతఁడు తన కవిత్వమందును స్వాతంత్ర్యము వహించెను. ఇతఁడు తన వచన రచనములో యుద్ధమును వర్ణించు తఱి, వేఁటకు వెడలునట్టి సందర్భము లందును, సహజ ప్రతిభతో స్వభావోక్తి ప్రధానముగా రచించెను.

రామకృష్ణుఁడు తన పాండురంగ మాహాత్మ్యములో వచన రచన సన్నివేశములను వర్ణనోచిత పద్ధతుల కండ్లకుఁ గట్టి నట్లు చేసెను. నిగమశర్మ యక్క వచ్చిన సందర్భమున నా యింట జరిగిన విశేషములను చక్కగా వచనంబునఁ బొందు పఱచినాఁడు. 'పాండురంగవిభుని పదగుంఫనము' ప్రతిఘట్ట మునఁ గన్పించును. ఈ పైసందర్భమున నూత్నవచనములో రామకృష్ణుఁడు నిగమశర్మ శరీరముయొక్క కర్కశత్వమును కుకవిపదబాధమునకుఁ బోల్చి తన యాధిక్యమును ప్రకటించెను. పాత్రచిత్రణమందు వచన మెంత దోహదభూతమో యుదాహ రించినాఁడనవలెను.

ఆంధ్రకవికులభోజుఁడైన శ్రీకృష్ణరాయలు రచించిన ఆముక్తమాల్యదలో ననేక వచనములు గన్పించును. కృష్ణ రాయలు వర్ణనలందుత్తమోత్తమ రచయిత యని ప్రాజ్ఞుల తలంపు. ఆముక్తమాల్యదలో నీ విషయమున కుదాహరణ ములు మిక్కుటము. మతసంప్రదాయ సిద్ధాంతములను రాయలు చక్కగా నెఱిఁగియుండెను. వానిని తన గ్రంథమం

దంతటను వెదజల్లినాఁడు. ఆము క్తమాల్యదలోని వచనరచనము జూచినచో తత్త్వవిషయికమైన బోధన మంతటిని వచనమే చక్కఁగా నిర్వహించున దని తెలును. ఇవ్విధముగాఁ బ్రబంధ ములలో వర్ణనలకు, త త్త్వవిషయములాదిగాగల శాస్త్రవిషయ ములకు వచనమే యుపాదేయముగాని పద్యము కాదని ఋజు వయినది.

ఇఁక దక్షిణాంధ్ర వాఙ్మయములో వచనస్థాన స్వరూప ములను గమనింతము. వచనములోఁ గ్రాంథ్రాం త్తగాఁ గావ్య సృష్టి యీ నాయకరాజ యుగమునందే జరిగినది. పద్య కావ్యముకన్న వచనకావ్య మెక్కువగా సులభగ్రాహ్య మని కవు లెటింగిరి. అనేక ప్రక్రియా భేదము లీ యుగమం దుద్భ వించినది. యక్షగాన మీనాఁటిదే. గీతికి (Lyric) ప్రాధా న్యమువచ్చిన దీ దినములందే. ఆనాఁటి కవులు గతానుగతి కముగా గాక, ప్రత్యేకమార్గమును ద్రొక్కి తమ ప్రతిభను నసమానముగా నందఁజేయవలెనని సంకల్పించిరి. తదనుగుణ ముగా సార్వభౌముల సాహితీ పిపాస చేతులంగలపినది. కృష్ణ రాయలెవలె రఘునాథరాయలుగూడ సాహితీద్రష్ట; స్రష్ట. నాయకరాజయుగమున వెలువడిన గ్రంథములలోఁ బ్రబంధము లున్నను నవి పిల్లవసుచరిత్రలవలె గతానుగతికములుగాక ప్రత్యేకస్థానమును బొందగల్గినవై చెలఁగుచున్నవి. వచనము లంత క్లిష్టములు గాక సుబోధ వచనరచనమునకు మార్గదర్శక ములై వ్యావహారిక ప్రయోగములతోఁ బొసఁగుచున్నవి.

This prose is interesting contrast with the classical prose, and is full of colloquial idiom (of Taylor's Oriental Historical Manuscripts)

— *Prof. S. Kuruganti.*

వచనరచనకుఁ గడఁగినవారిలో 'రాయవాచక' కర్తను,[1] ఎలకూచి బాలసరస్వతిని పేర్కొనక తప్పదు. బాలసరస్వతి 'వ్యాఖ్యాన' మను ప్రక్రియను తెలుఁగులో నవతరింపఁజేసినాఁడు. కళువె వీరరాజు, సముఖము వేంకటకృష్ణనాయకుఁడు ముఖ్యముగా వచనగ్రంథముల రచించిరి. కంకంటి పాపరాజు ప్రబంధసరళిలో రామాయణకావ్య విరచనము సల్పినను, తన కాలము నాఁటి వచనశైలి యాతని గ్రంథములోఁ బ్రతిఫలింపక పోలేదు.

ఈ యుగమందు వెలసిన రచయితల రచనమందలి వచనమును సూచించెదను : కంకంటి పాపరాజు వ్రాసిన యుత్తర రామాయణములో వచనము స్వభావోక్తి ప్రధానము గను, పాత్రచిత్రణమున కనుగుణముగను బాడముచున్నది. ఉదాహరణముగా, జానకీ శోకఘట్టమున జానకి లక్ష్మణునిచే

రామాజ్ఞ నెఱిఁగి, యవశయై చేష్టుడియున్నతఱి నాపె యవస్థను వచనములో నెట్లు చిత్రించెనో కాననగును :—

"...పడి చేష్టుడి బడిబడింబొడము బడలిక నొడ తెలుంగక రెండుగడియలుండి కొండొక తెలిసి వెండియు నలసి యవశయై

1. రాయవాచకము మధుర సేనాపతిచే రచింపఁబడినది. ఇందలి భాష వ్యవహార సిద్ధమైనది. "రథోత్సవమునకు విజయం శాయవలెను ; అని విన్నపం శాయంగ దగ్గిరవున్న దళనాయకులు ఆతీరున్నే రాయలవారు విచ్చేసి వున్నారు."

దీనదశం బొరసి, కృశాంగి మరలఁ గన్ను దొరలిపచ్చి; విచ్చల విడి వెడలెడి యశ్రుధారా ప్రవాహంబులు చెక్కుటద్దములపై జాలువాఱ..., పురపురఁ బొక్కుచుఁ దాల్మిదూలిఁ స్రుక్కుచు లేచి కూర్చుండి... వెక్కి వెక్కి యేడ్చుచు... తలయూచుచు, దలయూచుట విడిచి, ముక్కుపై వ్రేలు గీలుకొలుపుచు... హాహాకారంబు సలుపుచు...”

ఇట్లే రంభను రావణుఁడు మానభంగ మొనర్చిన పిమ్మట రంభయొక్క దుర్దశ వర్ణించినాఁడు వచనమందు :—

“బెబ్బులి వాతికిం జిక్కియుఁ జిక్కక మగిడిన హరిణి కరణి రాహుముఖ గహ్వరంబునం బడి బయలుదేఱిన చంద్రకళ చందంబున... చెదరిన ముంగురులతో బెదరిన బెళుకు చూపులతోఁ బ్రిదిలిన నీవిబంధంబుతో వదలిన కేశపాశంబుతోఁ బగిలిన బింబాధరంబుతో నొగిలిన చెక్కుటద్దంబులతో ... వాడిన విరిసరులతో వీడిన భూషణాంబులతో... ఆకారంబు దాల్చి వచ్చిన శోకరసాధిదేవత వలె” నున్నదని వర్ణించె. ఇట వర్ణితములైన యవస్థలను సూచించుటకు సంతరింపఁబడిన క్రియా పదంబులు రెండు రెండుగా ననుప్రాసాలంకార సహితముగానుండి నడకలో బిగువును జాటుచున్నవి.

సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు తెనుఁగు వచన స్వరూపము తిన్నగా తెలుపుటకై సారంగధర చరిత్ర, జైమినీ భారతము లను వచన కావ్యముల రచించెను. ఈతని వచనరచనము సులలితపద సమన్వితమై క్లిష్టాన్వయములు లేక ‘కులుకు కోకిల సణంచు గళరవంబు, పలుకుల సొరు’ గలిగి

తెనుఁగు తీయదనమును, దేటదనమును, దీర్చిదిద్దినట్లుండును. సంభాషణావిధానమును జిత్రించుటలోనైతను మీా వచనము నిరాడంబరముగా సరసముగా నుండును.

'జననీ! తక్కిన వారికిం బలె యింత యుపచారంబేమిటికి? ఏను నీ కుమారుండను గానే' యనుటయు నాపువ్వుబోఁడి, బొమ్మంచు కెమ్మోవి చిగురుం జిరునగవు మొలకలు గులుక, కప్పురంపు పీడియంపు తావి ఘుమ్మనమన, తేనియ చినుకు లొలుక నిట్లు పలికె: ఓ జగన్మోహనాంగ! నా కుమారుండ నగుదువు; నిక్కంబు పలికితివి. నీదు సుగుణత్వంబును, నీ చక్కఁదనంబు నీ యొయ్యారంబు నిచ్చలులు నిచ్చలు పలుక విని వీనులకు విందులయ్యె. ఇప్పుడు కనుంగొనుటచేఁ గన్నులకుం బండువయ్యె...'

కళువె వీరరాజు రచించిన వచనభారతము, మఱి కర్త లెవరో తెలియని వచనములు, 'భారత చిత్రకథలు', 'బేతాళ పంచవింశతి' మొదలైన వనేకము లున్నవి. విజయరంగ చొక్కనాథుఁడు 'మాఘమాహాత్మ్యము', 'శ్రీరంగమాహాత్మ్యము'లను వచనకావ్యములు రచించెను. రామాయణ భాగవతములును వచనములోనికవతరింపఁబడినవి. శ్యామ రాయకవి వచనరామాయణమును, పుష్పగిరి తిమ్మన వచన భాగవతమును గూర్చిరి.

ఈ విధముగా వచనరచనము విరివిగాఁ బదునేడు పదు నెనిమిది శతాబ్దులలో జరిగినది. వ్యావహారిక భాషా ప్రాధాన్యము చాల గ్రంథములలో నున్నట్లు తెలియఁగలము. నాఁటి

యక్షగానములలోని వచనముగూడ వ్యావహారికమే. వచన గ్రంథములకు ముఖ్యముగా సుబోధకత్వమే ప్రోద్బలమిచ్చినది. ప్రజల కందుబాటుగా సాహిత్యము నుంచుటకుగాను దక్షి ణాంధ్ర వాఙ్మయము పుట్టినట్లు ద్యోతిలును. భారతభాగవత రామాయణములను వచనమునం దుంచుట, యక్షగానము ద్వారా ప్రజాభిరుచిని చూఱగొనుటలు తార్కాణములు గదా!

పూర్వోక్త ప్రకారముగా నాంధ్రభాష మీఁద నాంగ్ల భాషాప్రాబల్యము పందొమ్మిదవశతాబ్ది మధ్యకాలమునకు బాగుగా వచ్చినది. ఆంగ్లవచనరచన మాంధ్రుల ననేకుల ముగ్ధులఁ జేసినది. అట్టి వాఙ్మయ మాంధ్రభాషలో నిర్మింప కుతూహలము సాహితీసేవకులకు జనించినది. ఇట్టి స్థితిలో చిన్నయసూరి సర్వాతిశాయియైన గుణము కలిగించి వచన రచనము చేసినాఁడు. ఆంగ్లపాఠశాలలలోఁ దెలుఁగు చదివెడి విద్యార్థుల కుపయుక్తములగు సులభ వచనములను వ్రాయ దుర్గము వేంకటనరసయ్య ప్రారంభించెను. చిన్నయసూరి దృష్టియు నట్టిదే. కాని సూరి యాప్సితము పెద్దది! ఆలంకారిక మైన వన్నెచిన్నెల నాపాదించి, శైలీసంపద ఘటించి, విరచిం చిన 'నీతిచంద్రిక' పిన్నలకే గాక పెద్దలకు నాదరణీయమైన గ్రంథమాయెను. వచనరచనములో మకుటాయమానమైనది 'నీతిచంద్రిక'. ఆంగ్లవచనరచనము ననుసరించి, వాక్యవిరామాదు లను బాటించిన ప్రథమాంధ్ర వచనరచయిత చిన్నయసూరి. సంస్కృతాంధ్రములను సొగసుగాఁ బొందింపగల శక్తిమంతుఁడు సూరి, భావముగాని, భాషగాని తొట్రుపడకయే గంభీరముగ

నడిపింపఁగల ప్రతిభాశాలి. నన్నయభట్టు పద్యరచనమం దెట్టి దిట్టయో, వచన రచనమందు సూరి యంతటి దిట్ట.

చిన్నయసూరి ప్రారంభించిన గ్రంథమును బూర్తిచేయు తలంపుతో వీరేశలింగము పంతులు, కొక్కొండ వెంకటరత్నం పంతులు ప్రయత్నించిరి. వెంకటరత్నము పంతులు రచనము బిరుసుపాకమునఁ బడినది. వీరేశలింగము పంతులు చిన్నయ సూరి వలెనే వ్రాయుటకై యత్నించి చాలవఱకు మరపింప గల్గెను; కాని యది వీరేశలింగముపంతులు సహజశైలికాదని, యాతని యితరవచనమును జూచినచో బోధపడగలదు. వచన మును సర్వోపభోగ్యమైన వస్తువుగాఁజేసి కేవల మాధునికమగు వచనమునకు కందుకూరి మార్గదర్శియయ్యెను. కావున నాధునిక వచనమునకు మూలపురుషుఁడు వీరేశలింగముపంతులే యన వలెను. ఆంగ్లప్రభావము పూర్తిగాఁ బ్రతిఫలించిన దాతని రచనమందంతటను; ఆంధ్రమున 'కథానిక'ను దప్ప మిగిలిన వచనమార్గముల ననుసరించినవాఁడు పంతులే. నవల, విమర్శ నము, చరిత్ర, ప్రహసనము, వ్యాసము, ఉపన్యాసము మొదలైన వచన ప్రక్రియాభేదముల నన్నిఁటి నవతరింపఁజేసిన గురువు వీరేశలింగము పంతులు. వీరి గ్రంథము లన్నియు గావ్యములు గాక, విజ్ఞానోపలబ్ధి కక్కఱకు వచ్చునవిగా నున్నవి స్వీయచరిత్ర వీరేశలింగము పంతులు వారి తోడనే యాంధ్రమున నవతరించినది. పూర్వమున్న యాలంకారిక, శాబ్దిక విమర్శనమును మాని, గ్రంథములపై నాధునికవిమర్శ నలు సల్పిన యాదిగురువు పంతులుగారే! నవలావాఙ్మయము మునకు శ్రీకారము చుట్టిన మహానుభావులుకూడ వారే! విషు

ర్శనమునందు కందుకూరివారితోపాటు గురజాడ శ్రీరామమూర్తి పంతులుకూడ నెన్నదగినవారు. కాని వీరేశలింగముపంతుల కున్న నిష్పాక్షికాభిప్రాయము, పరిశీలనాదృష్టి శ్రీ రామమూర్తి గారికున్నట్లు తోచదు.

ఇట్టి విధముగా నూతనమార్గమున వచనము వీరేశలింగము పంతులవారి ముంజేతి మణికటకమున నాధునిక యుగమున వర్తిలినది. ఆధునిక యుగమునందలి వచనస్వరూపము నెఱుగుటకు ముఖ్యముగా విషయ విభజన మవసరమని తోచును. వచనములో వచ్చిన వివిధశాఖల క్రింద వివిధసేవకుల కృషి, తత్స్వరూపముల నెన్నుట యుచితము గదా !

వచనము బహువిషయముల కాలవాలమైనది. నవల, ఉపన్యాసము, విమర్శనము, చరిత్ర, శాస్త్రము, వ్యాసము — యివి వచనముయొక్క ముఖములు. వీని నాదరించి రచనసల్పిన వారి నెఱుంగుదము :

ఆనాఁడు వీరేశలింగము పంతులు పెట్టిన భిక్ష నేటికిని నవల విషయమునఁ బొసఁగుచునేయున్నది. కాని రచనములో, స్వరూపములో, కథాసన్నివేశ కల్పనములో మార్పు లగుపించుచున్నవి. 'నవల' అను పదముమాత్ర మట్లే యున్నది.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు నవలారచయితలలోఁ బ్రథమగణ్యులు.[1] వీరి రచనము మృదువైనది. వీరేశలింగము

1. "కవుల ప్రతిభకు నికషాయమానమగు గద్యప్రబంధ రచనమున వన్నెకెక్కిన యల్పసంఖ్యాకులగు నాంధ్రకవులలో గణనీయులు..."
— ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవము.

గారి రచనములోని సారళ్యముతోపాటు వీరి రచనమున సౌష్ఠ మార్య మబ్బినది. హాస్యముకూడఁ గడుమేలైనదే. రామచంద్ర విజయము, గణపతి, సౌందర్యతిలక, శాపము, సుధాశరచ్చంద్రము వీరి గొప్ప నవలారచనలు. చారిత్రక నవలలో చిలకమర్తివా రద్వితీయులేమో యనునట్లు 'హేమలత', 'రాజాస్థాన కథావళి' వెలఁగుచుండును.

నవలారచయితల సంఖ్య బాగుగాఁ నాంధ్రమునఁ బెరిగిపోయినది. ఇట్లు తండోపతండములుగా వచ్చుచున్న వీనిలో మంచిచెడ్డ లేరుట కర్తవ్యముగాదు. ఈ రచయితలందఱు వచన రచనమునకుఁ దోడ్పడిరనియే చెప్పవలయును. కొందఱు భాష చాల జటిలముగాఁ బ్రయోగించిరి; కొందఱు ద్రాక్షాపాకములో బొంకముగా రచించిరి. వేంకట పార్వతీశకవులు పేరెన్నిక గన్న నవలారచయితలు. వీరి 'ప్రమదావనము' చక్కని యాంధ్రనవల. వేంకట పార్వతీశకవులు నవల కొరక విశిష్టమైన వచనరచన నాపాదించి, పండితపామర హృద్యముగా రచన సాగించిరి. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి వచనరచనము చాల క్లిష్టమై వచన ప్రయోజనమునకు సుదూరమై వర్తిలును. ఈమధ్య వచ్చిన నవలాకారులలో విశ్వనాథ, అడివి, నోరి మున్నగువారు సుబోధమైన శైలిని సాధింపఁజూచిరి.

నవలారచనములో వచనము చాల కాలమువఱకు, ననఁగా గిడుగు రామమూర్తి పంతులు వ్యవహారిక భాషావాదము నుద్ఘాటింపక పూర్వము, గ్రాంథికములోనే భాసిల్లినది. గ్రాంథిక వచనమును వశము జేసికొనినవా రరుదు. కృతక భాష గాక,

వ్యాకరణసాధ్యములతో పదములను, కారకములను బ్రయోగించు నట్టి భాష కాక, వ్యవహారమునకు సమీపముగా నుండు భాష బ్రయోగించిన నది చాల హృద్యముగా నుండును. వ్యావహారికము పేర వ్రాయఁబడుచున్న నేఁటి గ్రంథములలోఁ గాని, భాషించు నుపన్యాసములలోఁ గాని యున్న భాష సామాన్య జనుల కెంతవఱకు సుబోధకముగా నున్నదో ప్రాజ్ఞులు, ద్రష్టలు తెలియఁగలరు. మాండలిక భేదములతో మూర్తీభవించినచో దురవబోధ మగుచున్నట్లును దెలిసిన విషయమే కదా! క్రియా పదములను మాత్రము త్రుంచి, సమాసభూయిష్ఠ రచనము సల్పుచున్నవా రనేకు లున్నారు. జమ్మలమడక మాధవరాయ శర్మగారి వచనరచన మిందుల కుదాహరణ మగును. ఇట్లుగాక, సామాన్యమానవుని కర్థమగు లలిత శైలితో గ్రాంథికము నారాధించినవారు కందుకూరివారని చెప్పవలెను. ఇయ్యది వారి రచనములలోఁ గానవగును. ఈ రచనము నవలోకించిన సామాన్యులకును సుబోధకముగా రచించుటకు వ్యావహారికమే యక్కర లేదనియు, గ్రాంథిక వచనములోఁగూడ పండిత పామర హృద్యముగా రచన సల్ప వీలున్నదనియుఁ దెలియఁగలదు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి' లోని వచనము వ్యావహారికమై సుబోధమే; దీనినే తేఁటతెనుఁ గందుము. మాండలికములను గూర్చి Ernest Hornwitz—

"Books written in a dialect are slow to travel beyond the pale of the province where it is spoken; but, a classical tongue like Sanskrit spreads quickly over wide geographical area."

అని వచించినాఁడు.

అయినను, నీ నూతనపదముల శబ్దములకు గతి కల్పించు లక్షణకర్త వచ్చినఁ గాని దీనివలన వచ్చు నష్ట ముపశమింపదు.

ఇఁక నుపన్యాస రచనమునందు, పానుగంటి లక్ష్మీ నరసింహారావు పంతులుగారి పేరొకటి చెప్పవలెను. వారి 'సాక్షి' సంపుటములలోఁ గానవచ్చు వచనస్వరూప మనన్యసాధారణము. ధారాశుద్ధి, విషయనిగుంఫనము, ఉపన్యాసపద్ధతి, వచనరచనము లప్రతిమానములు. అందఱకును సుబోధముగా నున్న రచన యిది; 'ఆంధ్ర ఎడిసన్' అనిపించుకొనిన సమర్థుఁడీయన.

విమర్శనములో వచన రచనమే యుపాదేయమైనది. కాని కొందఱు—వఝ్ఝల సూర్యనారాయణశాస్త్రి, అనంత పంతుల రామలింగస్వామివంటివారు—విమర్శకూడఁ బద్యములలో రచించిరి. వచనరచనము సల్పిన విమర్శకులను చారిత్రక విమర్శకులనియు, సాహితీ విమర్శకులనియు విభజింపవలెను. సాహితీ విమర్శకులలో — పూండ్ల రామకృష్ణయ్య, కట్టమంచి రామలింగారెడ్డి, కనుగంటి సీతారామయ్య, కాశీభట్ల సోదరులు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పురాణం సూరిశాస్త్రి, శే. వెం. రాఘవయ్యంగారు మున్నగువా రెందఱో యున్నారు. వీ రందఱిలో ముట్నూరి కృష్ణరావుగా రగ్రగణ్యులు; వారి 'సమీక్ష' యిందులకు నిదర్శనము. నిర్దుష్టమైన, యుదాత్తమైన వచన రచన స్వరూపమును వస్తువున కనుగుణముగా రచించి చూపిన మేధావి కృష్ణరావుగారు. డీక్వెన్సీ మొదలగు రచయితలతో నించుమించు చేతులు కలిపినాఁ డనవలెను.

మన పురాణగ్రంథములను వచనములోనికి దింపి, సర్వోపభోగ్యములం గావించిన నోరి గురులింగశాస్త్రి, నాగపూడి కుప్పుస్వామయ్య, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారలు మున్నగువారు స్మరణీయులు. అనేక పండితులు గ్రంథపీఠికారూపమున విమర్శనల సల్పుచువచ్చిరి. ఈ వచనరచనము క్లిష్టముగాదు; అయినచోఁ బ్రయోజనము చెడునుగదా! మేడేపల్లి వెంకటరమణాచార్యులు, దేవరాజసుధి, జయంతి రామయ్యపంతులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారలు మున్నగువార లనేక పీఠికలు రచించి వచనోపాసకులైరి.

చారిత్రకులలో కొమర్రాజు, మల్లంపల్లి, మారేమండ, భావరాజు, కురుగంటి, మల్లాది, పింగళి, దువ్వూరి, భోగరాజు, శేకుమళ్ళ, వల్లూరి, దిగవల్లి, మానికొండ, కవిత్వవేది, వంగూరి, చిలుకూరి, రాయసం, కోరాడ, చాగంటి, గంటి, నిడుదవోలు, ఖండవల్లి, శిష్ట్లా, భూపతి మున్నగువా రున్నారు. వీరిలో కొందఱు సాహితీచరిత్రకు, కొందఱు భాషాచరిత్రకు, కొందఱు రాజకీయచరిత్రకుఁ గడంగి, సేవచేయువా రున్నారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు స్మరణీయులు; వీరు పరిశోధనాపద్ధతికి దారితీసిరి. శాస్త్ర రచయితలలో సి.ఆర్. రెడ్డి, ఆత్మకూరి గోవిందాచార్యులు, గుళ్ళపల్లి నారాయణమూర్తి, కాళీపట్నం కొండయ్య, వఝులవారు, అప్పన్నశాస్త్రి, తిరువేంగళాచార్యులు, వసంతరావు వేంకటరావు మున్నగువా రల్ప సంఖ్యాకు లున్నారు.

వ్యాఖ్యాత లనేకులు వచనము నారాధించుచున్నారు.

ఇఁక వ్యాసరచనము పత్రికాముఖముగా వెలువడు వ్యాసములు వ్యాసములు కావని మనవి. వ్యాస మనఁగా కేవల విషయ ప్రాధాన్యము కలది కాదు. ఏ చిన్న విషయము నైనను రచయిత తన భావాధిక్యముచేఁ గేంద్రీకరించి, విస్తరించి, యంగాంగీభావ నిర్వహణము చేసి, యుదాత్తమైన శైలీసంపదతో విరచనచేసి కావ్యత్వ మాపాదింపవలెను. పద్యమువలె వ్యాసమునకుఁ గూడ రసమే ప్రధానము. ఈ కారణముననే యాంగ్ల సాహిత్యమున వ్యాసకర్తల రచనములను విమర్శకులు కావ్యముక్రిందఁ జేర్చిరి. ఇట్టి వ్యాస మను ప్రక్రియ లేని లోపమును మన యాంధ్ర సాహితీసేవకు లిపుడిపుడు తీర్చుచున్నారనవలె.[1]

మనకు 'కథానిక' నూతనముగానే వచ్చినదని పలువుర యాశయము; కాని పూర్వ మిది వర్తిలినటుల నూహించిన వారు తెలియగలరు. మన యాంధ్ర గృహములలో ముసలివారు చెప్పుపద్ధతి, వచనమాధుర్యము లప్రతిమానములు. ఆ సంప్రదాయమును విస్మరింపరాదు. 'కథానిక' నేఁటి సారస్వతమున ముఖ్యస్థాన మాక్రమించి వచనరచయితల ననేకులఁ బ్రేరించుచున్నది. చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు, మునిమాణిక్యం నరసింహారావు, కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్ మున్నగువారు ప్రసిద్ధులలోఁ గొందఱు. కథాకథనపద్ధతికి వచన మెంతవఱకు పాదేయమో

1. వ్యాస సంపుటు లనేక మీ మధ్య ప్రకటితము లగుచున్నట్లు గమనింతుము. వేటూరి, పుట్టపర్తి, పిల్లలమర్రి, శిష్ట్లా, దేవులపల్లి (Jr.), జి. వి. కృష్ణారావు, మధునాపంతుల మొదలైనవారి కృషి యెన్నఁదగినది.

వీరు నిరూపించి రచన లైరి. ఇటీవల వచననాటికలు బయలుదేరి వచనరచనమునకు దోహదభావము బొందుచున్నవి.

పత్రికలు వచనము నుపాసించు నిలయములు. 'Journalism' ఇతర ప్రాంతములలో గొప్ప విషయము. అది ప్రత్యేక శాస్త్రము. అట్టిది తెలుగులో బాగుగా నిటీవల వఱకుఁ బ్రవేశింపలేదని చెప్పవలెను.

నేఁ డాంధ్రమున శాస్త్రవాఙ్మయము వచనములోఁ దారసిలవలెనని యత్నములు జరుగుచుండుట ముదావహము. అన్నిట వ్యావహారిక రచన ముపాదేయ మగుచున్నది.

ఆంధ్ర వచన వాఙ్మయము నొక్కమారు సింహావలోకనము చేసినచో నైదు విధములైన విభజనము బొడగట్టును :

1. పద్యములతో వేఱుకలుపరాని పురాణవచనము.
2. ప్రబంధముం దాలంకారిక శైలీవిన్యాసముతో వర్ధిలిన వచనము.
3. ప్రజానీకమున కందుబాటులో నుండునట్లు రచింపఁబడిన వ్యావహారిక వచనము.
4. చిన్నయసూరి, కొక్కొండ వెంకటరత్నం పంతులవారి జటిల గ్రాంథిక వచనరచనము.
5. వీరేశలింగముగారి సుబోధము, సులలితమగు వచన రచనము.

ఇవ్విధముగా నాంధ్రవచన స్వరూపము గోచరించుచున్నది.

కావ్యము వ్రాసి కవి యశస్సు వించుకొనుట కెట్టి యాదర మున్నదో వచనరచనము చేసియున్నట్టి యాదరమునే పొందవలగు నని సాహితీపరులకు నా మనవి. ఆంధ్రుల విజ్ఞానము, సంస్కృతి, శాస్త్రములు సులభ బోధకములుగా వచనరూప మున వెలువడుటకుఁ బండితులు, ప్రతిభావంతులు, పరిషత్తులు, విశ్వవిద్యాలయమువారు పాటుబడి యాంధ్రవచనాభివృద్ధికి తోడ్పడుదురు గావుత!

# అభినవ కవిత

మానవుఁడు లౌకికానందమును బొందుటకై నిత్య నవీన మార్గముల నన్వేషించుచుండును. దీనికిం దార్కాణముగా నాతని వేష భాషలలోని మార్పు గన్పించును. అట్లే సాహిత్యమందుఁగూడ నూత్నమార్గముల నాయా కవులు కాలానుగుణముగ సృజించుకొందురు. మతములోఁగూడ ననేక భేదములు ప్రతీయమానము లగుచున్నవి. సంఘసంస్కారి వచ్చి యెప్పటి కప్పుడు సంఘమును మరమ్మతు చేయుచుండును. మార్పన్నిట సహజగుణము. కాని ప్రాథమికసూత్రముల కే విధమైన క్షతి యుండకుండ నంతవఱకా మార్పు సమ్మతమగుచుండును.

నేడు నిత్యవ్యవహారములో 'రొమాంటిసిజమ్' అను పదము విరివిగా నుపయుక్తమగుచున్నది. సామాన్యమానవ ధర్మములకును, ప్రకృతికిని, సభ్యతకును దూరముగానుండి, యప్పటికి నస్వాభావికముగా, నసభ్యముగా, విప్లవకారకముగా సంచరించు పద్ధతిని 'రొమాంటిసిజమ్' అనుచున్నారు. సంఘములోను, సాహిత్యములో నిది యన్వయించుచున్నది. ఇట్టి పద్ధతి కాలగతిలో సహజముగా నిమిడియుండును. ప్రతి సమాజములోఁ బ్రతి సాహిత్యములో నీవిధమైన 'భావచేతన'[1] మగుపించుచునే యుండును. కాలము జడము గాదు; అది ప్రవాహము వలె చేతనమునకు లోనైనది. కాలవాహిని కెదురీదఁ జూచుట యవివేకము. మానవుఁ డెప్పటికప్పుడు నూతన వికాసముల గ్రహించుచుండవలెనే కాని ముడికట్టుకొని కూరుచుండ

---

1. రొమాంటిసిజమునకు నేను వాడిన మాట.

రాదు. నూతన భావచేతనము సాహిత్యసమాజములలోఁ గల్గు చుండుట జాతియొక్క ప్రతిభను వెల్లడించును. ఈనాటి భావ చేతన మఱునాటికిఁ బ్రాతపడి ప్రాచీనమగును. తత్కాలమునకు భావచేతనము విప్లవభ్రాంతి చేకూర్చి కొంత యలజడి కల్గించి నను, అది పరిపాటయి పోయి మానవ మనసులలో స్థిరపడిన పిమ్మట బాధలేదు. ఎంతటి భావచేతనమైనను ప్రధాన మానవ సూత్రముల నతిక్రమింపరాదు. అట్లతిక్రమించినచో నది జాతిలో నిమిడిపోలేదు.

మన సాహిత్యము నవలోకించినచో నెన్నెన్నియో యుద్యమములు వచ్చినట్లు తెలియుదుము. మొదట పురా ణాది సంస్కృత గ్రంథముల ననుసరించుటతోఁ బ్రారంభమైనది. దాని ననువాదోద్యమ మనవచ్చును. తరువాత స్వకపోలకల్పన ముల కాలవాలమైన రచన సాగినది. దానిని కల్పనోద్యమ మనఁజెల్లును. అటుపిమ్మట నభినవ కవిత[1] వచ్చినది. దీనినే భావోద్యమ మనవచ్చును. ఇది యాంగ్ల సాహిత్య సంసర్గము వలన వచ్చినట్లు స్పష్టము. ఆంగ్ల సాహిత్యములో సైత మిది సంక్రమించుటకు దానిపై మఱియొక సాహిత్యప్రభావము కార కము. ఇట్లున్న దీని మూలసూత్రములను, వికాసమును బరిశీ లింతము :

కవిత్వము మానవజీవితవాహినితోఁ బెరుగుచున్నది. అది సచేతనము; నిత్యనవీనము; కవిత్వము జీవితమునకు ఛాయవంటి

1. మనవారు 'రొమాంటిక్ పొయెట్రీ'ని 'అభినవ కవిత', 'భావకవిత' యనియుఁ బిమ్మట 'నవ్యకవిత' యనియు వ్యవహరించినారు.

దను నిర్వచన మందు వలననే ప్రసంగినది. మానవజీవిత మనేక కవుల చేతులలో వివిధ వ్యాఖ్యానముల నంది వినూత్న పరిణామముల నందుచుండును. ఈ జీవితము క్షణికమైనను కవి తన శక్తిచే దానిని శాశ్వతముగా కావ్యభిత్తికపైఁ జిత్రించును. నశ్వరజీవితమునకు సజీవమైన ప్రతిమాస్థితి నొసఁగుటయే కళాధర్మము. ఈ విధముగాఁ జిత్రితములైన ప్రతిమలన్నియు భిన్న ప్రకృతులు కలవిగా పరిణమించుచుండుట సత్యము; కొన్ని క్రమ పరిణామమునకు దారితీయునవిగా నుండును; కొన్ని దేని తోడను సంబంధము లేక ప్రత్యేక వైలక్షణ్యము కలవిగా వర్తిలును. మఱికొన్ని వికృతరూపములను బొంది, లోక విరుద్ధములుగా నుండును. పై వానిలోఁ గ్రమపరిణామము గల్గిన రచనములు కవితాలోకమున నెట్టి కల్లోలము గల్గింపక ప్రకాశించునవి. విశిష్టమైన వికృతమూర్తుల ప్రకటించువారు విప్లవకారులై పృథక్త్వము కల్గియుందురు. ఏక కాలావచ్ఛేదకములుగా నీ రెండు ప్రకృతులు సాహిత్యములో భాసించుచునే యుండును. మొదటిది స్థిరము; రెండవది చేతనము.[1] భావచేతనమే మొదట ప్రభవించునది. అది క్రమముగా సమగ్ర స్వరూపమునుబొంది, యొక స్థాయిగొని, సిద్ధమగును. ప్రతి యుద్యమ మీా విధముగనే వర్ధిల్లును. ఇది సాహిత్యధర్మము.

ప్రతి భాషాసాహిత్యములో నీ ప్రవృత్తి వెలయుచునే వచ్చినది. జర్మనీ దేశమందు 'కాంటు' అను తత్త్వజ్ఞుఁడు లోక

1. 'మార్గ-దేశి' యని నాట్య సంగీతశాస్త్రములందలి విభాగమును మన వారు గ్రహించినారు. ఇదియు నట్టిదే.

తత్త్వమును విచారించి మనకు బాహిరముగాఁ గన్పించు వస్తువులలో నొక యతివస్తువు దాగియున్నదని చెప్పినాఁడు. తరువాత 'ఫిక్టె' యను మఱియొక వేత్త యీ యతివస్తువును 'అహం' అను పదార్థ మనినాఁడు. ఎవరే సిద్ధాంత మొనర్చినను 'మానవత్వము' నశింపఁజేయరా దని 'షెల్లింగు' ప్రవచించినాఁడు. 'నోవాలి'సనువాఁడు రొమాంటిక్ కవులలో ముఖ్యుఁడై ప్రేమగాథల నసంఖ్యాకములుగాఁ జిత్రించి తనివిదీరక లోకోత్తర సౌందర్యమునకై యఱ్ఱు జాచినాఁడు. తుదకీ లోకమందు పాక్షికమైన సౌందర్యమే పొడగట్టునని విసువు జెందినాఁడు. ఈ విధముగా జర్మనీ సాహిత్యములో భావచేతన ముద్భవించినది.

రూసో ఫ్రాన్సుదేశములో సాంఘిక రాజకీయవేత్త యగు మనీషి. ఇతఁడు స్వాతంత్ర్యోద్యమమును ప్రబోధించినాఁడు. ఈతని ప్రభావమే జర్మనీ స్వతంత్ర గీతముల కున్నట్లు కన్పించును. రూసో సాహితీ విప్లవమును దెచ్చిపెట్టినాఁడు. పూర్వ సాహిత్య సూత్రముల మీఁద సంపూర్ణముగాఁ దిరస్కారభావము రేకెత్తించినాఁడు; నిర్మానుష్యమైన ప్రకృతి నారాధించినాఁడు; కావున మానవులపై జుగుప్స యభివృద్ధి జెందినట్లు స్పష్టమగుచున్నది. రూసో వలననే సాహిత్యములో, మతములో ధర్మచ్యుతి కలిగినది. ఈ భావోద్యమమునకు బాగుగా దోహదమిచ్చినవాఁడు రూసో యనవలెను. ఇతఁడే

---

1. The driving force is romantic, the goal is classic: the result is cr aims to be classic, the creative art is romantic. —*Encyclopeadia of Social Sciences.*

భావచేతనమునకుఁ బ్రవక్త. ఆ దినములలో రూసోను విప్లవ కారునిగాఁ బరిగణించినా రనిన నాశ్చర్యముగాదు.

క్రమముగా నింగ్లాండు దేశమునకీ గాలి సోకినది. ఆ సాహిత్యములో స్పష్టముగా నీ మార్గానుయాయు లనేకులు కన్పించుచున్నారు. కీట్సు, బైరన్, షెల్లీలలో నీ భావచేతనము మూర్తీభవించినది.[1] వీరు ప్రణయకవిత్వమును వ్రాసినారు. అసభ్యశృంగారము సైతము వర్ణించినారు. బైరన్ నియమోల్లంఘన మొనర్చుటలో దిట్ట; అతని కవిత్వమే దీనికి సాక్ష్యము. సంఘములో విశృంఖల విహార మొనర్చి స్వతంత్ర జీవితమును గడపి గర్వించినాఁడు. కాలిరిడ్జి, వర్డ్సువర్తులుకూడ వీరిలోఁ బరిగణింపఁదగినవారు. తరువాత వచ్చినవారిలో స్విన్బర్న్ పైవారి యంశలన్నియు గ్రహించి కవితావ్యాపారము సాగించినాఁడు.

ఈ విధముగానే భావోద్యమము ప్రతి దేశవాఙ్మయములో నుదయించినది. ప్రాచీన ధర్మముల నుల్లంఘించుట, ఛందోవ్యాకరణ నియమముల నతిక్రమించుట, స్వేచ్ఛాకాంక్ష, ప్రణయోపాసనము, ప్రకృతిపరిశీలనము, అహంకారము, మనస్తత్వ చిత్రణము, పతితోద్ధరణము, ఆత్మభావవ్యక్తీకరణము లనునవి యీ భావోద్యమముయొక్క ప్రధాన

---

1 The romantic poets look into themselves, seeking in their own lives for strange sensations...

In the poetry of all of them, there is a sense of wonder, of life seen with new sensibilities and fresh vision.

—*B. Ifor Evans.*

సూత్రములని తెలియును.[1] ఈ యుద్యమము సాహిత్యము నొక విలక్షణమైన నూత్న మార్గమును బట్టించినది.

ఆంధ్ర సాహిత్యములో సైత మీ విధమైన కవిత యీ యిరువదవ శతాబ్దపుఁ బ్రథమ సంవత్సరములలో నంకురించినది. ఆంగ్లకవుల రచనలు విద్యాప్రణాళికలలో స్థానము గొన్నవి. తప్పనిసరిగా నాంధ్ర విద్యార్థులు వానిని పఠించినారు. తత్ఫలిత ముగా వీరికి నాంగ్ల భావకవు లభిమానులైనారు. మన సాహిత్యములో నట్టి యాత్మపరమైన కవిత లేదని గుర్తించినారు. ఆంగ్లవిద్యా ప్రభావమువలనఁ బాశ్చాత్య వేషముపై వారి యాచార వ్యవహారములమీఁదఁ బ్రీతి జనించినది. సంఘములోఁ గూడ మార్పు వచ్చినది. స్త్రీవిద్య కారణముగ సహవిద్య వచ్చినది. అతఃపూర్వము లేని నూతన సన్నివేశములు సంఘ వ్యవహారములోఁ దారసిల్లినవి. వీనికిఁదోడు విద్యార్థుల వయసు తోడైనది.[2] యువకవులు 'స్వానుభవ భావ్యముల' చెప్పఁ దొడఁగినారు. 'ఆంగ్ల విద్యాభ్యాసకుల కేవల హృదయచ్ఛాయ లకు స్వరూప వైచిత్రి నిర్మింపక విడువరా' దనుకొనినారు. అంతకుఁబూర్వము మన సాహిత్యములోఁగవి ఉత్తమపురుషలోఁ గవిత చెప్పలేదు. ఈ నూతన భావోద్యమము కారణముగాఁ గవి ప్రత్యక్షుఁడైనాఁడు. ఆత్మప్రణయమే కథావస్తువైనది.

---

1. ఈ క్రింది వచనము గమనింపఁదగినది:

One point seems to be significant, namely, that the classical poets care for *rasa* or sentiment where as the moderns care for *bhava* or emotion, — *Dr. P. T. Raju.*

2. చూ. "ఆధునిక కవిత్వము : ప్రేమ" 'ఆంధ్రశ్రీ' అను సంచికలోని వేమూరు వేంకట రామనాథముగారి వ్యాసము.

ఇందు విప్రలంభమే కాని సంయోగమున కవకాశమే కానరాదు. ప్రణయోద్దీపన సామగ్రిలోఁ జేరుచున్న కోకిల, సముద్రతీరము, ఉద్యానము, శరద్రాత్రులు మున్నగునవి వారి వర్ణనమున కాస్పదమైనవి. పురాణములవలెఁ గథను జెప్పుట క్రమ క్రమముగా సన్నగిలిపోయి, ప్రబంధములలో వలె శబ్దాడంబరము, సన్నివేశకల్పనము, పాత్రచిత్రణము మొదలైన వానికి ప్రాధాన్యము తగ్గిపోయి, కేవల మొక్క క్షణములోఁ గలిగిన యాత్మానుభవమును జక్కని భావముతో మేళవించి యుద్వేగముతోఁ జెప్పుట నవ్యకవితా లక్షణ మైనది. సంఘములోని స్వేచ్ఛాప్రవృత్తితో పాటు కవితలోఁ గూడ స్వేచ్ఛాకాంక్ష పొడమినది; గానయోగ్యమైన మాత్రాఛందమునకు గౌరవము హెచ్చినది. అడుగడుగునకుఁ బ్రకృతి ప్రబోధలను నవ్యులు గ్రహింపుచు వచ్చిరి. [1] గిడుగు రామమూర్తి పంతుల వారి వ్యావహారిక భాషావాదము వచ్చి నియమోల్లంఘనమందత్యంత కుతూహలముగల నవ్యులకుఁ బెన్నిధివలె సాక్షాత్కరించినది. ఇన్ని లక్షణములతో నభినవకవిత మన సాహిత్యములోఁ గూడ స్థితిని గొన్నది.

1. "Nature is no temp'ress She is a holy teacher" అనెడి బిసెంటు వాక్యములపై గౌరవమును జూపినారు నవ్యులు.

భావకవిత్వమును గూర్చి భావకవిని గూర్చి శ్రీ రాయప్రోలు వారి వచనమును గ్రహింపుడు :

"వస్తు సంవరణమందు భావకవికి తన స్వానుభవమే యధికరణము. పూర్వ వాఙ్మయమందు లేదని వదల నక్కరలేదు. నాయికానాయకులను ఆలంకారికుల లక్షణము లనుకూలించునా ప్రతికూలించునా యని విచారించ నవసరము లేదు. ... ... ... ...

భావకవిత్వమందు స్త్రీ మాతృపీఠమునం దాసీనురాలగును. కవి కాముకుని.

నవ్యకవితా ప్రభాతకాంతు లాంధ్రదేశమున మొట్ట మొదట తిరుపతి వేంకటకవులపైఁ బడినవి. కాని వాని ప్రభావము వారిని సంపూర్ణముగా లోఁగొనలేదు. 'ప్రాచీనమార్గమునకు భరతవాక్యము, నవ్యమార్గమునకు నాందీవాక్యము, వీరిలో శ్రుతిగొన్నవని తెలియుచున్నవి. తరువాత నూతన భావచేతనము సమగ్రముగా వారి శిష్యులలోఁ గల్గినదని చెప్పవచ్చును. రాయప్రోలు సుబ్బారావు, గురజాడ అప్పారావు గార లీ మార్గమునకుఁ దెలుఁగుదేశములోఁ బ్రవర్తకులనఁ జెల్లును. ఈ విధమైన కవితను 'అభినవ కవిత' అనినారు. వీరిరువురి కవితలోఁ బైఁ జెప్పఁబడిన లక్షణము లన్నియు ద్యోతిలును. రాయప్రోలువారి[1] 'లలిత' (1909), 'తృణకంకణము' (1912) లభినవ కవితకు సంపూర్ణోదాహరణములు. భావ వస్తురచనలలో మార్పుగాన్పించినది. అదే కాలములో కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారలుకూడ నా ధోరణిలో రచనము సల్పిరి. అటుపిమ్మట సాహితీ సమితి ప్రథమ

వలెఁ గామించక తల్లివలెఁ దగ్గఱకుఁ బోవును. భావకవి ప్రకృతి నెల్లప్పుడును పూజ్యబుద్ధితో సమీపించును. స్థూలవస్తు భ్రాంతితోఁ బైఁబడఁడు. తనకు ఇష్టదేవత దేశము. అతఁడు ఆస్తికులవలె ఆత్మగతినే ప్రమాణముగా నంగీకరించుచున్నాఁడు. అంతస్సున్న సుస్పందముగాక కవితాదర్శనము కాదని భావకవి విశ్వాసము. అందుచేత శబ్దప్రయోగమందును, రూపకల్పనమందును కూడ నతఁడు ఆత్మపరతంత్రుఁడు కాని విధిలేదు. హృదయాకాశమందు విహరించు శబ్దవిహంగము ఈ యనుభవ విన్యాసమునే పదచాలనమందును స్వరకల్పనమందును ప్రదర్శించుచున్నది.

—అభినవాంధ్ర కవి పండిత సమ్మేళనములో నధ్యక్షోపన్యాసము.

1. 'అభినవ కవితా మండలి' అని పెట్టి నవ్యకావ్యములను రాయప్రోలువారు తిరువల్లిక్కేణి - మద్రాసునుండి వరుసగాఁ బ్రచురించినారు.

సభ్యులు[1] పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, దువ్వూరి రామిరెడ్డి, అబ్బూరి రామకృష్ణరావు, మంగిపూడి వెంకటశర్మ, అడివి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావుగారలు మొదలైనవారు నూత్న భావచేతనకు లోనై రచనలు సాగించినారు.

ఆంగ్లసాహిత్యములోని షెల్లీ, కీట్సు, బైరన్ మొదలైన కవుల రొమాంటిక్ రచనల ప్రభావము ప్రత్యక్షముగనో, పరోక్షముగనో వీరి యందఱిపై పడినట్లు తెలియుచున్నది. అనాదిగా నాంధ్రసాహిత్యముపై సంస్కృతప్రభావమే మిక్కుటముగా నుండుటచేఁ బ్రథమదినములలో సంప్రదాయజ్ఞులు, లాక్షణికులు నైన పండితులు ఈ నూతనోద్యమమునకు వెఱగందిరి. ముఖ్యముగా కథావస్తువులోని వైచిత్రి, భావములోని స్వేచ్ఛ, రచనములో ఛందోలంకార వ్యాకరణ నియమోల్లంఘనము వీరిని

1. 'సాహితీ సమితి' అను పేర నొక సంస్థ శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారి సభాపతిత్వము క్రింద 1919 ప్రాంతములో స్థాపింపఁబడినది. నవ్య సాహిత్యమునకీ సమితిసభ్యులు చేసిన కృషియెన్నఁదగినది. నలుమూలలనున్న ప్రతిభావంతులఁ జేరదీసి, వారివారి కవితాప్రయత్నములఁ బరిశీలించి వాని నేకముఖముగా 'సాహితి'— 'సఖి' అను పత్రికలద్వారా మనల కందించిన శాస్త్రిగారు ప్రశంసనీయులు. నవ్యసాహిత్యప్రతిష్ఠాపనమునకు వీరు ముఖ్య కారకులై తదభ్యుదయమునకుఁ జాల పాటుపడిరి. 1920 తరువాత మొన్న మొన్నటివరకు శాస్త్రిగారి ప్రభావములేని కవయితగాని రచనముగాని తెలుగుసీమలో రాలేదనిన నతిశయోక్తి కానేరదు.

It can be said without fear of exageration that there is no modern writer in Telugu land who has not been influenced by Sastry to some extent.

— *Nori*

—*Triveni - March 1938*

కలంచివేసినవి. వీరి రచనలవలన నాంధ్రసాహిత్యము మైలపడి నట్లు భావించినారు. వ్యుత్పన్నత లేనివారని నవ్యుల నిందించి నారు. కాని పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, శివశంకర శాస్త్రిగారలు మొదలైన పండితు లీ భావోద్యమమునకు బాసటై నిలిచి నిలువఁ ద్రొక్కినారని చెప్పవలెను.

ఈ యభినవ కవితామార్గమునకుఁ దరువాత కాలములో ననుయాయులు ప్రబలినారు[1]. ఈనాటికిని యువకవు లనేకు లీ పద్ధతినే యనుసరించి రచనచేయుచున్నారు. సాహితీ సమితి యనేక యువసముతులకు మార్గదర్శకమైనది. ఇంతయేల? అభినవకవిత యాంధ్రదేశముయొక్క మూలమూలల వ్యాప్తి

సాహితీసమితి ప్రథమసభ్యులలో చింతా దీక్షితులు, మునిమాణిక్యం నరసింహా రావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, శ్రీనివాస శిరోమణిగారలు కథారచ యితలుగాను; దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, కొమాండూరి కృష్ణమాచార్యులు, చామర్తి రాజశేఖరరావు, పూర్ణశర్మ, వెంకటసుబ్బయ్య, కోపల్లె శివకామేశ్వరరావుగారలు ఖండకావ్యకర్తలుగాను; నోరి నరసింహశాస్త్రి, శివశంకరశాస్త్రిగారలు కావ్యకర్తలుగానే కాక ప్రధానముగా నాటికాకర్తలుగాను, నవలానిర్మాతలుగాను ప్రఖ్యాతి వడసి నారు. తరువాత సభ్యులలో అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ గారలు నవలాకర్తలుగా నుత్తమస్థానము నాక్రమించినారు. ఈ విధముగా ఖండకావ్యము, కథానిక, నాటిక, నవల మొదలైన నూత్న ప్రక్రియలను సాధించి తరువాతవారికి మార్గదర్శకులై సాహితీసమితి కవులు ప్రవర్తించినట్లు గమనింపఁగలము. నూత్న సభ్యులతో నీ సంస్థ వర్ధిల్లుచున్నది.

1. వేంకట పార్వతీశ్వరకవులు, పెనుమర్తి సోదరులు, శ్రీనివాస సోదరులు, సన్నిధానం పితృపుత్రులు, భారతుల, పద్యారం, పూడిపెద్ది, పువ్వాడ, అత్తిలి, అధికార్ల, అంబడిపూడి, వావిలాల, జంధ్యాల, కృత్తివాసతీర్థులు, గణపతిశాస్త్రి, సహదేవ, సామవేదం, సంపత్, శివరాం, సింగరాచార్య,

జెందిన దనిన నతిశయోక్తి కాదు. ఈ యుద్యమము నిలువఁ ద్రొక్కికొనిన దని చెప్పుట కింతకంటె నేమి దృష్టాంతము కావలెను !

ఆంధ్రభాషలో భావోద్యమము కారణముగా బయలు దేరిన సాహిత్య ప్రవాహమును బరిశీలించినచో నవి వివిధ మార్గములలోఁ బ్రవహించినట్లు తెలిసికొందుము. ఆయా మార్గ ములకు ద్రష్టలు లేకపోలేదు. ఒక్కొక్క మార్గమున కనుచరు లెప్పుడు బయలుదేరుదురో అప్పటి కవి నిలకడ జెందినట్లు గ్రహింపవలెను. నవ్యాంధ్రకవిత్వములోఁ బొడసూపుచున్న భిన్నమార్గముల నీ క్రింది విధముగా నెన్నవచ్చును :

1. ఇంగ్లీషు కవిత్వమున కనువాదములు.
2. ఆంధ్రుల ప్రాచీన ప్రాభవమును తలఁచి ప్రబోధించు రచనములు.

---

మల్లవరపు, జమదగ్ని, పైడిపాటి, పుట్టపర్తి, రామనాథం, అయాచితుల, ఇంద్రకంటి, మాధవశర్మ, రజనీ, పిల్లలమఱ్ఱి, గాదిరాజు, నండూరు, ఎక్కిరాల, దిగుమర్తి, సింగరాజు, బాలగంగాధర తిలక్, పాలెపు వెంకట రత్నం, కుమార రాఘవశాస్త్రి, నాళం, బొడ్డు, నాయని, తుమ్మల, ఏటుకూరి, వట్టికొండ, జి. వి. కృష్ణరావు, జాషువా, ఫరీదు, రామానుజరావు, జమ్మలమడక సోదరులు, మేడిపల్లి, చలమచర్ల, బూర్గుల, భాగీ మొదలైనవారు నవ్యకవులలో కొందఱు.

స్త్రీలలో స్థానాపతి రుక్మిణమ్మ, విశ్వసుందరమ్మ, విశాలాక్షి, బంగారమ్మ, సీతాకుమారి, ఇందుమతీదేవి, లక్ష్మీకాంతమ్మ, సరస్వతీదేవి, కృష్ణకుమారి మొదలైనవా రెన్నదగిన కవయిత్రులు.

3. ఆత్మపరమగు ప్రణయమును చిత్రించు కవిత ; స్త్రీ వ్యక్తిని గౌరవించు రచనములు.
4. ఆంధ్రులకు సన్నిహితములగు నాచార వ్యవహారములను వర్ణించు కవిత.
5. ఆత్మీయ భావములకుఁ బ్రకృతి యందలి రహస్యములను లగించిన రచనము ; ఆర్ష ధర్మ ప్రతిపాదనము సూత్రముగా నున్న కవిత.
6. భారతదేశ స్వాతంత్ర్య రక్తితోఁ గూడిన రచనములు.
7. సంఘ సంస్కారము నిమిత్తముగా వచ్చిన రచనములు.
8. పతితోద్ధరణమే సూత్రముగా నున్న కవిత.
9. ఉత్తమ మానవత్వసిద్ధికి సత్యాహింసలు సూత్రములుగా నున్న కవిత్వము.
10. లౌకిక సౌఖ్యమే ప్రధాన ధర్మమని ప్రబోధించు రచనములు.

ఇఁక నీవిధమైన దశవిధ మార్గములకుఁ బ్రవర్తక లనఁదగు వారిని గూర్చి విచారింతము :

మొదటి మూఁడు మార్గములకును రాయప్రోలువారు ప్రవర్తలని చెప్పుకొనవలెను. ఆంగ్లములోని 'హెర్మిట్' అను కావ్యమును నవ్యకవితా సరణిలో 'లలిత' అను పేరుతో ననువదించి రాయప్రోలువారు ప్రథమ మార్గమునకు శ్రీకారము జుట్టినారు. అదిగాక యాంధ్ర దిగ్జయ స్తంభమును జ్ఞప్తికిఁ

1. గంటి జోగి సోమయాజులు గారు 'రామచంద్రుని హంపి యాత్ర' అనుపేర నొక నవ్యకావ్యము రచించిరి. సంస్కృతాంగ్ల సభ్యతల ప్రభావము రచనమందంతటను గోచరించుచున్నది. దీనిని గుర్తించుటకు సంస్కృతాంగ్ల రచనల తోడి పరిచయము పాఠకుని కావశ్య మగును.

నెచ్చి తిరిగి ప్రతిష్ఠింపఁజూచిన ప్రథమాంధ్ర నవ్యకవికూడ నాయనే.[1] అటు పిమ్మటనే హంపీక్షేత్రము[2], ఆంధ్రప్రశస్తి, రాష్ట్రగానము[3], ఆంధ్ర తేజము మొదలైన రచనలు వచ్చినవి, ప్రణయపరములైన భావముల నూహించి యందు వినూత్న మార్గమును సృజించిన నవ్యుఁడు కూడ రాయప్రోలువారే. నవ్యకవితలో నియమోల్లంఘన మొక సూత్రముగా నెన్నితిమి. రాయప్రోలు సుబ్బరాయకవి శృంగార రసమును గూర్చి ప్రత్యేక సిద్ధాంతమును గల్పింపఁ జూచినాఁడు. శృంగార రసీకరణమునకు నాయికానాయకులకు మధ్యనున్న మోహమే

1. అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాఁడు
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగాఁ
బలు శస్త్రశాలలు నిలుపునాఁడు
విద్యానగర రాజవీథులఁ గవితకు
పెండ్లిపందిళ్లు కప్పించునాఁడు
పాటూన్రికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించునాఁడు
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్యదీక్షా సుఖస్ఫూర్తి తీవరించె
నా మహావేశ మరించి యాంధ్రులార
చల్లఁడాంధ్ర లోకమున నడతలు నేడు

2. శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలో
పల గుడి గోపురంబులు సభాస్థలులైనవి కొండముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగిపోయినదాంధ్ర వసుంధరాధి పో
జ్జ్వల విజయప్రతాపరభసం బొక స్వప్నకథావశేషమై

3. ఒకనాఁడాంధ్ర ధరావిరోధి నరపాలోదగ్ర సేనాశిరః
ప్రకరంబుల్ విదళించి తద్రుధిర ధారానిర్ఝర స్నాతులై
కరుబంటంబుల మీఁదలెత్తిన పతాకన్ నేఁడు చిత్తంబులో
నొకమారెంచుఁడు రక్తమగ్ని సఖమై యుప్పొంగి ఘూర్ణిల్లఁగన్.

స్థాయిభావము నుండనక్కర లేదనియు సోదరీ సోదరుల మధ్య నున్నట్టి వాత్సల్యము, స్వామి సేవకుల మధ్యనున్న భక్తియు స్థాయిభావము లగుట కభ్యంతరము కల్పింపరాదని భావించి నాఁడు.[1] ఆయన కావ్యము లీ సూత్రమున కుదాహరణము లగును. తమోగుణము తోడను రజోగుణముతోడ నున్న మోహము లేక కామము శోధితమైనగాని పవిత్రమైన ప్రేమగాఁ బరిణమింపదు. అదియే యుత్తమమైన శుద్ధసత్త్వ ప్రేమ యగును. ఆంగ్లములోని 'Love is Divine' అనునది భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడను సూక్తియు నట్టి శుద్ధ ప్రేమకే వర్తించునవి. అందువలననే మాలిన్య రహితమైన ప్రణయభావము ప్రణవస్థితికిఁ దీసికొనిపోవునను విశ్వాసము రాయప్రోలు వారి కున్నట్లు కనుగొందుము. ఈ విధముగా మొదటి మూఁడు మార్గములకు సుబ్బారావుగారు ప్రవక్తలైనారు.

ఆంధ్రులకు జాతీయములైన యాచారవ్యవహారములకుఁ జక్కని రూపు కట్టుటకు బసవరాజు అప్పారాయకవి మొదట ప్రయత్నించినాఁడు. సామాన్యములైన సంఘటనల కుదాత్తత కల్పించి కవితాభావమును బొదిగి రచింపఁగల సమర్థుఁడు బసవరాజుకవి. ఆయన వ్రాసిన నాగులచవితి[2] వటపత్రశాయి

1. కులశుభాంగీ వయో ధీర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి;
సాత్త్వికప్రేమ కోశ పేశలము లయిన
వత్సలామృత రుచులను వలచె నేఁడు.— రమ్యాలోకము.

2. ఆటుకొండ యిటుకొండ ఆరెంటినడుమ । నాగుల్లకొండలో నాట్యమాడేటి దివ్యసుందరనాగ దేహియన్నాము, కనిపెట్టి మమ్మెపుడు కాపాడవోయి! నాగుల్లచవితికి నాగేంద్ర, నీకు । పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

మొదలైనవి చక్కని యుదాహరణములు. ఈ భావమును పెంపొందింపఁ జేసినవారు లేకపోలేరు. శ్రీ కొంపెల్లి ఆంజనేయులు వ్రాసిన 'పెండ్లికూతురు'[1] - శ్రీ బొడ్డు బాపిరాజు వ్రాసిన 'అప్పగింతలు' - విశ్వనాథవారి 'మంగళనోము' - రాయప్రోలువారి 'సంక్రాంతి' - బాపిరాజుగారి 'గంగిరెద్దు'[2] - పిల్లలమఱ్ఱివారి 'గొబ్బిపండుగ-సంక్రాంతి' - కవికొండలవారి 'కోతలపాట' మొదలైనవి యీ శ్రేణికి చెందినవే. ఈవిధమైన హృదయంగమమైన జాతీయ భావమునకు (నేడెవరు నంగీకరింపరేమో!) బసవరాజువారి ప్రభావము లేకపోలేదని తలంతును.

నవ్యకవులు ముఖ్యముగా ప్రకృత్యుపాసకులు. ఆత్మ భావమునకుఁ బ్రకృతిలోనున్న గుప్తభావములను జోడింపఁగల ప్రతిభ, నవ్యకవులలో చాలవఱ కున్నట్లు ద్యోతిలును. ప్రకృతియే నవ్యులలో నుద్రేకము గూర్చి కవితావేశమునకు బాధ్యత వహించుచున్నది. ప్రకృతిలోని వస్తువుల రెంటిని గైకొని వానిని కావ్యములో నాయికా నాయకులు రూపకకల్పనముచేసి చిత్రించుటలోఁ బ్రధానుఁడు రామరాజ భూష

1. ద్వాదశబాలికల్ తలుపుదగ్గర
బాటలువాడు పెద్దముత్తైదులు, భర్త పే
రడిగినప్పుడు తీగయొలుంగు మొగతన్
బేదవడంగ 'వంతుమన పెండ్లికుమారుని' దని
నీదు లజ్జాదరహాస చంద్రికలు శాశ్వతమై
వెదజల్లు గాన్పుతన్.

2. ప్రభువుగారికీ దణ్ణంపెట్టూ
పాదంవచ్చి భక్తిని పెట్టూ
పట్టుశాలువలు కప్పెదరంటూ
కాసులు మువ్వలు కట్టెదరంటూ
డూ డూ డూ డూ గుమ్మెంకన్నా!

ఖుఁడు. అతని వసుచరిత్రమే యిందుకొక ఉదాహరణము. నవ్యపథములో నట్టి భావమునే గేయ మర్యాదలలో నడిపించిన విశ్వనాథవారు గణనీయులు. ప్రకృత్యుపాసనమున కత్యంత స్థానము గల్పింపఁజూచిన నవ్యకవులలో విశ్వనాథవారు ప్రథములు.[1] రవీంద్రుని కవిత్వములో సైతము ప్రకృతి యత్యున్నత స్థానముగొన్నట్లు కనుగొందుము. ప్రకృతి రహస్యములతో నాత్మభావమును సమన్వయించుటలో నున్నది ప్రతిభ. విశ్వనాథవారి 'కిన్నెరసాని పాటలు' పై సిద్ధాంతమును స్థిరీకరించు రచనము. వీరు వ్రాసిన 'కోకిలమ్మ పెండ్లి' కూడ నట్టి రచనమే. కాని యందన్యాపదేశముగఁ జక్కని యుపదేశమిచ్చుటకలదు. సంప్రదాయములు[2] ఆర్షధర్మములు వీరికి ననుల్లంఘనీయములు. వీని రచనలన్నియు నేవిధమైన యార్షధర్మ ప్రతిపాదనా సమర్థములైన ట్లగుపించును. నవ్య కవిత్వములో నిట్టి ధర్మనిష్ఠ కీతఁడే యుపదేష్టయని చెప్పవలెను. కాబట్టి నవ్యకవిత్వములో వీరిది విలక్షణమైన మార్గమునకుఁ జెందిన భావముగా నెన్నవచ్చును.

---

1. తూర్పులో తెల్లనై తోచిన దుమ్ముకాంత
తొలిమావి లేబూత దూసెను పికకాంత
తలలపై రతనాలు తళతళా మెరసేటి
నల్లత్రాచులు దూకి నాట్యమాడేటట్లు
మెరసింది కిన్నెరా ఒడ్డుల్లు
ఒరసింది కిన్నెరా

2. లేతబుగ్గలు కొరికేస్తే
ఆతగాళ్ళతో యేమిగాని
తాతతాతలనాటి కతలూ
తప్పిపోస్తానోయ్!

కవిత్వములోఁ గాలానుగతముగా మార్పులు వచ్చుచున్నవో సంఘములో సైత మట్టులనే క్రమపరిణామము కన్పించుచున్నది. ముఖ్యముగా నవ్యులలో సంఘ సంస్కారమును సూత్రముగాఁ బెట్టుకొని కృషి చేసినవారు వీరేశలింగము పంతులు. వీ రుపన్యాసములతోడను, వచన రచనలతోడను దత్ప్రచారమునకుఁ బూనుకొనిరి గాని కవిత్వమును వాహికగా గ్రహింపరైరి. దీనిని గురజాడకవి పూరించినాఁడు. నవ్య కవితా పద్ధతులతో సంఘసంస్కరణాభిప్రాయమును వ్యక్తీకరింపఁ బ్రయత్నించిన ప్రథమ నవ్యకవి గురజాడ కవియే. నూత్న గేయ ఛందస్సును సృజించి ముత్యాల సరములను రచించినాఁడు. వీనిని జదివినవారికిఁ బైభావము తెలియకపోదు. ఇది గాక గురజాడకవి మఱియొక మార్గమునకును గురువని చెప్పవలెను. భారతదేశము నొన్నటివఱకుఁ బారతంత్ర్యమునకు గుఱియైనది గదా! దీనికిఁ జకితుఁడుగాని కవి భారతదేశమున నుండ రాదు. హిందీభాషాకవులలోను, వంగభాషాకవులలోను బైభావమునకుఁ జకితులై స్వాతంత్ర్య గీతముల నాలపించి ప్రజలఁ బ్రబోధింపఁజూచినవా రనేకు లున్నారు. మన భాషాకవులలో నంతగా దీక్షబూనినవా రరుదుగా నున్నారని చెప్పక తీరదు. ఇట్టివారిలో గురజాడకవి యెన్నఁదగినవాఁడు. మతవైషమ్యములఁ దొలఁగించి స్వాతంత్ర్యకాంక్ష గలిగించుటకై యాతఁడు ప్రబోధించినాఁడు.[1] దేశ స్వాతంత్ర్యోద్యమములోఁ బాల్గొన్న

1. చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడువవలెనోయ్
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్ !

కవులలో గరిమెళ్ళ సత్యనారాయణ[1], మంగిపూడి వెంకట శర్మ, బలిజేపల్లి లక్ష్మీకాంతము,[2] శివశంకరశాస్త్రి గారలు మున్నగువా రున్నారు. వీరిలో గురజాడవారి గీతములకన్న గరిమెళ్ళవారి పాటలకుఁ బ్రచార మింతింతని చెప్పలేము. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిని కొలదిగా నీ భావము నంచలింపఁజేసినట్లున్నది. కాని యీభావమునకుఁ బుష్టిచేకూర్చిన నవ్యులు కన్పించుట లేదనిన నది సత్యదూరముగాదు.

---

1. దండాలండోయ్, నేముండలేమండోయ్ బాబు !
ఉప్పుకును పన్ను బాబు
పప్పుకును పన్ను బాబు
కొప్పుకాస్త దేవుడికి
ఒప్పుకొంటె పన్ను బాబు — దండాలండోయ్ !
దండాలు దండాలు భరతమాతా — అవి
అందుకొని దీవించు భరతమాతా
రెండునందలేండ్ల కింద భరతమాతా — అల్ల
కుంపినోడు దిగినాడె భరతమాతా
దిగియూరకున్నాడ భరతమాతా—మాకు
చిప్పచేతి కిచ్చాడె భరతమాతా!

2. అంగడుల నన్నియున్నవి యల్లనోట
గడ్డ యనుటకుఁ దార్కాణ గానరయ్యె
భరతవర్షంబు నా కల్పతరువె కాని
యనుభవము మాత్ర మొరుల పాలయ్యె నకట!

3. నీచపు దాస్యవృత్తి మన నేరని శూరత
మాతృదేశ సేవాచరణమ్ము నం
దసువు లర్పణ సేసినవారి పార్థివశ్రీ
చెలువారుచోట తదస్ప్రగుచులన్ వికసించి
వాసనల్ వీచుచు రాలిపోవగవలెం
దమదాత్మ సమాధి వృత్తికన్ !

ఈనవ్య కవిత్వమునకుఁ బూర్వము కావ్యరచనలో నాయికా నాయకులనుగా నుదాత్తులైనవారిని- అంబర చుంబిత శిఖరములుగల సౌధములలో హంసతూలికా తల్పములమీఁద కాలముబుచ్చు భోగులను- ఏరుకొనుట యాచారమైనది. దీని కపవాదములుగాఁగొన్ని రచనలు వచ్చినవి. పల్లీయులను నాయికా నాయకులుగా నేల గ్రహింపరాదను భావముకలిగి శ్రీ నండూరి సుబ్బారావు ఎంకి-నాయుడుబావలను సృజించినారు. ఈవిధముగా పల్లీయుల హృదయసాగరములలో దాగియున్న భావరత్నములను వెలికిఁదీసికొనివచ్చిన నవ్యుఁడు నండూరికవి. పవిత్ర ప్రణయ ధర్మము పామరులకు నైత మున్నట్లు చిత్రించి దాని బోధించుటకై యీకవి ప్రయత్నించినాఁడు.[2] ఉదాత్తులకు - మధ్యములకు - పామరులకు

---

1 అంతకు పూర్వము ప్రాచీనపదకవిత్వముమీఁద శ్రీ పురాణం సూరి శాస్త్రిలు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలు-శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలు మొదలైన సహృదయులు పత్రికలలో నాదర పూర్వకముగా విమర్శలు జరుపుచు వచ్చుటవలనఁ బ్రాచీనపదములను బ్రచురించుటవలన నండూరివారికి నావిధమైన రచన చేయుటకుఁ జక్కని రహదారి యేర్పడియుండును. — శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ.

2. ఆనాటి నావోడు సెందురూడా
అలిగిరాలేదోయి సెందురూడా
యెంకి ! మనమిద్దరమె యెవ్వరోద్దన్నాడు
యీసేలు యీతోట లింక నీవన్నాడు-
మాటాడు తుండంగ సెందురూడా
మంచిదా పోయేవు సెందురూడా
'కలకాల మీదినమె నిలుసుమన' కన్నాడు
గాలికై నా తాను కౌగిలీనన్నాడు—

నుత్తమధర్మములఁ బ్రబోధించుటయును, సగటు సామాన్యజీవితముల గడపుటకై సంస్కరించుటయును గని ప్రయత్నించుచుండును గదా! పామరుల కభ్యున్నతి కలిగించుటకై పూనుకొన్నవారరుదుగా నున్నారు. అట్టి కొలఁదివారిలో మార్గదర్శి శ్రీ నండూరి కవియని చెప్పవలెను. ఈమార్గము ననుసరించిన వారిలో శ్రీ అడవి బాపిరాజు ఎన్నఁదగినవారు; ఈయన యీభావమునకుఁ జక్కని ప్రచారము చేకూర్చినాఁడు. శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రి వ్రాసిన గొల్లపదములు— పిల్లలమఱ్ఱివారి 'కాపు పాటలు'— శ్రీ భాగి నారాయణమూర్తి వ్రాసిన 'లంబాడీపిల్ల' శ్రీ గోఖలే వ్రాసిన 'మూగ జీవాలు' శ్రీ కొనకళ్ళ వెంకటరత్నము రచించిన 'బంగారు మామ'— శ్రీ కందుకూరి రామభద్రరావు వ్రాసిన వానిలోఁ గొన్ని—పైభావము నాశ్రయించినవే. ఈభావమునే పతితోద్ధరణమందురు. ఇట్లు నండూరికవి యొక ప్రత్యేక మార్గమునకు నాందిపెట్టినవాఁడైనాఁడు.

మానవజన్మ మనితరోత్తమమైనది. ఈ జగత్తులో నావరించిన మాయాతమస్సును మానవుఁడు తానార్జించు జ్ఞానముచేఁ బటాపంచలు చేసి పరబ్రహ్మము నెఱుఁగుటలో నుత్తమ సాధకుఁడు గావలెను. అరిషడ్వర్గముచేఁ బీడింపఁబడుచు మానవుఁడు తమోరాశినుండి తప్పించుకొనలేక పోవుచున్నాఁడు. ఇంద్రియ నిగ్రహ మొక్కమ్మడిగా లభించునదికాదు. మనసు రాగమునుండి విరాగమునకు మార్పుచెందుటకుఁ గ్రమసాధనము గావలయును. ఈక్రమ పరిణామములు కల్గుటకే చతుర్విధాశ్రమములు నియ

మితములైనవి. ముముక్షువులీ యాశ్రమములలో నియమముగా నుండి తత్తద్ధర్మముల యథాక్రమముగా నిర్వర్తింపవలెను.* మాయానృతమైన యీజగత్తున కావల నిల్వగల శక్తి యూరక లభించునా? అనాదిగా మన దేశములో నీసిద్ధాంతములు ప్రచారములో నున్నను వీనిపై నాదరము క్రమముగా నానాటికి క్షీణించుచు వచ్చినది. నవ్యులను సత్యాహింసలను సూత్రముగాఁ బెట్టుకొనిన బౌద్ధమతముపై దృష్టి పోసాగినది. బుద్ధదేవుని జీవితమునుండి కొన్ని కొన్ని సన్నివేశములఁ జిత్రించుటకు నవ్యకవులు గడఁగినారు. శ్రీ తిరుపతి వేంకట కవులు బుద్ధచరిత్ర వ్రాసినప్పటికి, నీవిధమైన భావమునకుఁ బ్రచారము దెచ్చినవారు శ్రీ పింగళి, కాటూరులు. వీరు వ్రాసిన 'సౌందరనందము' ప్రబంధపుఁ బోకడలుకలిగినను నవ్యకవితావాసన లేనిది కాకపోవుటచే నిట ప్రసక్తమాయెను. గురువుల భావములను శిష్యులు ప్రచారములోనికిఁ దెచ్చుట సంప్రదాయమే కదా! ఈ మార్గానుయాయులలో వేలూరి చంద్రశేఖరము, వేమూరి వేంకటరామనాథము, సాధనసమితి సభ్యులుముదిగొండ రాజలింగం, పన్యాలరంగనాథరావు, వేలూరి సోదరులు మొదలైనవారి నెన్నవలెను. శ్రీసన్నిధానము సూర్యనారాయణశాస్త్రిలుగూడ 'జాతక కథాగుచ్ఛము' వ్రాయుటచే నీ భావము వారికిని కల్గినదని చెప్పకతప్పదు. ఈ విధముగా

* కావున దుఃఖహేతువగు కాలము పై కొనిరాకమున్నె సౌ
ఖ్యావహయోగధారణకు యత్నమొనర్పఁగ నుత్సహించి మే
ల్కొవలెఁగాక, మన్మథవిలోల మనస్కుఁడై నింద్రియార్థ సం
సేవలొనర్పఁ జెల్లదది చేటునకున్ మొదలింటి హేతువౌ.

బౌద్ధమత ప్రభావము నవ్యకవులపై సంతగాఁ బడుటను శ్రీ పింగళి, కాటూర్ల 'సౌందరనందమే' కారకమని చెప్పవలెను. ఈ భావమునకుఁ బ్రచారకులై నూత్నమార్గ నిర్మాతలైనా రీ జంటకవులు !

భారతదేశము పాశ్చాత్య దేశములవలె లౌకిక చింత ముఖ్యముగాఁ గలది కాదు. మన దేశములో నే విషయమును గ్రహింపవలె నన్నను ముందుగా దేశ సంప్రదాయము నెఱుఁగ వలెను. ప్రధానముగా భారతదేశ మాధ్యాత్మిక తత్త్వము కలది. శరీరబలముకన్న మనోబలమును, సమాజమందలి గౌరవముకన్న స్వర్లోకములో గురుత్వమును, ఇంద్రియతుష్టికన్న నింద్రియ నిగ్రహమును, ప్రపంచ సౌఖ్యముకన్న పారలౌకికానందమును భారతీయు లనాదిగాఁ గాంక్షించుచు వచ్చినారు. పాపభీతియు, దైవభక్తియు మనవారిలో మిక్కుటములు. అట్లే మన భారతీయ సంప్రదాయములో 'రేపు' అను పదమునకు యోగ్యమైన స్థానమున్నది; స్వార్థముకన్న పరహితార్థము పాటుబడు వారు భారతీయులు. పాశ్చాత్య నాగరకతా సూత్రము లీ భావము లన్నిటికి వ్యతిరిక్తములు. అయినను మనకు వచ్చిన నూతన విద్యా పద్ధతులవలనఁ గ్రమముగాఁ బాశ్చాత్య సంప్రదాయముపై మమకారము సంక్రమింపఁ దొడఁగినది. లౌకిక చింత ప్రబలినది; 'రేపు' అను దానికై చింతించుట సభ్యతకు దూరమైనది ![1] ఇట్టి

1. Unborn to-morrow and dead yesterday
Why fret about them if to-day be sweet !
— Omer Khayyam.

భావమును సంపూర్ణముగాఁ జిత్రించిన కావ్యము మనకు గొప్ప మతగ్రంథమైనది. ఆ భావమును బరిపాలించిన పాశ్చాత్య సభ్యత మన కాదర్శమై నిలిచినది. ఈ భావము సంపూర్ణముగా నేటి విద్యావిధానముద్వారా మనలో నాటుకొని పోవుచున్నది; ఈ భావచిత్రణమువలన మన పార్థక్యమును గోల్పోవుచున్నట్లు గమనించుటలేదు. నవ్య కవులలో నీ భావమునకు లోనుగాని వారు లేరు. అయినను దీని ప్రచారకులలో శ్రీ దువ్వూరి కవి 'పానశాల' రచించి ప్రథముఁడైనాఁడు. ఆదిభట్ల నారాయణదాసు - రాయప్రోలువారు - మాధవపెద్ది వారు - చిలుకూరివారు - రామచంద్ర అప్పారావు - గారలు తద్భావ ప్రచారకులలోఁ జేరుదురు.

పల్లీయుల ప్రణయమును వర్ణించిన నండూరికవి భావములో నుదాత్తత యున్నదని తెలిసికొందుము. కృషీవలునిపై దృష్టి మరల్చి కవితాగానము సల్పిన నవ్యులలో దువ్వూరికవి ప్రధానుఁడని చెప్పవలెను. వీరగాథలనుగూడ వ్రాసి ప్రజల ప్రబోధింపఁజూచిన కొలఁదిమందిలో శ్రీ రామిరెడ్డి యొకఁడు. కట్టమంచివారు 'ముసలమ్మ మరణము' వ్రాసి దువ్వూరి కవికిఁ బూర్వమే యొక మార్గమున కుపదేష్టలైనారని తెలియుదుము. కట్టమంచివారి కావ్యము దువ్వూరికవిని దిద్దియుండనోపు! వీరగాథలపై దృష్టిమరలగాఁ బల్నాటివీరచరిత్ర జ్ఞప్తికివచ్చి 'నాయకురాలు' అను పేరుతోఁ గావ్యములు బయలుదేరినవి. చరిత్రప్రసిద్ధములైన వీరులయొక్కయు, వీరమాతలయొక్కయుఁ గథ లుపాదేయములై కావ్యత్వము

బొందుచున్నవి. ఆంధ్రులకు నేఁ డవిశిష్టమైన ప్రబోధమత్యావశ్యకమైనది. రాజ్యపాలకులై వర్తిలిన జాతీయులు నేఁడు వివిధముగా గుర్తింపలేని పరిస్థితిలో నుండుటచే, సత్ప్రేరణాభావముగల కావ్యము లెన్నేని సృజింపవలసిన కాలముగా నిది గన్పించుచున్నది. కాని జాతిపరములుగా—దేశపరములుగా నుత్తమ కావ్యముల నిర్మించుటలో మన నవ్య [illegible] వెనుకబడుచున్నారు.

ఇట్టి యభినవ కవిత్వము పాశ్చాత్యకవిత కనుకరణముగా బయలుదేరి తనదైన ప్రత్యేకత గడించుకొని భిన్నమార్గములందుఁ బొడసూపుచు నాంధ్రమున విలసిల్లుచున్నది. భావవస్తురచనలలో—ఛందోలంకారములలో—భాషలో—దృక్పథములో నన్నిట నవ్యత నలవఱచుకొని యభినవకవిత తెలుఁగువారికి సిద్ధమైనట్లు నిశిత పరిశీలనముపైఁ దెలిసికొందుము. ఈనాటి కిది యాంధ్రసాహితీచరిత్రలో నొక యధ్యాయమునను యోగ్యమైన స్థానమును గడించుట కర్హతకలిగి చెన్నొందుచున్నది! *

* శ్రీయుతులు కురుగంటి సీతారామ భట్టాచార్య, పిల్లలమర్రి వేంకట హనుమంతరావులు కలసి నిర్మించిన "నవ్యాంధ్ర సాహిత్యవీధుల"ను నుద్గ్రంథమీ విషయముపైఁ బ్రామాణిక గ్రంథము.

# రూపక వికాసము

## ౧

సాహిత్య మను పదము కావ్యపరమైనది. కావ్యము దృశ్య—శ్రవ్య భేదములచే ద్వివిధమైనది. దృశ్య కావ్యమునే "రూపక" మని లాక్షణికులు వ్యవహరించినారు. ధనంజయుని నిర్వచనము ప్రకారము నాట్య, రూప, రూపక మను పదములు దృశ్యకావ్యమునకుఁ జెల్లుచున్నవి. అవస్థానుకృతి నాట్యమనియు, నాట్యము దృశ్యంబగుట నది రూపకమైన దనియు, నటులయందుఁ బాత్ర సమారోపముచే వర్తిలునది గాన రూపకమైనదనియు, దశరూపక మందాతని సూత్రము. నేడీ మూఁడు పదములు మరుగున పడిపోయి నిత్యవ్యవహారములో నాటకమను పదము మాత్రము రూఢమైనది. కాని నాటక మనునది 'అపంచాంక మాదశాంక' మను ప్రత్యేక లక్షణముగల దశవిధ రూపకములలో నొకటిగా ధనంజయుఁడు పరిగణించినాఁడు. ఈనాడు వ్యవహరింపఁబడు రూపకములు పై లక్షణమున కవ్యాప్త్యతివ్యాప్తి దోషములకు గురియగునవే యనుట నిశ్చయము. కాని నాటకమను పదమును సామాన్య రూపక వాచకముగా గ్రహించుచున్నట్లు గమనించిన నే దోషమును బట్టదు.*

---

*ఈ విమర్శకు వ్రాతప్రతియందు 'రూపక' శబ్దమునే శీర్షికయం దుంచితిని.

సాహిత్యములో రూపక మున్నతస్థాన మాక్రమించు చున్నది. మన ప్రాచీన విద్యార్థి శబ్దముల పల్లించి, యమరగమాది నిఘంటువులఁ బుక్కిటఁబట్టి, కావ్యములఁ జదివిన పిమ్మటగాని నాటకములను జేపట్టుకుండెడివారు. అందుచేతనే 'నాటకాన్తంహి సాహిత్యమ్' అను సూక్తి వచ్చినది! అంతియేగాక మహాకవి కావ్యమును విచారించినచో శ్రవ్యకావ్య రచనమందు సాధన మొనర్చిన పిమ్మటనే దృశ్యకావ్య రచనమునకుఁ బూని నట్లు తెలియుదుము. ఈ సిద్ధాంతానుసారిగనే 'నాటకాన్తం కవిత్వ' మ్మను నార్యోక్తి! ఈవిధముగా సాహిత్యసృష్టిలోను, సాహిత్యాస్వాదనమునను దృశ్యకావ్య ముత్కృష్ట మైనది. శ్రవ్యకావ్య రచనకన్న దృశ్యకావ్య నిర్మాణము కష్టతర మని దీని వలనఁ దెలియుచున్నది. రూపకము సమాహారకళ యగుటయే యిందలి రహస్యము.[1] కవితారచనమునకుఁ గవికి శబ్దభావాధికారములే ముఖ్యముగా వలసియున్నవి. శ్రవ్య కావ్యమందుఁ గథాచమత్కృతియు శబ్దమాధుర్యమును ప్రాధాన్యము వహించును. కాని రూపకనిర్మాణము కవితా కళపైననేకాక, సంగీతాభినయ రంగప్రసాధనములమీఁద నాధారపడియున్నది. ఆయా కళలలోఁ బ్రత్యేకముగా ప్రవేశము లేనిదే రూపకనిర్మాణము విజయవంతము గాదు. పైగా రూపకరచనములోఁ గవి పాత్రలతోఁ దాదాత్మ్యము పొంద గలుగు మానసికశక్తి సంపాదింపవలసియుండును. ఇతి

---

1 Literature is an art dependent upon words, but the drama is a multiple art, using words, scenic effects, music, the gestures of the actors, and organizing talents of a producer. — *B. Ifor Evans.*

వృత్తము సంఘర్షణముతోఁ గూడి తత్పరిష్కారముతో ముగియవలెను.[1] ఆఖ్యానములోవలెగాక రూపకకారుఁడు కథను గుదించుకొనవలసియుండును, రూపకములోఁ గథాకథనము సంభాషణము ద్వారా జరుగవలసియున్నదిగాన కథాగమనవేగమున కాటంకము రాని సహజచతుర సంభాషణల నడపుటయందుఁ దాను నిపుణుఁడై యుండవలెను; కథా, పాత్ర, రసాదులం బోషించు సామర్థ్య మలవఱచుకొనవలెను. నాటక ప్రయోజనమును జెప్పుచు భరతాచార్యుఁడు—

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం।
విశ్రాంతి జననం కాలే నాట్య మేత న్మయా కృతమ్॥

న తచ్ఛాస్త్రం నతచ్ఛిల్పం న సా విద్యా న సా కలా।
నాఽసౌ యోగో న తత్కర్మ యన్నాట్యేఽస్మి న్న దృశ్యతే॥

అని సూత్రించినాఁడు. ఇంతటి పరమప్రయోజనసాధనమున కధికారానుభవములు మిక్కుటముగా వలసియున్నవి. ఇన్ని పొసఁగినను దృశ్యకావ్యముగాన నిరుప్రక్కల పదను గలిగినదై దృశ్య శ్రవ్య గుణముల రెండిఁటి నందక పోయినచో లాభము లేదు. ఈ రెండు ప్రయోజనములలో నేది లోపించినను దాని సంపూర్ణత చెడినట్లె యెంచవలెను.[2] ప్రేక్షకుల మెప్పువడయుటకు మంది మనస్తత్వ మెఱిఁగియుండుట యత్యంతావశ్య

1 The essence of drama is crisis. A play is more or less a rapidly developing crisis in destiny or circumstance and a dramatic scene is a crisis within a crisis.
—*William Archer.*

2 చూ : పింగళి లక్ష్మీకాంతముగారిచ్చిన నాటకకళా పరిషదధ్యక్షోపన్యాసము. చూ: గౌతమ వ్యాసములు

కము.[1] ఆఖ్యానమునకును రూపకమునకు నున్న ముఖ్యభేదములలో నిది యొకటి. ఇన్ని కట్టుదిట్టము లుండుటచేతనే రూపక నిర్మాణము కష్టసాధ్యమైనది. కావుననే సాహిత్యమందు రూపకమున కగ్రస్థానము లభించినది !

అంత యుత్తమ కావ్యత్వ సిద్ధిపొందిన రూపకముల రచించుటచేతనే సంస్కృతమునఁ గాళిదాసు, భవభూతులు— ఆంగ్లమున షేక్స్పియరు, బెర్నార్డుషాలు జగత్ప్రసిద్ధులైనారు. దీనిఁబట్టి యుత్తమ కవు లనువారు రూపకకారులే యనవలసి యున్నది.[2] కాని, మన యాంధ్రసాహిత్య మీ సూత్రమున కపవాదముగా నున్నది. తెలుఁగుసాహిత్యములో రూపకము లనునవి మొన్నమొన్ననే పొడసూపినవి. కవిత్వము జెప్పుటలో భిన్నభిన్న మార్గములు ద్రొక్కుచు వచ్చిరిగాని, మన వారు రూపక ప్రక్రియ నేలొకో సాధింపరైరి. ఆంధ్ర సాహిత్యముపై సంస్కృత సాహిత్య ప్రభావము మొదటను, ఆంగ్ల సాహిత్య ప్రాబల్యము తరువాత నున్నట్లు గుర్తింతుము. ఈవిధముగా రెండు భాగములఁ జేకొని మన సాహిత్యమును బరిశీలించినచో నాంగ్ల సాహిత్య ప్రభావము సోకిన తరువాతనే యించుమించుగా రూపక రచనాప్రయత్నములు తెలుఁగునాట జరిగినట్లు స్పష్టమగును. సంస్కృత సాహిత్య

1 What appeals to the individual will not appeal to the multitude, and vice versa, so that a knowledge of the psychology of the multitude is a necessary part of the equipment of the dramatist. —*E. W. Downs.*

2 It is enough to remember that world's greatest poets are also its greatest dramatists. —*Ashley Duke.*

ములో ననేక రూపకములున్నను మనవారి నాకర్షింపకుం
డుట కాయాకాలములం దాయాప్రభువులీ ప్రక్రియకు గౌరవ
మీయకుండుటే హేతువై యుండునని యూహింపవచ్చును. శ్రీనాథు
నకు సమకాలికుఁడైన పిల్లలమఱ్ఱి పినవీరన శాకుంతల నాటక
మును శ్రవ్యకావ్యముగా ననువదించుటఁ జూడ నాటికి శ్రీనా
థుని శృంగార నైషధమే యాదర్శమాయె నన్నట్లు తలంప
వలసి వచ్చును. లేనిచో శ్రవ్యకావ్యముగా మార్చుటకు
వేరు హేతువు గానరాదు. ఆయా యుగధర్మములను, ప్రభువుల
యభిరుచుల ననుసరింపకపోయినచో తదాశ్రితులైన కవుల
జీవితములు తెల్లవారుట యెట్లు? ప్రాచీనాంధ్ర సాహిత్య
ములో నున్న గ్రంథము లన్నియుఁ బ్రభువుల ప్రోత్సాహముచే
రచింపఁబడినవిగాని ప్రజా బాహుళ్యము బహూకరించి
వ్రాయించినవి కావు. అందులకే యాసాహిత్యమంతయు నుదా
త్తమై యేకసూత్రానుసారి (Typical) గా నున్నది.

పామరుల యభిరుచులను, వ్యవహారములను దెలిసికొని
వారి కానందముగూర్చు రచనములఁ జేసిన కవులకు సాహిత్య
ములో సముచితస్థానము లేకవచ్చినది. కావుననే యట్టి
వారి రచన లనేకములు కాలగతిలోఁబడి మృగ్యమైనవి. రూపక
మనగనే పండిత పామరులను మెప్పించునదై యుండవలెను.
రాజాస్థానములం దాసనముల వాంఛించు కవుల కీ దృష్టి
యుండుట సాధ్యముకాదు. అయినను పామర జనానందము
గూర్చు దేశికవిత మన యాంధ్రమందుఁ బొడసూపుచునే
వచ్చినది. పదకవిత్వమంతయు నట్టిదిగాఁ బూర్వము గమనించి
నాము. దేశీయ వృత్తములలో నాదవ్యక్తిగల సులభపద

సంపుటులతో వర్తిలిన దేశికవిత పామరులఁ బ్రబోధించి సంస్కరించుటకే యుద్దేశింపఁబడినది

అట్టి దేశికవితలో రూపక ప్రక్రియగూడ సంకురావస్థ నొందిన ట్లూహింప వీలున్నది.[1] మన దేశములో ప్రచారమందున్న తోలుబొమ్మలాటలు ప్రదర్శనమునకుఁ బ్రాతిపదికలేమో యని యనుమానింప వచ్చును.[2] ఈ దేశిసరణికిఁ జెందిన నాటకమే 'యక్షగాన'మను పేరుతో వర్ధిలినట్లు కనుగొందుము. యక్షగాన మనునది సంస్కృత పదమైనను సంస్కృతమున నిట్టిది గానరాని పండితు లీ ప్రక్రియను పెద్ద పేరుతోఁ బిలువఁదలఁచి 'జక్కులపాట' యనుదానిని సంస్కృతీకరించి యుందురు. జక్కులవారు వృత్తి సంఘములలో నొక తెగకుఁ జెందినవారు. వా రీవిధమైన గానమును పాడుచుండుటచే నది 'జక్కులపాట' యైనది. వారే దేశిరూపకములఁ బాడుచు నభినయించెడివారు కాబోలు!

ఈ యక్షగానములు శ్రీనాథుని కాలమునాటికే యున్నట్లు తెలియుటకుఁ దత్ప్రశంస భీమేశ్వర పురాణమందుఁ గన్పించుచు చున్నది.[3] క్రీడాభిరామమును వీథినాటక మని యనుచున్నారేకాని, తల్లక్షణము లెవ్వియు దాని కన్వయింపకుండుట[4]

---

1 గ్రీకునాటకము కూడ ననాగరకులైన పల్లీయుల వినోదార్థ మంకురించి నట్లు తెలియుదుము.

2 The simple puppet-show is everywhere the most recent form of dramatic representation and it was in India. —*Pichael.*

3 కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్షగాన సరణి.
భీమ ఖం. 3. 63.

4 శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి దశరూపక పీఠిక.

చే నది మన కేవిధముగాను దోఁచదు. పెద్దన కాలమునకు నాటకశాల లున్నట్లు తెలియవచ్చుచున్నది గాని యితరము లైన యాధారములు లేకున్నవి. తుదకు నాయకరాజుల కాలములో గీతికిఁ బ్రాధాన్యము వచ్చినది గాన యక్షగానము లనునవి కుప్పతిప్పలుగా నాటకకర్తలు వ్రాసినారు. ఈ యక్షగానముల స్వరూపము విచిత్రమైనది. కథను బోధించు కీర్తనలఁ గైకొని వానికి మధ్య నటులు తమ వచనములను గలుపునట్లు నిర్మితములైనవి కొన్ని యున్నవి; కీర్తనలతో బాటు దేశీయ గేయస్వరూపములు జేరి కొన్ని యున్నవి. తరువాత వచ్చిన కవితాప్రవాహముచేతను, తదితరాంగ శోభచేతను యక్షగానములు ప్రత్యేకత గడించినవిగాఁ దెలియుచున్నది. ఆనాడు ప్రోత్సాహమందిన నటులలోఁ బ్రధానముగా పల్లియులేయుండి రనుటకు నిన్న మొన్నటివఱకుఁ బ్రచారములోనున్న వీధి భాగవతులే నిదర్శనము. కావుననే యేనాదివా రభినయించు దానిని 'ఏనాది భాగవత'మనియుఁ గూచిపూడివా రాడుదానిని 'కూచిపూడి భాగవత'మనియుఁ బ్రజలు వ్యవహరించుచు వచ్చినారు. ఇప్పటికిని వీని స్వరూపము నచ్చటచ్చటఁ గానఁ గలుగును. కూచిపూడివారి భామకలాపము గొల్లవేషములు సుప్రసిద్ధములు! వానినుద్ధరించి యభినయ కళను నిల్పుకొనవలసిన కర్తవ్య మిప్పుడు మనపై నున్నది. ఇట్లు పదునేడవ శతాబ్దము మొదలు పందొమ్మిదవ శతాబ్దమువఱకు యక్షగాన రచనము సాగుచునే వచ్చినది. ఈ యక్షగానము లెక్కుడ ముద్రితములుగా తంజాపుర పుస్తక భాండాగారముననే నిలిచియుండుటచే

నివి ప్రాచుర్యము నొందుచున్నవి. ఈశతాబ్దమున సీయక్షగాన సరణి క్రమముగా మారి 'హరికథా' ప్రాపమును ధరించినది. బహుపాత్రాభినయమునకు యక్షగానములవలె తావులేక హరికథ లేక పాత్రాభినయమున కవకాశ మిచ్చునవై వరలినవి. ఈ హరికథ మనజాతి కున్న విశిష్ట ప్రక్రియగా నెన్న నగును.

ఇవ్విధముగా దాదాపు గత శతాబ్దాంతమువఱకు నాంధ్రములో దేశినాటకములు గన్పించుచున్నవిగాని మార్గ నాటకములు లేకున్నవి. ఆంగ్లసాహిత్య ప్రభావము క్రమముగా మనలకు లోగొనినది. ఉత్తర దేశమునుండి గత శతాబ్దపు మధ్యకాలములో నాటక కంపెనీలు వచ్చి మన యాంధ్ర ప్రాంతమునఁ బ్రదర్శనముల నిచ్చుటచేఁ మనవారిలోఁ గొంత కదలిక బయలుదేరినది. ఇవి కారణములుగా రూపక రచనా ప్రయత్నములు విరివిగా సాగినవి. రాజమహేంద్రవరములో, గుంటూరులో, బళ్ళారిలో, విజయనగరములో, నెల్లూరులో కంపెనీలు వెలసినవి. వారు ప్రదర్శించు నిమిత్తము కవులు నాటకముల రచించుటకుఁ బూనినారు; తొలిదినములలో సంస్కృతాంగ్ల నాటకముల ననువదించుటతోఁ బ్రారంభమైనది. వావిలాల వాసుదేవశాస్త్రిగారు షేక్స్పియరు వ్రాసిన 'సీజరు'ను, భవభూతి వ్రాసిన 'ఉత్తర రామచరితము'ను దెనుఁగున ననువదించినారు; అట్లే వీరేశలింగముపంతులు 'వెన్నిసు నగరవర్తకుఁడు', 'అభిజ్ఞాన శాకుంతలము' 'మాళవికాగ్నిమిత్రము', 'ప్రబోధ చంద్రోదయము'ల ననువదించి

నారు. వేదము వేంకటరాయశాస్త్రిగారు 'ఉత్తరరామచరిత్ర' 'శాకున్తలము' 'రత్నావళి', 'నాగానందము' ల ననువదించిరి. తిరుపతి వేంకటకవులు ముద్రారాక్షస మృచ్ఛకటికల నను వదించినారు; వడ్డాది సుబ్బరాయకవి వేణీసంహారము రచించి నారు. ఈవిధముగా నెందరెందరో సంస్కృత నాటకముల ననువదించినారు; అనువదించుచున్నారు; ఆంగ్ల నాటకాను కరణ మంతవిరివిగా జరుగలేదు. దీనికిఁ గారణము సంప్రదాయ భిన్నతయే కావచ్చును.

తరువాత ననువాదములకన్న స్వతంత్ర నాటకముల రచింపవలెననెడి కుతూహలము పొడమినది. తత్ఫలముగాఁ బురాణగాథలను, చారిత్రకాంశములను దీసికొని నాటకరచన సాగుచువచ్చినది. ధర్మవరము కృష్ణమాచార్యులవారి సారంగ ధర, చిత్రనళీయము, ప్రహ్లాద, ప్రమీలార్జునీయము, చంద్ర హాస మొదలైనవి; కోలాచలము శ్రీనివాసరావుగారి తల్లి కోట యుద్ధము; బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి హరిశ్చంద్ర; శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి బొబ్బిలి; తిరుపతి వేంకట కవుల ఉద్యోగ విజయములు; వేదము వేంకటరాయశాస్త్రి గారి ప్రతాపరుద్రీయము; పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి రాధాకృష్ణ, విప్రనారాయణలు; చిలకమర్తి లక్ష్మీనర సింహముగారి గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, మొదలైనవి పైశ్రేణికిఁజెంది ప్రయోగార్హతను బొందిన ప్రసిద్ధ స్వతంత్ర నాటకములు. తరువాత సాంఘికసమస్యల నెదు ర్కొనెడి నాటకముల వ్రాయ సంకల్పించినవారిలో గురజాడ

అప్పారావుగారు కన్యాశుల్కము వ్రాసి స్థిరకీర్తి వడసినారు. వీరేగాక, బళ్ళారి రాఘవాచార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, గుళ్ళపల్లి నారాయణమూర్తి, మద్దూరి శ్రీరామమూర్తి, కొప్పరపు సుబ్బారావు, శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి, వామరాజు పుండరీకాక్షుఁడు మున్నగువా రెందరెందరో పలువిధములైన వస్తువులతో, శైలులతో నాటకములు రచించినారు. [1]

కాని, నాటక నిర్మాణమునకుఁ గావలసిన వివిధ శక్తులలో సంపూర్ణముగా నన్నిశక్తులుండి రచింపఁబడిన నాటకమూర్తి నేటికి నవతరింపలేదని చెప్పవలెను. రమణీయమైన కవితయుండి, చతురమైన సంభాషణములుండి, నిబిడమైన కథాసన్నివేశము నేరుకొని, చక్కని పాత్రోన్మీలనముచేసి, కావ్యత్వము నొందఁగలిగి, ప్రయోగగౌరవము బడసెడి నాటకమవతరింపవలసియేయున్నది! నేడుపలభ్యమానములగు నాటకములలోఁ గొన్ని లక్షణము లన్వయించునవే యున్నవి. కాకపోయిన సర్వాంగ పరిపూర్ణమగు రూపకములేని కొఱత యుండనేయున్నది. అసలు సృష్టిలోనే పరిపూర్ణతలేదు గనుక మనము విచారింపరాదేమో!

ఆంగ్లసాహిత్యపు సంపర్కమువలన మన నాటక నిర్మాణములోఁ గొన్ని సంప్రదాయములు తొలఁగిపోయినవి.

---

1 శ్రీ వావిలాల సోమయాజులు రచించిన నాయకురాలు, శ్రీ పింగళి నాగేంద్రరావు రచించిన 'వింధ్యరాణి' యను నాటకము లిటీవల ప్రశంసల నందినవి. శ్రీ ఆత్రేయ వ్రాసిన 'అద్దెకొంప'(N.G.O) వాస్తవిక శిల్పము కలదై యద్భుతముగాఁ బ్రేక్షకుల నాకర్షించుచున్నది.

దశరూపకములలోని లక్షణమున కేనాఁడో మనము దూరుల మైనాము. స్వాతంత్ర్యము ప్రబలినకొలఁది సంగీతము హెచ్చయినది; దశాంకములు, పంచాంకములు క్రమముగా క్షీణింపఁ జొచ్చినవి, 'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని' అను సంప్రదాయము ప్రాఁతపడి యాంగ్లమండలి 'ట్రాజడీ' (కరుణాకము) పై భ్రమపుట్టినది. అరిష్టాటిలు ప్రతిపాదించిన ఐక్యత్రయ సూత్రము ( Three Unities ) నెఱిఁగి యాప్రకారము సాధనమును సాగించుచు వచ్చినారు. రంగస్థల నిర్మాణముంగూడఁ బాశ్చాత్యులే మనలను దిద్దుచున్నారు. వారి గురుత్వము సంపూర్ణముగా నేటి మనరూపకములమీఁదనున్నట్లు తెలియఁగలము. ఇకఁనైనఁ బ్రాచీనలాక్షణికు లేర్పఱచిన సూత్రముల ననుసరించి భారతదేశపుఁ బ్రత్యేకత జాటుటకుఁ బూనుకొని భరతశాస్త్రమందలి రంగస్థలమును దెలిసి తదనుగుణములైన నాటకముల రచించుటకు మనవారు శ్రద్ధ వహింపవలసియున్నది. దేశినాటకములైన యక్షగాన వీథిభాగవతముల నాదరించుచు మార్గనాటక నిర్మాణమునకై పరిశ్రమ జేయువలసియున్నది. అట్లు చేసినచో సాహిత్యములో నుత్తమ ప్రక్రియను సాధించి తల్లోపమును దొలఁగించిన వారగుదురు.

# రూపక వికాసము

## ౧

మానవులు నిత్య నవ్యతా గవేషణులు. ఈ ధర్మము కవులకును వర్తించును. సాహిత్యములో నే యుగమున కాయుగము నూతనముగా గన్పించును. ఒక్కొక్క యుగములో నొక్కొక్క ప్రత్యేకత, విశిష్టత గడించినది సాహిత్యము. రాను రాను నేటికి నవయుగము వచ్చినది.

ఈ యుగములో వచ్చిన నవ్య సాహిత్యములో మూఁడు విశిష్టరూపము లున్నవి. అవి ఖండకావ్య, కథానికా, ఏకాంకికలు. లోతుగాఁ బరిశీలించిన నీమూఁడును మనకుఁ గ్రొత్తవి కావనినట్లును, పూర్వము మనకున్న కావ్యభేదముల కివి ప్రాతిపదికలనునట్లు గోచరించును. ఎట్లనగాఁ బ్రబంధమునకు ఖండకావ్యము, నవలకుఁ గథానిక, నాటకమున కేకాంకిక సూక్ష్మరూపములు.

ప్రబంధము—నవల—నాటకము— ఈ మూఁడును విస్తృతమైన వస్తువుకలవి. వీనిలోఁ బ్రాసంగికములు, నుదాహరణములు చిత్రకథలు, నధికవర్ణనములు మొదలైనవి యెన్నియో యిమిడి వస్తువిస్తృతికి దోహదము చేయును. కాని, నవ్యయుగములో వచ్చిన ఖండకావ్యము, కథానిక, ఏకాంకిక లట్లుకావు.

వీనిలో వస్తువు సూక్ష్మమైనది. రచనమే చాలఁ బ్రధాన మైనది. ఈ రచనములో నుద్వేగము, నౌజ్జ్వల్యము కలిగి, ప్రధానవిషయమును సూటిగా, సరళముగా, సులభముగా బోధించుశక్తి యుండవలెను. వీనిలో నుండునదియొక్క సన్ని వేశమే. ఆ యొక్క సన్నివేశము రచనా ప్రభావమువలన హృదయమును జప్పున నాకర్షించి, రసానుభూతిని పొందఁజేయవలెను. నవ్యయుగములో వచ్చిన యీ మూఁడురూపములు స్వల్పకాలపరిమితములు. అత్యల్ప వస్తువుతో ననంత మగు రససిద్ధిని పొందింపవలెను. సూక్ష్మములో మోక్షము పొందించుట వీనిసూత్రము; నవ్యులయత్నమును.

పూర్వము మనకీ విధమైన సాహిత్యమున్నదా యను ప్రశ్న కున్నదనియే సమాధానము. కాని యీ యుగములోఁ దిరిగినన్ని మలుపులును, వచ్చినన్ని మెఱుఁగులు నపుడు లేవనియే యొప్పుకొనవలెను. మనపూర్వ ప్రబంధములలో నున్న వర్ణనలన్నియుఁ బ్రత్యేకముగా గ్రహించిన ఖండ కావ్యములుగను, పురాణములలోనున్న ప్రాసంగికములన్నియుఁ గథానికలుగను, రూపకభేదములలో ధనంజయాదులు లక్షీకరించిన వీథి, అంకము, భాణము, ప్రహసనముల నేకాంకికలుగను బరిగణింపవచ్చును. ఇవి, యీ విధముగా మనకు విజాతీయములుగాక, సజాతీయములే యన్నట్లు తెలియు చున్నది. ఇప్పుడున్న స్వయం సంపూర్ణత్వము, కళావిషయ కైక్యతలు పూర్వము లేవు. అనఁగా, నాయాకావ్యములలో నవి యంగములుగ నున్నవి. కాని, ప్రత్యేక కళాసిద్ధి పొంద

గలుగు 'అంగి'గా నిలువలేకపోయినవని స్పష్టముగాఁ దెలి యును. ఆయాఘట్టములనే నవ్యులు గ్రహించి చిత్రించినపుడు పూర్వసాహిత్యములో లెక్కకుమీరి యిట్టి సన్నివేశములున్న వని ద్యోతకమగును. కనుక పాశ్చాత్య ఏకాంకికా లక్షణ ములను వీనికి ననువర్తింపఁ జేయవలసివచ్చును. ఇప్పుడు నవ్య సాహిత్యోద్యానమున వికసించిన మూఁడుపుష్పములు పాశ్చా త్యాలంబన పురస్కృతములు.

ముందు మనవిచేసిన ట్లేకాంకనాటికలో నొక్క సన్నివేశమే యుండవలెను. నాటకకారుఁడన్ని యంకము లలోఁ దీసికొని రాగలుగు విభావానుభావ సాత్త్విక వ్యభి చారీ భావ సంయోగమును, నేకాంకనాటకకారుఁ డొక్క యంకములోనే తీసికొని రావలయును. ఉదాహరణమునకుఁ జిన్నపిల్లలు చిన్న చిన్న తాటియాకుబొమ్మలలో జీవితము లోని ఘట్టములను సూచించుచు నాడుకొందురు. అనఁగా వారు మానవజీవిత మంతటికిని సూక్ష్మాకార మిచ్చు చున్నారన్నమాట. అట్లే ఏకాంకిక మహా నాటకమునకు సూక్ష్మరూపమైనను, వస్తువిస్తృతిలేక యున్న యొక్క ఘట్టము భావపూరితముగాను, హృదయమును గదలించి కరగించు నదిగా నుండవలెను. పాత్రౌచితి, సంభాషణాచాతురి, కథా కథనపద్ధతి, పౌర్వాపర్యముల సమత, వస్తువుయొక్క బీజగర్భ నిర్వహణములు మొదలైనవి యన్నియు మహా నాటక కారునివలెనే యేకాంకికా కారుఁడు ననుసరింపవలెను. ప్రయోగ, పఠనయోగ్యతలను రెండు ధర్మము లేకాంకి

కకును వర్తించును. కాని ప్రదర్శనమువైపునకే యెక్కువ మొగ్గు నేకాంకిక. ఆ ప్రదర్శనములో ననుకొనని క్రొత్త మడుపులతో వస్తువు ముగిసి సామాజికులను భయ సంభ్రమాశ్చర్యములలో ముంచి వేయవలెను.

ఏకాంకికా నిర్మాణమంతయుఁ గథానికా నిర్మాణమును బోలియుండును. కాకపోయిన నాకథనే నాటకీయము చేయుట యుచిత ధర్మము. అందుచేతనే "In dramatic composition, the equivalant of the short-story is the One-act play" అనినాడు బ్రాండరు మాథ్యూస్. ఏకాంకిక చక్కఁగా రచింపఁగల సమర్థుఁడు మహానాటక నిర్మాణమున కర్హుఁడు కాఁగలఁడనుటలో సందేహము లేదు. నిజమున కుత్తమ యేకాంక నాటకమే సామాజికులు మహానాటక ప్రదర్శనము నానందించునట్లు తర్ఫీదిచ్చునని మారియోట్ అన్నాఁడు.

స్టీవెన్సన్ కథానికను గురించి చెప్పిన సూత్ర మేకాంకికకును వర్తించునని చెప్పవచ్చును:—

1 పాత్రములనుబట్టి, వాతావరణమును, సందేశమును జిత్రించుట.

2 సందేశములు బోధించు నిమిత్తము, పాత్రములను వాతావరణమును సృష్టించుట.

3 వాతావరణమును జూచి పాత్రములను, సందేశములను గల్పించుట.

ఏకాంక నాటకము ముఖ్యముగా సంభాషణముమీఁద నాధారపడి యుండును గనుక సంభాషణములు, సూటిగాఁ జిత్రముగా, వ్యంగ్యముగాఁ బలువిధములుగనుండి పాత్ర చిత్రణములోను, కథావేగములోను నోహాదము చేయ వల యును. భాషా విషయములోఁ బాత్రోచితభాష తప్పక యుప యోగింపవలెను. దీనికి ననుభవము చాల నవసరము. నాటిక యంతయు నొక సందేశము నందించుచుఁ బ్రతియంశము నా ధర్మోన్ముఖమై యుండవలెను.

ఏకాంకికా స్వరూపమును గురించి చెప్పినదాని సారాం శమును సూత్రప్రాయముగా చెప్పవలెననినచో నిట్లుండును:-

1. భావనైశిత్యము 2. ఏకాగ్రత 3. సమగ్రత 4. ప్రైకైక సన్నివేశము 5. పరిమితపాత్రసంఖ్య 6. అర్థబంధు రత 7. పాత్రోన్మీలనము 8. సరససంభాషణములు 9. రచనా సౌలభ్యము 10. ఐక్యత్రయసత్త్వము (Three Unities) 11. సందేశదాయకత్వము 12. ప్రయోగగౌరవము — ఇవి యన్నియు నుండ వలెను. ఇన్ని యుండియు వస్తువు సార్వజనీనమైనది కాక పోయినచో, నది యెంతయో కాలము నిలువనుసిలువదు; ఉద్దిష్ట రసానుభూతిని గలిగింపను గలిగింపదు. కాబట్టి విశ్వ జనీనముగా నుండుట కావ్యధర్మము.

ఇఁక తెలుఁగులో నేకాంకికా రచయితలను, వారి రచన లను బరికింతము. ఖండకావ్య కథానికలు పెరిగిపోయినవి. ఏకాంకికారచన యిటీవలననే బయలుదేరి సాగుచున్నట్లు కవ

బడుచున్నది. లెక్కకు చాలఁ గన్పించినను, పరీక్ష కాగినవి చాలఁ దక్కువ. ఒక్క సమయము చెప్పవలెను. ఖండకావ్యములలో మనవారు సిద్ధహస్తులైనారు. కథానికలలో యత్నించుచున్నారు. ఏకాంకికలో ఇంకఁ బ్రాథమికావస్థలో నున్నారు.

ఏకాంకికా సాధకులలో—నోరి, తల్లావఝ్ఝల పితృపుత్రులు, చింతా, చిలుకూరి, అబ్బూరి, విశ్వనాథకవిరాజు, మల్లాది అవధాని, రామకృష్ణశాస్త్రి, శర్మలు, శ్రీపాద, మొక్కపాటి, భమిడిపాటి, ఇంద్రగంటి, ముద్దుకృష్ణ, చలం, విశ్వనాథ, గిరి, రజనీ, నార్ల, జానకిరాం, కొండముది, జి.వి.కృ. సాధనసమితి సభ్యులుకొందఱు మొదలైనవారున్నారు.

వీరి రచనల నన్నిటిని పరిశీలించినచో, ఏకాంకికలు నాలుగు విభాగములుగా కన్పించుచున్నవి. 1. వచననాటిక 2. గేయనాటిక 3. పద్యనాటిక 4. రేడియోనాటిక. చారిత్రక, సాంఘికముల నెడి యంతర్విభాగ మున్నది. ఆయా ప్రధానరసము ననుసరించిన విభాగము కన్పించును. వీనిలో వచన మొక్కటియే యుత్తమమయి నట్లంగీకరింపవలెను. గేయము హృదయద్రావక గుణము కలిగినది; కాబట్టి గేయనాటిక రసానుభూతిని సత్వరముగా సమకూర్చుననియే చెప్పవలెను. 'రజనీ' గేయనాటిక యెన్నఁదగినది. పద్యనాటికల విషయములో 'సభాపతి' సిద్ధహస్తుఁడు. రేడియో ఏకాంకికకుఁ జక్కని యాలంబన మిచ్చుచున్నది.

పైన చెప్పిన రచయితల ఏకాంకికలు నే నుల్లేఖించిన సూత్రము లన్నిటిని నొప్పించునవికావు, కాకపోయిన నొక్క

క్కూరి రచనములో కొన్ని సూత్రములు మాత్రమే కన్పించును. ఉదాహరణమునకు: శ్రీపాద సంభాషణాచాతుర్యములో, చిలుకూరి నాటకీయమైన వస్తువు నేరికొనుటలో, మొక్కపాటి యేకాగ్రతలో ప్రతిభ చూపినారు. అట్లే ఒకొక్కరు కొన్ని లక్షణములు పట్టునవిగా వ్రాసినారు. కాని, సర్వాంగ సుందరముగా నన్ని లక్షణముల నొప్పించు నేకాంక నాటిక యింకను తెలుఁగులో రాలేదనియే చెప్పవలెను. నోరి వారి 'ఖేమాభిక్కూస' అను నాటికమాత్రము చాలవఱ కన్ని లక్షణములు కలిగి యథార్థనాటికకు సమీపములో నున్నదని చెప్పవచ్చును. సర్వలక్షణ సమన్వితమైన నాటిక తెలుఁగులో నిర్మించుటకు నవ్యులు ప్రయత్నింతురని యాశింతుము.

---

ఈనాఁ డేకాంకికా రచయితలు లెక్కకు మించిపోయినారు. రేడియో నాటికలను శ్రీయుతులు కపిల కాశీపతి, వేమూరి వేంకటరామనాథము, పన్యాల రంగనాథరావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, బుచ్చిబాబు, వింజమూరి శివరామారావు, అమరేంద్ర, ఆనంద్ మున్నగు వారు సాధించుచున్నారు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, భావరాజు వెంకటకృష్ణరావు, మారేమండ రామారావుగారలు చారిత్రకాంశములతో నేకాంకికలు రచించుచున్నారు. ఇంక నెందరో యత్నించుచున్నారు. నాటికా రచనకు భవిష్యత్తున్నట్లు తోచుచున్నది.

# సాహిత్య పరిణామము*

ఓమ్

సహనా వవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీత మస్తు
మా విద్విషావహై.

—ఆంధ్రసాహిత్యార్చకులకు నమోవాకములు—

## కృ త జ్ఞ త

మీరీనాడు నాకుఁ జేసిన యీగౌరవమునకుఁ గృతజ్ఞుఁడను. ఈయధ్యక్షస్థాన మలంకరింపఁదగిన యోగ్యతాధికారములు నాకు లేవు. వయోవృద్ధులు, జ్ఞానవృద్ధుల నేకులుండఁగా దీనికి తగుదునని, నేనంగీకరించుట సాహసకార్యమే. నాబోఁటి కించిజ్జ్ఞుని నీసమావేశమున కధ్యక్షత వహింప నాజ్ఞచేసి మీ రేమి సాధింపఁ దలఁచినది నేనూహింపలేను. అకారణముగా పక్షపాత మలవడినచో ప్రతిక్రియలేదని పెద్దలందురు. శారదాదేవి యాశీర్బలముతో, సహృదయులైన సభాసదుల సానుభూతితో నాకర్తవ్యమును శక్తివంచనలేక కొనసాగింతునని మనవిచేయుచున్నాను.

## అ ం జ లి

ఆంధ్రులు విలక్షణమైన గుణములను గలిగిన ప్రత్యేక జాతికిఁ జెందినవారు. విజ్ఞానమున కాంధ్రదేశ మొకప్పుడు నెలవై చెన్నొందినది. ప్రాచీను

* హైదరాబాదుజిల్లా (ప్రథమాంధ్ర) సారస్వత సభాధ్యక్షోపన్యాసము : (17—6—'45)

లైన నాగులకు నాంధ్రులకును సంబంధమున్నట్లు వారి యాచార వ్యవహారము లనుబట్టి యూహింప వీలున్నది. తచ్చిహ్నముగా నాదిశేషు నుపాస్యదైవముగా నిల్చినాఁడు. కావుననే కాబోలు నిప్పటికిని కొన్ని జనపదములలో నాగాను బొమ్మ గ్రామదేవతగా నారాధింపఁబడుచున్నది. మీదు మిక్కిలి శేషువు విజ్ఞానమును కుపలక్షకము. ఆంధ్రులకును, ఆదిశేషువునకు నింతటి చక్కని సంబంధము పొసగుటచే నీసందర్భమున ననంతుని స్తుతించుకొనుట జాతిసంప్రదాయము ననుసరించునట్లగును. ఆదికవియైన నన్నయభట్టాచార్యుని వాక్యసరణి మన కనుశాసనము గావున నాతని పదములలోనే పల్కెదను :-

బహువన పాదపాబ్ధి కులపర్వతపూర్ణసర స్సరస్వతీ
సహితమహామహీభర మజస్ర సహస్రఫణాలి దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికి పాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁడనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

ప్రవేశిక. భా. ఆ ది. ౧-౧౯౭

ఆంధ్రులది పాలకజాతి. క్రీ. పూ. సుమారుగా 234 నుండి క్రీ. శ. 207 వఱకు నాంధ్రరాజులు దేశమును బాలించినారు. శాతవాహను లాంధ్రులని చారిత్రకుల సిద్ధాంతము. ఈయాంధ్రరాజుల పోషణమున వైదిక, జైన మతములు వర్ధిల్లినవి. కాని వైదిక మతమునే వారనుసరించుచు వచ్చినట్లు వారు చేసిన యశ్వమేధాది యాగములే ధృవపఱచుచున్నవి. నాటిసంఘము వర్ణాశ్రమ ధర్మములకు బద్ధమై యొప్పారినది; కావున నేవిధమైన సంఘర్షణములు లేకపోయినవి. ఆనాటి ప్రజలు శాంతియుతమైన జీవితమును గడపినారు. శ్రద్ధాభక్తులు, మాటమర్యాదలు, ధైర్యసాహసములు, వినయవిభూతులు వారి మనసులలో సంపూర్ణావకాశము బొందినవి,

సంస్కృత భాషాసాహిత్యములే నాటి పండితుల యాదరము నందినవి. నాని సంప్రదాయ సూత్రాదులే యాదర్శవంతములుగా భావితములైనవి. తరువాత హాలుఁడు ప్రాకృతమందును, గుణాఢ్యుఁడు పైశాచియందును గ్రంథములను రచించి రాబోవు తెనుఁగు సాహిత్యమునకు మార్గదర్శకులైనారు. నాటికి నాంధ్రభాష రాజాస్థాన ప్రవేశమున కర్హత గడింప లేదు. దైనందిన వ్యవహారములో నుండి జనబాహుళ్యము నాశ్రయించినదే కాని రాచరికమును, ఉత్తమ సాహిత్యము నాధారముగాఁ జేసికొనలేదు; పసితనములో నుండి యవ్యక్త మధురనాదము లీను జిలిబిలి పలుకులతోఁ బ్రజలహృదయముల నార్ద్రీభూతము లొనర్చుచుండినది.

## సాహిత్యమునకు మతమే పోత్సాహకము

క్రీ. శ. ఏడవ శతాబ్దికి—అనఁగా చాళుక్యరాజుల పరిపాలనా కాలములో నాంధ్రభాషకుఁ గ్రమముగా గౌరవము లభించినదని తెలియుటకు వారి శాసనములే నిదర్శనములు. నాటికి బౌద్ధమత ప్రచార ముద్ధతమైనది. బౌద్ధవాఙ్మయము ప్రాకృతమున విరివిగా పెరిగిపోఁ జొచ్చినది. వైదిక మత సంప్రదాయముల నిలువద్రొక్క వలసిన కర్తవ్యము హెచ్చినది. సంఘజీవనము దేశకాల పరిస్థితుల ననుసరించి మార్పుచెందుచుండును. దీని ననుసరించియే యాయా జాతి సాహిత్యములు వర్ధిలుచుండును. పూర్వసాహిత్యములో సంఘ జీవితము ప్రతిబింబించుట లేదని యిటీవల కొందఱభి ప్రాయపడుచున్నారు. కాని అది సరిగాదు. పదునొకండవ

శతాబ్దములో చాళుక్యనృపాలుఁడైన రాజరాజు వైదిక మత
ప్రాచారార్థము దీక్షబూనినాఁడు; ఆంధ్ర వాగనుశాసనుఁడైన
నన్నయభట్టారకుని పవిత్రవచస్సుతో నాంధ్ర భారతావతర
ణము పొసఁగినది. మహితాత్ముఁడైన నన్నయ స్వస్థాన వేష
భాషాభిమతులయి, రసప్రబుద్ధమయిన మనస్సుగలవారయి
పెద్దలు దేశభాషా కావ్యముల గౌరవింపవలెనని ప్రబోధించి
నాఁడు. ఈ విధముగా నాంధ్రదేశ భాషాసాహిత్యములపై
నాదరాభిమానము లుద్బుద్ధములైనవి.

### దేశకవిత—తత్ప్రభావము

ఇంతలో వీరశైవమతము విజృంభించినది. తత్ప్రచా
రము నిమిత్తము వాఙ్మయ మాశ్రయమై వృద్ధికాఁజొచ్చినది.
ప్రజల కందుబాటులో భాషాభావము లుండవలెననెడి యభి
ప్రాయము బౌద్ధకాలము నాటికే యుదయించి యీకాలమున
నభివృద్ధి నొందినది. సులభబోధకై "దేశికవిత_జాను తెనుఁగు"
లత్యంతోపస్కారకములుగాఁ గనిపెట్టినారు. శబ్దకాఠిన్యము లేక
సరసమగు పదములతోఁగూడి, రాగరంజితమై, ప్రజల యాచార
వ్యవహారములకుఁ బ్రతిబింబమై, జాతీయముల నిమిడ్చికొని
నదై పామరుల కష్టములను మరపించి కార్యసాధనములో
నుత్సాహమును బ్రసాదించునట్టిదైన పదకవిత్వమునకు బీజ
మానాఁడే నాటఁబడినది. ప్రజాదరమే కవితకు లక్ష్యమనియుఁ
బ్రజల సంస్కరించుటే కవితాధర్మమనీ ఆనాఁడే గుర్తింపఁ
బడినవి.* ఏరాజుల కనుసన్నలకు నానాటి పదకవిత బద్ధము

*చూ: కోరాడ రామకృష్ణయ్యగారి "దేశి-దక్షిణ భాషాసారస్వతములు"

కాలేను. అట్లు కానిచో నాకవితలో నంతటి యుద్రుతము, స్వేచ్ఛాస్వచ్ఛత లుండుట కవకాశము లెక్కడిది ?

ఈ "దేశికవితోద్యమ" ప్రభావము తరువాత వచ్చిన తిక్కన కవితలోఁ గన్పించుచున్నది. తెలుఁగు నుడికారమును మూటకట్టుకొనిన యాతని జాతీయ రచనమే యిందులకుఁ దార్కాణము. పిమ్మట వచ్చిన ద్విపద రామాయణ హరి శ్చంద్ర నలోపాఖ్యానములుకూడ నీ 'దేశీ' మార్గమునకుఁ జెందినవే. శ్రీనాథునిఁగూడ నీసిద్ధాంతము లోఁబరచుకొని యాతని చేఁబల్నాటి వీరచరిత్రను వ్రాయించినది. ఇవి తోలుబొమ్మ లాటలద్వారా వృత్తి సంఘములుగా వరలిన జంగముల ముఖమునను బ్రచారమందినవి. ప్రజల కాహ్లాదము గూర్చుచు పౌరాణిక గాథలను బోధించుచుండుట కీ ద్విపదలు తోడ్పడుచు వచ్చినవి.

### కావ్యములు ప్రభుసమ్మితములు

పిమ్మట చాలకాలము వఱకు మన సాహిత్యము ప్రభు సమ్మితమైనది. కవులు సంస్కృత కావ్యానువాదములతోఁ గాలము గడపుచువచ్చినారు. కావ్యములు పాండితీ ప్రకర్ష కాలవాలమైనవి. ప్రజల హితముపైగాక ప్రభు వాసంగు కానుకలపైఁ గవుల దృష్టిపడినది. ప్రభువులు సహజ సౌందర్య విలసితములగు వనములలో విహరించుటమాని కృత్రిమోద్యాన విహారములకు మురిసిపోవుట పరిపాటయినది. ఈ సూత్రమే కవులను గూడఁబరిపాలించినది. ఆద్యసత్కథలం గైకొని చిత్రించుట—కల్పనా కథలచే మురిపించుటలు జరిగినవి. రాజాశ్రి

యము లభించిన కవులకుఁ బ్రజలతో నిమిత్తమేమి? వారి కష్ట నిష్ఠురములు కావ్యవస్తువులగుట కవకాశ మెక్కడిది?

క్రమముగాఁగవులు ప్రభువులకు మిత్రులై పొట్టలో చల్ల కదలక వర్తిలినారు; ఆ వాతావరణాను గుణముగాఁ బ్రణయ చింతనము హెచ్చినది. రాజాంతఃపురములు కవులకు సుపరిచితములగుటచే నచటి వస్తువులు, సన్నివేశములు వారి కావ్యములలోఁ బ్రతిబింబితము లగుచువచ్చినవి:

"సిరుపహాతి స్థలంబు, రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడెం, మాత్మకింపయిన భోజన, మయ్యాలమంచ, మొప్పుతప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్" దొరకెడివారు వారికి! తినమరగినవాఁడు పస్తుండ గలఁడా మఱి? అంతటి సౌఖ్యముల నందినారు గనుకనే నాఁడు వారి ప్రాపు నడలినంతనే శ్రీనాథ పెద్దనలు 'జీవచ్ఛవముల' విధముగా నున్నట్లు వ్రాసికొని విలపించినారు.

### సంపూర్ణ భాషాభావ కల్పనా సౌష్ఠవము

శ్రీకృష్ణరాయల కాలము తెనుఁగుజాతి వైభవమునకు సర్వవిధముల శిఖరప్రాయము. సాహిత్యమునకు భాషాభావ కల్పనాసౌష్ఠవము నానాటి కవులు సంపూర్ణముగా నిచ్చినారు. తెలుఁగు సాహిత్యక్షేత్రములో విశిష్టమైన ప్రబంధవృక్షము శాఖోపశాఖలై విరాజిలి రసవత్ఫలముల నీసిన దీకాలమందే!

### సాహిత్య సౌధ పతనము

కృష్ణరాయల యనంతర మల్పకాలముననే విజయనగర సామ్రాజ్యము క్షీణించినది. కవు లించుమించుగా పొట్టలు

పుచ్చుకొన బయలుదేరవలసివచ్చినది. చిన్న చిన్న సామంతులు రాజులైనారు. వారికిఁదాము చక్రవర్తుల మనెడి యహంకారము పెరిగినది. విషయలోలురులై ప్రజా పరిపాలనమందలి కాంక్షకంటె బహుకాంతా పాలనమందలి ప్రీతి హెచ్చినది. వీరి ప్రాపు గోరిన కవులు వారి చిత్తవృత్తుల ననుసరించియే మెలఁగవలసివచ్చినది. అందుచేతఁ బనునాలు పదునేడు శతాబ్దములలో సాహిత్యము బూసుపోనవహమగు కేవల శృంగార వస్తుచిత్రణముతో నిండిపోయినది. ప్రబంధమే దిక్కాచి యాటచే గతానుగతికమై పేలవమైపోయినది కవిత. అనుకరణానుసరణములు హెచ్చినవి. ఈ విధముగా నాంధ్ర రాజ్యవైభవముతో సాహిత్య వైభవ మడుగంటినది.

## చెప్పఁదగిన యంశములు

కాని నాయకరాజుల కాలములోఁ జెప్పుకొనఁదగిన యంశము లేకపోలేదు. దేశికవిత కాదరణము మరల రగులుకొన్నది. సంగీత నాట్యముల కాస్థానములో నధిక గౌరవము లభించినది. ప్రజలమీఁద దృష్టి మరలినది, జాతీయమైన రూపక ప్రక్రియకు దోహద మీయఁబడినది. యక్షగానములు విరివిగా రచింపఁబడి ప్రదర్శింపఁబడినవి. వ్యావహారిక భాష యుపాదేయమైనది. రఘునాథరాయల పరిపాలనాకాలము సకృష్ణరాయల పరిపాలనాకాల ముపమానమగును. అతఁడు సంగీతమును బ్రోత్సహించి పదసాహిత్యపోషకుఁడై ప్రసిద్ధినొందినాఁడు. ఆంధ్రులు గర్వింపఁదగిన క్షేత్రయ్య పదములు, త్యాగరాజు కీర్తనము లాకాలమునకుఁ జెందినవే. నాస ననుసరించి

తర్వాత దీక్షితులు, శ్యామశాస్త్రి మున్నగు వారనేకులు కీర్తనలను, పదములను, రచించినారు. శృంగార భక్తిపరముగా నీవిధమైన కవిత రచింపఁబడి ప్రజలను మురిపించి సంస్కరించునదై వరలినది. నాయక యుగములోఁ బ్రజలకు విషయబోధ సులభముగాఁ జేయుటకుఁ బద్యముకన్న వచనమే యనుకూలమైన ప్రక్రియగాఁ గనిపెట్టినారు. వచనములోనున్న యన్వయ సౌలభ్యము పద్యములో నుండదుగదా! అందుచే రాయవాచకకర్త, కళువె వీరరాజు, సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు, విజయరంగ చొక్కనాథుఁడు మొదలైనవారు వచన రచనకుఁబూనుకొని ప్రజాసేవ చేసినారు. ఈ విధముగా సాహిత్యమును ప్రజలకు సమీపములో నుంచి వారిని విజ్ఞానవంతులుగాఁ జేయుటకుఁ బ్రయత్నము లాకాలమందు జరిగినవి.

## ఆంగ్ల సాహిత్య ప్రభావము – నూతన ప్రక్రియలు

తరువాత బ్రిటిషు పరిపాలనా ఫలితముగా నాంగ్ల భాషా సాహిత్యముల ప్రభావము మనపైఁ బడినది. పందొమ్మిదవ శతాబ్ది మధ్యకాలములో నిది స్ఫుటమైనది. సంఘములో, మతములో సాహిత్యములో మార్పు వచ్చినది. 'క్రొత్త యొక వింత ప్రాత యొక రోత' అన్నట్లుగాఁ గొంత కాలము మనవారు మోహాంబుధిలోఁ దలమున్కలు వేసి మన సార్థక్యమును విస్మరించినారు. మనకుఁగలిగిన మేలునే యెంచుకొందము, ఆంగ్ల సాహిత్యములో మనకు లేని నూత్న ప్రక్రియలను మురిసిపోయి మనసాహితీసేవకు లట్టివి రచించుట మొదలిడినారు. 'నవల', 'ఉపన్యాసము', 'ప్రహసనము', 'విమర్శ'

'వ్యాసము', 'స్వీయచరిత్ర' మొదలైన వచన ప్రక్రియల నవతరింపఁజేసి వీరేశలింగముపంతు లాధునికయుగకర్తయైనాఁడు. తాను సంఘసంస్కారియై స్త్రీ జనోపయోగార్థ మనేక రచనల సాగించినాఁడు. దీనిం బురస్కరించుకొని తరువాత యనేకులు స్త్రీలకు పాటలు, కథలు వ్రాయుచు వచ్చి సులభశైలిలో నాంధ్రజాతీయ జీవనమును పాతివ్రత్య ధర్మమును బ్రబోధించినారు. వీరేశలింగముపంతు లవతరింపఁజేసిన నూతన ప్రక్రియలలో తరువాత నెందరెందరో కృషిసల్పుచు వచ్చినారు. కాని నేటికి ఒక్కదానిలో నైనను బరిణతి పొందలేదు.

వీరేశలింగము పంతులు గద్యశైలీ సౌలభ్య కల్పనము నకై చేసిన పరిశ్రమనే తిరుపతి వేంకటకవులు పద్యశైలీ సౌలభ్య కల్పనమునకై యొనర్చినారు. వీరి ప్రభావము యావదాంధ్ర దేశముపైఁబడినది.

### భావకవిత్వము

1910 ప్రాంతమున నాంగ్లసాహిత్యములోని 'రొమాన్టిక్' కవిత మనవారి నాకర్షించినది. అవిధమైన ప్రత్యక్షభావ కవిత [1] మన కంతవఱకు లేదని యువవిద్యార్థులు గమనించినారు. వారికి వయస్సు, వాతావరణము లనుకూలించినవి. ప్రేయసి, కోకిల, ప్రకృతి నవ్యకవితా ముఖ్యసామగ్రిలోఁ జేర్చినారు. దీనిని అభినవకవిత్వ మనినారు. రాయప్రోలు వారు వరుసగా నావిధమైన కావ్యాలు ప్రచురించినారు.

1 Subjective poetry: దీనిని పింగళి లక్ష్మీకాంతముగారు 'ఆత్మాశ్రయ కవిత్వ' మని వ్యవహరించుచున్నారు.

సంఘ సంస్కారమును చుక్కానిగాఁ బెట్టుకొని గురజాడ కవి మాత్రాఛందస్సులోఁ గవితారచనము సాగించినాఁడు. పతితోద్ధరణము సూత్రముగా గ్రహించి పల్లీయులను నాయికా నాయకులుగా గ్రహించి నండూరివారు 'ఎంకిపాటలు' రచించినారు. పూర్వమార్గమును వదలి నవీన మార్గమందు విశ్వాసము లేని కొందఱిని బౌద్ధవాఙ్మయ మందలి సత్యాహింస లాకర్షించి కవితావస్తువులైనవి. సౌందరనందము, కరుణశ్రీ మున్నగు నవట్టి రచనములే. దీని నంతటిని భావకవిత్వ మనినారు. ఇది మొదట కొంతకాలము దూషణమునకు గురియైనది; కాని తరువాత నిలువఁద్రొక్కుకొనినది.

వ్యావహారిక భాషావాదము

ఈ కాలముననే గిడుగు రామమూర్తి పంతులువారి వ్యావహారిక భాషావాదము ప్రచారములో నున్నది. మన సాహిత్యములో వచనబీజ మంకురించి పెరిగి పెద్దదైనకొలఁది యాలంకారిక శైలి పుణికి పుచ్చుకొనుచు వచ్చినది. వ్యాకరణముపై నక్కఱలేని మోజు పెట్టుకొని పాండిత్యము నంతయు దీర్ఘ జటిల సమాసములలోఁ బ్రదర్శించి కొందఱు వచనమును దురవగాహ మొనర్చినారు. అది కృతకభాష యైపోయినది. పద్యమును వదలి వచనమును గ్రహించిన హేతువును విస్మరించినారు. ఈ సత్యమును దర్శించి గిడుగువారు భాషావాదమును లేవదీసినారు. ఆంధ్రసాహిత్యపరిషత్తు దీనిని ఢీకొనినది. రామమూర్తిపంతులు శత్రుకోటి నెదుర్కొనినాఁడు. ప్రజాఘోషము, నవ్యకవుల యనుసరణమును బడసి విజయుఁడై నాఁడు,

దీనికి నిదర్శనముగా నేడు వ్యావహారికభాష దేశమంతట చక్కని వ్యాప్తిలోనున్నది. పై రాయప్రోలు, గురజాడ, గిడుగుల ఉపజ్ఞకమైన భాషా భావ సంస్కరణ ప్రచారము చేయుటకై సాహితీసమితి పుట్టి, 'సాహితీ' పత్రికను స్థాపించి, చక్కని సేవచేసినది. తత్పరిణామముగా వచ్చిన సాహిత్య ప్రక్రియలగు ఖండకావ్య, కథానికా, ఏకాంకికాదులకు సాహితీపత్రిక దోహద మొసఁగినది. తరువాత 'ప్రతిభ' పుట్టి యాపనిని నిర్వర్తించుచు వచ్చినది. ఇది యంతయు నవ్యసాహిత్యమను పేర నేడు పరగుచున్నది.

### పరిశోధనము - చారిత్రక విమర్శ

క్రీ. త. 1912 ప్రాంతముననే ప్రజలందు విజ్ఞాన వ్యాప్తికై కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులవారు పాటుపడు చుండిరి. ఆంగ్ల సాహిత్యములో పరిశోధనము, విమర్శ లత్యంతముగాఁ బెరిగినవి. ఏ భాషాసాహిత్యమునకైన నివి లేనిదే ప్రశస్తిలేదు. ఈ సత్యమును దర్శించి పంతులుగా రా విధమైన కృషిచేయ నారంభించినారు. చారిత్రిక విమర్శకు మార్గదర్శులైనారు. తరువాత కట్టమంచివారు సాహిత్య విమర్శనమునకు బీజావాపముచేసి తమ కవిత్వతత్త్వవిచారము నుపాయనముగ నొసంగినారు. ఇట్లే సాహిత్య చరిత్రములుకూడ వెలసినవి. ఈ విధమైన విమర్శా సారస్వతము మనకీనాటికిని విరివిగా పెరుగలేదు. అక్కడక్కడ చిన్నచిన్న యత్నములు జరుగుచున్నవికాని యేకముఖముగా కొనసాగుచు నిర్మాణపరిణతి నందుటలేదు. ఈ కాలముననే "విశ్వదాత" కాశీనాథుని వారాంధ్రపత్రికను స్థాపించి విజ్ఞానవ్యాప్తికిఁ గారకులైనారు.

ప్రథమప్రపంచ యుద్ధానంతరము మనకుఁ బ్రత్యేక విశ్వవిద్యాలయము వచ్చినది, కాని చాలకాలమువఱకు రాష్ట్రము రాలేదు. ఇది ప్రజలలో చాల నిరుత్సాహమునకుఁ గారణమైనది. ప్రజల హృదయములలో సంతతముండే యాంధ్రోద్యమము బాగుగా పాదుకొన్నది. ఉపన్యాసములద్వారా యుద్బోధ మొనర్చుట యాచారమైనది. మనకవులు రాష్ట్రప్రబోధ గీతముల నాలపించినారు. ప్రాచీనాంధ్ర వైభవమును ద్రవ్వి పోయు ప్రబోధపద్యములు రచింపఁబడినవి. ఆనాటివే—

'అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు'

మొదలైన రాయప్రోలువారి పద్యములు. కాని 1921లో సహాయోద్యమము వచ్చి యది దేశమంతట వ్యాప్తమైనది. అందులో మన రాష్ట్రోద్యమము లీనమైపోయినది; జాతీయగీతము లనేకములు వచ్చినవి. వానిని రచించినవారిలో గరిమెళ్ళ సత్యనారాయణగారు ముఖ్యులు. ప్రజాప్రబోధమునకు 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, చెరుకువాడవారు మొదలైన వక్తలు పాటుపడినారు. ఈ విధముగాఁ బ్రబోధ వాఙ్మయము పెరిగినది. నేటికిని ఆంధ్రరాష్ట్రగానము వినిపించుచునే యున్నది. కొడాలి సుబ్బారావుగారి 'హంపీక్షేత్రము', విశ్వనాథ సత్యనారాయణగారి 'ఆంధ్రప్రశస్తి', తుమ్మలవారి 'రాష్ట్రగానము' మొదలైన విందుల కుదాహరణములు.

ఇట్లుండగా యుద్ధానంతరము యూరపు సాహిత్యము మన దేశమునకు దిగుమతి యయ్యెను; తత్పరిణామముగా శ్రీ శ్రీగారికి 'అతివాస్తవికత' యంకురించినది. నారాయణ బాబుగారుకూడ నీసరణిననుసరించినారు. ఈ మార్గమిపుడంత ప్రబల ప్రచారములో లేదు.

## నేటి సాహిత్య స్థితి

ఇంతలో రెండవ ప్రపంచయుద్ధము రానే వచ్చినది; దీనితో మన దేశమునకు దెబ్బతగులునను భయము హెచ్చినది. రష్యా యుద్ధప్రవేశము ప్రజాయుద్ధమను భావమంకురింపఁజేసినది. ఆత్మ ప్రణయపరమైన నవ్యసాహిత్యముపైఁ దిరుగుబాటు పొసఁగినది. ప్రేయసిని, కోకిలను విడిచి మనదేశస్థితిని పర్యాలోచింపవలసిన కాలము వచ్చినది. ప్రభువు, పాలేరు సమానమను భావ మంకురించినది. దేశాభ్యుదయమే నేటి మన రచయితల పరమాశయమని గ్రహించినారు. ప్రజావాఙ్మయ సూత్రము లాదర్శకములైనవి. అక్కడి సామ్యవాదము కృషి ఘనత్వ (Dignity of Labour) సిద్ధాంతములు మనదేశమున కనూదితములైనవి; కాని నియంతృత్వరేఖ లీలగా నిందును బొడసూపుచున్నది. వీనికన్నిటికి ఫలితముగా 'అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘము' స్థాపితమైనది. అన్ని భాషలలో నుపసంఘము లేర్పడినవి. మనదేశములో వివిధ భాషాసాహిత్యము లనేక ముఖముగా నడుపవలెనని వీరి కుతూహలము. వైమనస్యములులేక "దేశస్థులంతా చెట్టపట్టాల్ పట్టుకొని" నడవవలెనని వీరి సంకల్పము. ఆదర్శము లుత్త

మము తెలసవే; కాని యాచరణములోఁ బెట్టుటకుఁ బ్రయత్నము లత్యంతముగా జరుగవలసి యున్నవి.

### నూతన చైతన్యము

ఆంధ్ర సాహితీలోకమున నేడు నూతనచైతన్యము కలిగిన దనక తప్పదు. దేశభాషాసేవకులను గుర్తించి వారిని గౌరవించుచున్నారు. ఇది శుభసూచకము. ప్రజలలో సాహిత్యాభిరుచి, గ్రంథపఠనాసక్తి యధికముగా నున్నవి. ఎచ్చట చూచినను సాహిత్య సమావేశములు, కవి సమ్మానములు కన్నులపండువుగా జరుగు చున్నవి. ఎన్నెన్నియో ప్రచురణ సంఘములు, సారస్వతసమితులు పుట్టుచున్నవి. గ్రంథ ప్రచురణ మత్యంతముగా జరుగుచున్నది. పత్రికలు హెచ్చినవి. తదనుగుణముగా రచయితలకు లెక్కయే లేకున్నది. ఈ విధముగా వాఙ్మయము విరివిగాఁ బెరుగు చున్నది. ఏజాతి సంస్కృతియైన నాభాషాసాహిత్య ప్రచారము ద్వారా జరుగుచుండును. ప్రజలు తమ సాహితీగోచిస్సులను ప్రజ్వలిత మొనర్చినచో జాత్యభ్యుదయకారక మగును. ఈ యభిప్రాయమునే మాలవ్యాజీ-

Literature was the best medium for improving the character of a nation, and by improving the vernacular literature, you will elevate the nation.

అను వాక్యములోఁ బొందుపరచినాఁడు. కావున జాత్యభ్యుదయ కారక మగు సాహిత్య మీనాటి మన వాఙ్మయములో నెంత యున్నదో పరిశీలించుకొనవలసి యున్నది.

సహృదయులారా! మిమ్ము నేను విసిగించితిని. సమగ్ర సాహిత్యస్వరూప సంగ్రహమును యథాశక్తిగా కాలానుగుణముగా మీకు నివేదించినాను. నా వి రెండుమాటలు కొరవడినవి. వాని నాదరముతో గ్రహింతురని విశ్వసింతును.

## సాహిత్యార్చకుల కర్తవ్యము

ఈనాడు సాహిత్యపోషణము ప్రజలపై నెక్కుడుగా నాధారపడియున్నది. నేటి ప్రజలలోఁ గేవల సాహిత్యాభిరుచి కలిగి నందువలనఁ బ్రయోజన మంతగాలేదు. ఉపన్యాసము లను వినోదములుగా గ్రహించినచో నవి నిష్ప్రయోజనము లగును. "ఆంధ్రుల కనైకత్వ" మను ప్రవాద మొకటి మనపై నున్నది. దీనివలననే మన సంస్థలు, ఉద్యమములు వృద్ధి నొందకున్నవి. వర్గవైమనస్యములు లేక సహృదయులై ప్రజలు సానుభూతితో తిలకించు దృష్టి నలవరచుకొనవలసి యున్నది. వివాదముల ఫలమును మనము రుచిచూచియే యున్నాము. కావున ప్రతి యాంధ్రుడును విద్యావంతుఁడై, లోకకావ్యాద్య వేక్షణముతో వ్యుత్పన్నుఁడు కావలెను. తన జాతి భాషా సాహిత్య సంప్రదాయములను పవిత్రముగా నెంచవలెను. సాహిత్యములో వివిధమతములను చారిత్రకదృష్టితోఁ జూడ వలెనేకాని పాక్షికదృష్టి పనికిరాదు.

ఉత్తమమైన మానవ జన్మము లభించినందులకు సద్వినియోగ మొనర్పవలెను. తదితర జీవులవలె గాక మానవున కాత్మభావ వ్యక్తీకరణమునకు యోగ్యత యున్నది. అతనికి విజ్ఞాన సముపార్జనమునకు వలయుశక్తి బీజ భూతముగానున్నది. కాని మానవ జీవితము పరిమితమైనది;

విజ్ఞాన మనంతమైనది. కాలముయొక్క విలువను గ్రహించి, ప్రతిమానవుఁడు తనజాతి ప్రాథక్యమును దెలిసికొనుటకు సాహిత్యార్చకుఁడు కా నధికారము సంపాదింపవలెను.

ఏది మానవ లోకమునకు హితము బోధించుచు సార్వకాలికమై సార్వజనీనమై వర్తిలు సాహిత్యమో, ఏది నిమిత్తప్రయోజనము కలదియై పరిమితానకాశము గల వాఙ్మయమో వివక్షించుకొనగల శక్తి గడించి యల్పమైన జీవిత కాలములో సాహిత్యము నర్చించి యనంత రస గ్రంథుఃం దోపినన్ని విప్పి యనుభవించుటకుఁ బ్రయత్నింపవలెను. అధికారము లేనిదే రసజగత్తులోఁ బ్రవేశము లభింపదు. ఈ లోకములో సుఖమును మోసములతోడను, లంచములతోడను పొందగలుగుదుమేమో కాని, కావ్యజగత్తులో నానంద మట్లు సులభముగా లభింపదు, దీనినే—

'It is open to labour and to merit but to nothing else. No wealth will brive, no name overawe, no article deceive the guardian of these Elysian gates.'

అని రస్కిన్ పండితుఁడు ప్రవచించినాఁడు.

కావున ప్రతియాంధ్రుడును తమసాంబుధినుండి తెప్పరిల్లి, కాలముయొక్క విలువనుగుర్తించి, వ్యుత్పన్నుఁడై, ఉత్తమ సంస్కారియై, స్వస్థాన వేష భాషాభిమానము కలిగి, సాహిత్యార్చనము చేసి యాత్మవికాసము పొంది తపస్వి గావలెను. సాహిత్యార్చకులు తా మధికారముచే మథించి దర్శించిన రస తత్త్వమును విమర్శలద్వారా తిరిగి లోకమున కందఁజేయువలెను.

ఆంధ్రసాహిత్యములోని వెలుఁగుజిలుఁగులను విప్పి చూపునట్టి గ్రంథములు నేఁడు విరివిగా రావలసియున్నవి. తాత్కాలిక ప్రయోజనమును దీర్చుకార్యములకన్న శాశ్వతముగా మన జాత్యభ్యుదయమును జాటుకార్యములలో ప్రజాసంస్థలు, సాహిత్య పరిషత్తులు పాటుపడవలెనని సవినయముగా మనవిచేయుచున్నాను. ఏనాఁడు ప్రతి యాంధ్రుఁడట్టి కార్యాచరణమునకు దీక్షవహించి దానిని సాధించునో యానాఁడే తెలుఁగుజాతి సంపూర్ణావకాశమును బొంది సర్వాంగసుందరముగా విరాజిలును; అంధతమసము లడుగంటి జ్యోతిర్లోకమునకు సుగమమైన మార్గ మప్పుడుగాని యేర్పడదు. ఆ శుభప్రదమైన ముహూర్త మనతికాలములో రాఁగలదని విశ్వసింతును.

'అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతి ర్గమయ
మృత్యో ర్మా ఽ మృతం గమయ'

# సాహిత్యార్చనము

మానవునకు హితమును బోధించునదియు, లోకము లోని దృశ్యముల నుదాత్తములు చేసి, సకలశాస్త్రములతో సమన్వయించి యాత్మబోధచే నుత్తమ సంస్కారమును గలిగించునదియు, సాహిత్యమని మహాత్ములు నిర్వచించు చున్నారు.[1] కావ్యప్రపంచ మంతటిని సాహిత్యముక్రింద పరిగణించినారు. నిత్యవ్యవహారములో జరుగుచున్న రచనా వ్యాపార మంతయు విశాలావకాశము కలిగిన వాఙ్మ యములోనికి వచ్చును.[2] సాహిత్య మను పదములో విశిష్టత యున్నది. మహాకవి యెంతటి పూర్ణుడో సాహిత్య మంతటి పూర్ణత్వము కలిగినది. సాహిత్య మాలోచనామృతమును బ్రసాదించునట్టిదని శ్లోకకారుడు సూత్రించినాడు :

సంగీత మపి సాహిత్యమ్ సరస్వత్యాః కుచద్వయమ్
ఏక మాపాత మధురమ్ అన్య దాలోచనామృతమ్॥

ఇంత మహిమగల సాహిత్యమునకు సృష్టికర్త కవి. అతడుపాసకుడై. ప్రజ్ఞావంతుడై, విశ్వమానవ కల్యాణార్థమై ప్రవక్తగా ప్రతియుగమున నవతరించుచుండును. ఈ కవి తాను సృజించిన సాహిత్యముద్వారా బ్రహ్మానంద సహో దరమగు రసానందానుభవమును బ్రసాదించును.

---

1. 'హితేన సహితం సాహిత్యం' 'సహితస్య భావః సాహిత్యం'
2. చూ, 'సాహిత్యోద్దేశము'లో ప్రథమభాగము.

మానవుఁడు నిరంతరసౌఖ్యాన్వేషి. లోకములోఁ దాను జేయు ప్రతికార్యములో నీసూత్ర మన్వయించును. సుఖము లౌకికమైన కారణములచేఁ గలుగు చిత్తరంజక స్థితికిఁ జెందినది. ఈ లౌకిక సుఖమునే కవి చిత్రించి దానిని లౌకికమైన యానందముగా పరివర్తనము చేయును. ఆనందము, సుఖమువలె లౌకికము, నశ్వరముగాక యుత్తమము, శాశ్వతము నగు మనోరంజకస్థితికిఁ జెందినది. లౌకికానందమున కును పారలౌకికానందమునకును మధ్యస్థితిని కావ్యానంద మాక్రమించుచున్నది. లౌకికానందము కన్న నుదాత్తమై, పారలౌకికానందమునం దాస్థ కల్గించునది కావ్యానందము. విజ్ఞానవంతుఁడైన మానవుఁడు లౌకిక సుఖములకు వీగిపోవక శాశ్వతానంద ప్రదాయినియగు రసమూర్తి నన్వేషించుటకు సాధనము చేయ సంకల్పించును. సాహిత్యార్చనముచే మానవుని చిత్తము సంస్కృతమై బ్రహ్మజ్ఞాన సముపార్జనమున కున్ముఖ మగును. ఈ విధముగా సాహిత్యార్చనము మోక్ష సాధనముగాఁ బర్యవసించును.

సాహిత్యార్చనమునకుఁ గడంగుటకు మున్ను మాన వుఁడు కొంత యధికారము సంపాదింపవలెను. దేవతార్చన మొనర్చుట కే విధముగా భక్తి లేక నమ్మకము కుదుర వలెనో యట్లే సాహిత్యార్చనమున కభిరుచి [1] కవివాక్య మందుఁ బ్రామాణ్యము లలవడవలెను. ఈ యభిరుచి లేనిదే సాహిత్యావరణములోఁ బ్రవేశించుట నాస్తికుఁడై దేవాలయ ప్రవేశ మొనర్చినట్లగును. వినోదముకొఱకు కర్చుచేసిన

1 "Literary taste" *by* Arnold Bennett.

నవపేశమునకు సరియగును. కావున నిష్కళంకమైన మనసు కలిగి విజ్ఞాన చక్షువు లందుకొను పవిత్రభావముతో సాహిత్యము నర్చింపవలెను.[1] సాహిత్యాభిరుచి యలవరచుకొన్న పిమ్మట మానవుఁడు లోకకావ్యాది పరిశీలనము వలనఁ, బండితుల యుపన్యాసాకర్ణనము వలన సంప్రదాయజ్ఞులైన మహాత్ముల సంసర్గము వలన, చక్కని సంస్కారి కావలెను. కేవల పండితుఁడై శబ్దసాధుత్వాసాధుత్వముల నెన్నుట పాడిగాదు. రసపిపాసియై తాను, భావమునకు శబ్దార్థములు వస్తువుల నంటిపెట్టి యొంగి యా రసభావము నందుకొనుటకు సహృదయుఁడై యత్నింపవలెను. కవిహృదయ ప్రవేశము చేసి యాతని భావమును గ్రహింపవలెనే కాని కవియొక్క దేశకాల మానసిక పరిస్థితులను ద్రోసివేయరాదు.[2] సాహిత్యార్చకుఁడు ముఖ్యముగా గమనింపఁదగిన సూత్రమిది. ముందుగాఁ గవిపై నే విధమైన కలుషభావము లుంచరాదు. గుణగ్రహణపారీణు లగుటయే సాహిత్యార్చకుల పరమధర్మముగాఁ బరిగణింపవలెను. బ్రహ్మానందము ననుభవించుట కెట్లు మానవు లుత్తములై యుపాసకులు గావలయునో యట్లే కావ్యానందము ననుభవించుటకు సాహిత్యార్చకులు తపశ్శీలురై యుండవలెను. అధికారము నార్జింపనిదే యానందాప్తి లేదు. సాహిత్యము మానవ లోకమునకే యుద్దేశింపఁబడినది. ఈ యమృత

1 You must love them (Poets) and show your love.

2 To enter into theirs (thoughts) observe; not to find your own expressed by them. ...*Ruskin*.

భాండము నుపయోగించుకొని ఫలమందుట మానవుల విధి. భగవదర్చనమున కెంత చిత్తస్వాస్థ్యము, నాస్థ కావలెనో యంతటి కేంద్రీకరణము, రసతృష్ణ సాహిత్యార్చన మొనర్చుటకు వలసి యున్నవి.

అర్చనా ఫలితముగా సాహితీలోకములోని పాత్రములతో గాఢస్నేహము కలుగును. వారితోఁ గ్రమముగా తాదాత్మ్యము పొందుట తటస్థించును. అచటి యాదర్శ శీలవంతులతో సాహచర్య మబ్బి వారితో సానుభూతినంటపొసఁగును. ఇది కవియొక్క పాత్రిచిత్రణా వైశిత్యమునుబట్టె యర్చకుని యాత్మశుద్ధి, బుద్ధి తీక్ష్ణతల ననుసరించి కలుగుచుండును. ఈ విధముగా సాహిత్యార్చనము జాత్యభివృద్ధికిఁ గారక మగుచుండును.

సామాజికుని పాండిత్య పరిశీలనాశక్తుల ననుసరించి తదనుగుణముగా సాహిత్యములోని యమృతము పొడముచుండును. మథించినకొలఁది యానంద మధికముగా వెలువడుచుండును. కృషి లేనిదే ఫల మందదు. లౌకిక సౌఖ్యము పొందినట్లు లంచములతో మోసములతో నీ సాహిత్యామృతమును బొందఁజాలరు. సాహిత్యము కావ్యపరమైనది.

కవిత్వము లయాన్వితమైనది. ఛందస్సనునది లయను బురస్కరించుకొని వచ్చినదే. కవితలో నాద మంతర్వాహినిగాఁ బ్రవహించుచు శబ్దముల రూపులతో బయటికి గన్పించుచుండును. కవి యా శబ్దములకుండు నర్థముల ద్వారా భావస్పందము గల్గించును. మన కున్న సాహిత్యము భావ

రాగ తాళమయము. భావసౌకుమార్యమును, నాదమాధు ర్యమును, శబ్దవైచిత్రిని ప్రత్యేకముగాఁ బోసఁగించుచు నలరించు కవు లున్నారు.

మన తెలుఁగుభాష సహజముగా గానయోగ్యమైనది. ల, న, స అను నక్షరములు వివిధ సంపుటులలో మేళనము పొంది మధురమంజుల నాదము నీనుచుండునని తెలియుదుము. కొన్ని యక్షరముల పౌనఃపున్యము దరువు వేసినట్లు గతికలిగి యుండును. 'నానాసూనవితాన వాసనల నానందించు సారంగ మేలా' అనుపాదములో, 'అభంగ తరంగ మృదంగ' అను స్థలములోఁ, బై రెంటికి నుదాహరణము లగుపించును. శబ్ద వైచిత్రి మనప్రబంధములలో బహుళముగాఁ గన్పించుచున్నది. భావోపాసకు లనేకులున్నారు. పోతన కవితలో భావప్రాధాన్య మగుపించును. నవ్యులు భావకవు లను పేరు వడసినారు.

ఎనకజన్మములోన ఎవరమో నంటీ
సిగ్గొచ్చి నవ్వింది సిలక నా యెంకీ!
ముందు మన కేజన్మ ముందోలె యంటీ
తెల్ల తెలపోయింది పిల్ల నా యెంకీ!
ఏన్నాళ్ళు మనకోలె యీ సుకము లంటీ
కంట సీరెట్టింది జంట నా యెంకీ!

అను పాదములలో శబ్దమున కన్న భావమునకు గౌరవ మున్నది. ప్రణయ కీర్తనములో లోకతత్త్వమును గవి పొదిగినాఁడు. భావప్రకాశము వలననే తత్త్వ స్ఫురణము కల్గించుటకుఁ బ్రయత్నించినాఁడు. పునర్జన్మ సిద్ధాంతమును

జన్మ జన్మలకుఁ దొంటి భర్తయే వలయుననెడి యుత్తమ స్త్రీ యభిలాషను జోడించి ప్రతిపాదించినాఁడు. ఈ విధముగా నవ్యులు ముఖ్యముగా భావోపాసనులు. కావుననే వారి రచన భావకవిత్వ మనెడి పేరుగాంచినది. సాహిత్యార్చకులు పక్షపాతము లేకయుండి, ప్రతి విధానములో నున్న విశిష్టతను గ్రహించు శక్తి యలవరచుకొనవలయును.

సాహిత్యము సత్యమును బోధించును; అనుభవ రహస్యముల విప్పిచెప్పును. సౌందర్య స్వరూపమును సాక్షాత్కరించును. ఇంతటి బోధచేయుటకుఁ గవి యెంత ప్రజ్ఞావంతుఁడు గావలెనో గదా! ఇట్టి ప్రతిభావంతులు పల్వురు తమజీవితము లన్నియు ధారవోసి, తపో ఫలితముగా దర్శించిన విశ్వసత్యములతోఁ గూడిన మహాకావ్య సమూహమైన సాహిత్యము మానవలోకము పాలిటి పెన్నిధి యని వేరుగా చెప్పవలెనా? ఈ నిధిని భద్రపఱుపవలసిన బాధ్యత ప్రజలపై నున్నది. దానిని దుర్వినియోగము చేయక, దాని వలన సంక్రమించు సంస్కృతి నంతటిని పుణికిపుచ్చుకొనవలెను. గతానుగతికమయిన నిత్యజీవితమువలన ప్రయోజనము శూన్యము. ఏజాతి తన భాషాసాహిత్యములను నిలువఁ బెట్టుకొనక పోయిన నా జాతి నిర్వీర్య మగును. [1]

---

1 "The care of the national language is at all times a sacred trust and the most important privilage of the members of a society. Every man of education should make it the object of his increasing concern to preserve his language, pure and simple, to speak it so far as in his power in all its beauty and perfection. A nation whose

ఇతర భాషాసాహిత్యముల విూఁద మోహముతో మన భాషాసాహిత్యములను న్యూనతగాఁ జూడరాదు. మన సంప్రదాయమును, సభ్యతను బవిత్రముగా నెంచి నిలుపుకొనవలయును. ఏ జాతియొక్క ప్రాధాన్యమైనను భాషాసాహిత్య సంప్రదాయములవిూఁద నాధారపడియుండునని తెలియవలెను. మానవుఁడు జీవనోపాధి నిమిత్తమై యేమార్గ మనుసరించినను తన జాతిసాహిత్యముతోఁ బరిచయము విధిగా కలిగియుండవలెను. కేవలము పండితులకే సాహిత్యాస్వాదన ముద్దేశితమైనదని తలంపరాదు. సాహిత్యము జాతియొక్క సమష్టినిధిగాని ప్రత్యేకవ్యక్తుల సొత్తుగాదు. లోకములో మానవులే బుద్ధిమంతులు. తామా బుద్ధిమత్తను సాహిత్యాస్వాదనమునకు వినియోగించి యుత్తమ సంస్కారులు కా నభిలషింపవలెను.

సమగ్ర సాహిత్య స్వరూప సాక్షాత్కారమైన పిమ్మట సాహిత్యార్చకు లొనర్పవలసిన కర్తవ్య మొకటి యున్నది. వ్యాఖ్యాత లేనిదే కవిప్రభ వెలుగదని యొక యాంగ్ల సూక్తి యున్నది. విమర్శనమే కవిత నుద్దీపించ చేయును. ఆంగ్లసాహిత్యము నవలోకించిన దీని యంతరార్థము వ్యక్తమగును. ఆంగ్లసాహిత్య మెంత యున్నదో దానికి మూఁడంతలు వ్యాఖ్యాన సారస్వత మున్నట్లు చూడఁగలము.

language becomes rude and barbarous must be on the brink of barbarism in regard to everything else. A nation which allows her language to go to ruin is parting with the best half of her intellectual independence and testifies her willingness to cease to exist." Malavyaji

1 It is the critic that makes a poet.

కావున మన సాహిత్యము ప్రకాశించుటకు సహృదయ పూర్వకమైన విమర్శదీపికలు వెలుగొందవలెను. అంతవఱకు మన సాహిత్యమునకుఁ బ్రశస్తి లేదు. ఈనాఁడు సాహిత్యార్చనకు లావిధమైన లోపమును దీర్పవలసియున్నదని మనవి.

మొట్టమొదట ప్రజలకు సాహిత్యాభిరుచి యలవరచవలసిన శాధ్యత పండితులపై నున్నది. ప్రజలందఱు విద్యావంతులైన గాని జాత్యభ్యున్నతి లేదని గమనింప వలెను. సహృదయ దృష్టితో లోక కావ్యములఁ జూచి ప్రజలు వ్యుత్పన్నులు కావలెను. పిమ్మట సరియైన సాహిత్యార్చకులై కావ్యామృతము గ్రోలి యాత్మ వికాసము చేకూర్చుకొనవలెను. పశు పక్ష్యాదులకన్న తా మొనర్చిన ఘనకార్య మేమో పరీక్షించుకొనవలెను. బహిర్మా పదార్థాన్వేషణములో రక్తిని భక్తి శక్తులను సమకూర్చుకొనవలెను; ఉత్తమ జన్మము లభించినందులకు దానిని సద్వినియోగము చేసికొనవలెననెడి జ్ఞానము కలుగనవలెను; లేనిచో తరుణోపాయము సున్న!

సాహిత్యార్చనమునకుఁ బవిత్రమైన, ప్రశాంతమైన మందిరములు గావలెను. గ్రంథాలయములు సరస్వత్యాలయములు. వీనిని నెలకొల్పి యుద్ధరించుటయం దెంత శ్రమపడవలెనో యంతకంటె నెక్కుడుగ వీనివలనఁ జేకూరు ఫలము నకై పాటుపడవలెను. కేవల గ్రంథాలయ నిర్మాణమం దుత్సహించి, తత్ఫలితము నొందకుండుట దైవప్రతిష్ఠయొనర్చి

నిత్యనై వేద్యములు పెట్టుచుండుటవంటి దగును. కావున ప్రతి మానవుఁడు విద్యావంతుఁడై, సరస్వత్యుపాసకుఁడై, సాహిత్యార్చనా ఫలితముగా సంస్కారియై జాత్యభ్యున్నతికిఁ బాటు పడవలెనని యర్థించుచున్నాను.